21 ఆగస్టు 2004న హైదరాబాద్ రవీంద్రభారతిలో జరిగిన

# సంగమ్ ఫిలిం అవార్డ్స్-2003

కార్యక్రమంలో...



ఉత్తమ నేపథ్య గాయకునిగా అవార్డును స్వీకరిస్తున్న ఎస్.పి.బాలుతో నేరెళ్ళ వేణుమాధవ్, పి.వి.రాజేశ్వరరావు, సారిపల్లి కొండలరావు



ఉత్తమ హాస్యనటునిగా అవార్డును స్వీకరిస్తున్న బ్రహ్మానందంతో పి.వి.రాజేశ్వర్‌రావు, నేరెళ్ళ వేణుమాధవ్, సుభాన్‌రెడ్డి, సారిపల్లి కొండలరావు, ఎస్.పి.బాలు, సంజయ్‌కిషోర్



ఉత్తమ సంగీత దర్శకునిగా అవార్డును స్వీకరిస్తున్న కీరవాణితో పి.వి.రాజేశ్వరరావు, సుభాన్‌రెడ్డి, చిత్ర



ఉత్తమ గీత రచయితగా అవార్డును స్వీకరిస్తున్న చంద్రబోస్‌తో, నన్నపనేని రాజకుమారి, చిత్ర



ఉత్తమ గాయనిగా అవార్డును స్వీకరిస్తున్న చిత్రతో సారిపల్లి కొండలరావు, కీరవాణి



ఉత్తమ పత్రికగా ఎన్నికైన 'హాసం-హాస్య, సంగీత పత్రిక' ఎడిటర్‌గా చిత్ర నుండి అవార్డు స్వీకరిస్తున్న రాజా



ఉత్తమ సంగీత దర్శకునిగా స్పెషల్ జ్యూరీ అవార్డును చిత్ర నుండి స్వీకరిస్తున్న కమలాకర్



ఉత్తమ గాయకునిగా స్పెషల్ జ్యూరీ అవార్డును చిత్ర నుండి స్వీకరిస్తున్న వేణుతో సంగమ్ అకాడమీ అధ్యక్షుడు సంజయ్ కిషోర్

# ఇదీ సంగతులు

71

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net:
www.haasam.com

ముఖచిత్రం
'సై' చిత్రంలో
నితిన్,
జెనీలియా డిసౌజా



## హాస్యం











## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం

స్థలాభావం వల్ల 'చౌచౌ చౌరస్తా', 'సరిగపదమని ఫలితాలు' ఈ సంచికలో వేయలేక పోయాం. వచ్చే సంచిక నుండీ యథావిధిగా ఉంటాయి.

పాత పాటల ప్రత్యేకం
71 వ పేజీ నుండి 74 వ పేజీ వరకూ





'హాసం' 16-31 జులై సంచికలో ప్రచురితమైన నా జోక్సుకుగాను మీరు పంపిన 'సత్యం' ఆడియో సి.డి. సంతోషంతో అందుకున్నాను. మీ సంతకంతో ఉన్న ఉత్తరం మరింత ఆనందం కలిగించింది. ఇన్ని ఆనంద, సంతోషాల మధ్య మీరు పంపిన 'హాసం' పత్రిక కాంప్లిమెంటరీ కాపీ అందుకుని చాలా బాధపడ్డాను. మీరేమి అనుకోనంటే నాదొక చిన్న అభ్యర్థన. నా రచన పడిన పత్రికను నాకు పంపవద్దని నా మనవి. ఎందుకంటే పది రూపాయలిచ్చి ఒక మంచి సాహితి విలువల గల పత్రికను కొని సాహిత్యాన్ని నిలబెడుతున్నాననే తృప్తి నాకు మిగల్చండి ప్లీజ్. ..ఆ పత్రికను ఏదైనా గ్రంథాలయానికి పంపండి. మీరు చేస్తున్న కృషిని పదిమంది చదివి ఒక్కరు మీ పత్రికకు అభిమానిగా మారినా నాకు ఆనందం, తృప్తి, దయచేసి అపార్థం చేసుకోవద్దని మనవి.

**-మామిడి మహేంద్ర, పూణే.**

16-31 ఆగస్టు హాసం సంచికలో మృణాళిని గారి 'రఫీ హాస్యగీతాలు' వ్యాసం వివరంగా వున్నది. మృణాళిని గారికి పాత హిందీ పాటలపై ముఖ్యంగా రఫీగారి గురించి ఇంత పట్టు వుండడం మాకు చాలా సంతోషం కలిగించింది. నేను 5వతరగతిలో 6వతరగతిలో చదువు తున్నప్పుడు 'గుమ్‌నామ్' సినిమా విడుదలైంది. మా పెద్దవాళ్ళతో కలిసి ఆ సినిమాకు వెళ్లాను. కాని ఆ వయస్సులో నాకు సినిమా పూర్తిగా అర్థం కాలేదు. 'హమే కాలే హైతో క్యాహువా దిల్ వాలే హై' పాట మాత్రం నాకు ఇప్పటికీ గుర్తుంది. ఆ పాటను పూర్తిగా ఇచ్చినందుకు కృతజ్ఞతలు.

**-ఏలూరు అశోక్‌కుమార్‌రావు, గుర్రంపోడ్.**

'హాసం' హాస్య సంచిక అంటే కేవలం హాస్యానికి సంబంధించిన జోక్స్ ఉండొచ్చు అనుకొని పెద్దగా చదవటానికి ఇంట్రెస్టు చూపలేదు. కాలక్షేపంగా మావారు తెచ్చిన హాసం చదివి చాలా ఆశ్చర్యపోయిన నాకు యిప్పుడు హాసం నా కెంతో ఇష్టమైన పత్రికగా మారింది. ముఖ్యంగా మీరు యిస్తున్న పాత హిందీ, తెలుగు పాటలు నాకెంతో యిష్టమైన శీర్షిక. ముఖ్యంగా రికార్డు చేయించుకొందామన్న దొరకని పాటలు మీరు యిస్తున్నారు. మీరు యిచ్చిన 'మయూరి' పాటలు నాకెంతో యిష్టమైనవి. ప్రతీ పేజీని సర్వాంగ సుందరంగా వల్గారిటీ లేని హాస్యంతో తీర్చిదిద్దుతున్న మీకు నా శుభాకాంక్షలు.

**-ఆర్. సత్యరాజన్, కరీంనగర్.**

'హాసం' ఈనెల ద్వితీయ పత్రికలో మీ సంక్షిప్త నవలీకరణ "అన్నమయ్య" చదివాం. చదివాం అంటున్నానే గాని నిజానికి ఒక సంక్షిప్త శబ్ద చిత్రం విన్నాం అనిపించింది. కళ్లెదుట అక్షరాలు కదులుతున్నాయి. పదాలు ముందుకు దొరలిపోతున్నా అవి సెల్యులాయిడ్ పై ఫ్రేముల్లాగ కనుపించాయి. కాబట్టి చదువుతూ విని చూశాం అనటం బాగుంటుంది. అనంత అన్నమయ్యను అత్యంత సంక్షిప్తంలో మీరు ఆవిష్కరించిన తీరు అభినందనీయం. సంగం అకాడమీ అవార్డు పొందుతున్న శుభతరుణంలో మా శుభాకాంక్షలు. ఇంకా ఎన్నెన్నో అవార్డులను పొందాలని అభిలాష.

**-వై.శివరామప్రసాద్, రామోజీ ఫిలింసిటీ.**

'హాసం'లో 'అన్నమయ్య' సినిమా సంక్షిప్త నవలీకరణ చదివాను. మళ్లీ ఆ సినిమాను చూస్తున్న అనుభూతి కలిగింది. రాజాగారికి కృతజ్ఞతలు. 'హ్యూమరథం' శీర్షికన "అల్లుడు రామలింగయ్య" వ్యాసాన్ని సందర్భాలతో సహా వివరించిన శ్రీరావికొండలరావు గారికి కృతజ్ఞతలు. 'అపాత మధురం'శీర్షికన 'విమల' సినిమాలోని మిగతా పాటలను కూడ ఇస్తే రాజాగారికి కృతజ్ఞురాలిని. ఈశీర్షికన విజయా వారి 'సత్య హరిశ్చంద్ర' పాటలు ఇవ్వడానికి మమ్ములను ఆనదింపచేయడానికి ప్రయత్నించు తారని ఆశిస్తున్నాను.

**-ఎ. విజయలక్ష్మి, గుర్రంపోడ్.**

'హాసం' ఆగస్టు 16-31 పత్రికలో ప్రచురించిన పాత పాటలు బాగున్నాయి. ముఖ్యంగా ఈ 'పాత పాటల ప్రత్యేకం' శీర్షిక ద్వారా ఎన్నో మాకు బయట లభించని పాత సినిమా పాటలను ప్రచురిస్తున్నందుకు కృతజ్ఞతలు. 16-31 పత్రికలో అన్నమయ్య పాటలను సందర్భసహితంగా ప్రచురించారు. మునుముందు కూడ ఇలా సందర్భ సహితంగా ప్రచురించగలరని నా మనవి.

**-ఎ. శశికిరణ్,రాగంపేట.**

1- 15 ఆగస్టు సంచికలోని 'సినీగీతం - సినారె మనోగతం'ను, నేటి రచయితలు, గాయకులు తప్పక చదివి, సంగీత సాహిత్య, అద్దంలో ప్రతిబింబాన్ని ఒకసారి చూసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది. తనికెళ్ళ భరణిగారు 'ముత్తుస్వామి దీక్షితులు'వ్యాసం, జమునగారు వినిపించే 'నేను-నాపాటలు', కథానాయకుడిగా రఫీ, ప్రతి పేజి గర్వకారణమే!

**-దుర్గమహంతి మోహనరావు,హైద్రాబాద్.**

'హాసం' ఆగస్టు (1-15)సంచికలో ప్రచురిత 11-8-04 మైన జోక్‌కు బహుమతిగా పంపిన ఆడియో సి.డి.ని అందుకున్నాను. కృతజ్ఞుణ్ణి. అదేసంచికలో అశేష ప్రేక్షక జనాన్ని ఉర్రూతలూగించిన 'మెరెమెహబూబ్' పాటపైన సమగ్ర వ్యాసం అద్భుతంగా ఉంది. కథనాయకుడిగా రఫీ వ్యాసం కూడా చాలా బాగుంది. మృణాళిని గారు ఎంతో అభినందనీయులు. మెరెమెహబూబ్ పాటపై సుదీర్ఘ వ్యాసం వ్రాసిన మృణాళినిగారు, ఆ పాటకు దీటైన- "దిల్ జో న కెహసకా, వాహి రాజెదిల్" (భీగీరాత్) పాటను కేవలం ప్రస్తావించి ఊరుకోవడం బాగలేదు. ఆ పాటపై కూడా ఓ చక్కని వ్యాసం ప్రచురించండి. వీలుకాని పక్షంలో పాటపూర్తి పాఠాన్ని ప్రచురించండి. ఇంతకముందే ప్రచురించినట్లయితే, ఆ సంచిక వివరాలు తెలియజేయండి.

**-పులిపాకతాజుద్దీన్, జయపూర్.**

**(1-15 జులై 2004 సంచికలో అంటే ఈ మధ్యనే ఆ పాట గురించి ప్రచురించాం. మీరు చదవకపోవడం మా దురదృష్టం. - ఎడిటర్)**

16- 31 ఆగస్టు 2004 సంచిక ఎడిటోరియల్ ఆణిముత్యం. మ్యూజిక్ ఆల్బమ్ పేరిట విశృంఖలంగా, జుగుప్సాకరంగా, వికృత వేషాలు వేస్తూ, టివిలో అశ్లీలాన్ని ప్రసారం చేస్తున్నారు. ఆణిముత్యాల్లాంటి పాత హిందీ పాటలకు రిమిక్స్ పేరిట భ్రష్టు పట్టిస్తున్నారు. యువతను చీడపురుగులా పాడుచేస్తున్న ఈ ప్రసారాలు ప్రభుత్వం నియంత్రించకపోతే సాంఘిక సమస్యగా మిగులుతుంది. ఇక పోతే రఫీ పాడిన హాస్య గీతాల్లో 'చోటిబెహన్' చిత్రంలోని పాటలో చాంద్ కే బరాబర్ కాదు 'చార్‌కా బరాబర్ అని ఉండాలి. అంటే నాలుగు కాళ్ళతో సమానంగా రెండు కాళ్ళుకలవాణ్ణి అని అర్థం.

**-ఏనుగొండ విద్యాసాగర్, హైద్రాబాద్.**

**(అవును. మీరు కరెక్టు. పొరపాటు మాదే. - ఎడిటర్)**

"అన్నమయ్య" సినిమా పాటలతో "సంక్షిప్త నవలీకరణ" బాగుంది. అన్నమయ్య కీర్తనలలో వాడిన భాష ఆనాటిది. చాలా మాటలకు అర్థాలు ఎంతో మందికి తెలియదు! ఉదాహరణకు జగడపు చనవుల జాజర సఖినిల మంచపు జాజర అంటే ఏమిటి? పొడగింటిమయ్యా అంటే అర్థం లేమిటి? ఈ మాటలకు అర్థాలు, ఆ కీర్తనలలోని స్వారస్యం తెలియచెబుతూ ప్రచురిస్తే ఇంకా బాగుండేది. ఎందుకంటే, తమిళ హిందీ పాటలులాగే ఇవి కూడా 'అర్థం చేసుకుని, ఆస్వాదించి తీరవలసిన కీర్తనలు. ఇది సంక్షిప్త నవలీకరణ మాత్రమే కనుక, ఇప్పుడు అటువంటి అర్థం తాత్పర్యాలకు తావులేదని సరిపెట్టుకుంటూ, త్వరలో 'అపాత మధురంగా' ఈ కీర్తనలు పూర్తి వివరణలతో మళ్లీ వస్తాయని ఆశించవచ్చా? 'హాసం' మాత్రమే ఈపని చేయగలదు.

**-పి.జగన్నాథరావు, విశాఖపట్నం.**

**(ఈ ఆలోచన చాలా కాలం క్రితమే వచ్చి మొన్న మే నెలలో మా ప్రయత్నాన్ని మొదలుపెట్టి పూర్తి చేశాం. అతి త్వరలో తిరుమల తిరుపతి దేవస్థానంకి చెందిన గాయకుడు జి.బాలకృష్ణప్రసాద్ ద్వారా కొన్ని అన్నమయ్య సంకీర్తనలను అర్థ తాత్పర్యాలతో అందించబోతున్నాం. - ఎడిటర్)**

సంపుటి: 3 సంచిక:23
1-15 సెప్టెంబరు 2004
పేజీలు: 76
విడి ప్రతి : రూ. 10-00
సంవత్సర చందా: రూ. 200
విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50
జీవిత చందా: రూ. 2000
విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

71

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

వ్యక్తి కావచ్చు , వస్తువు కావచ్చు, ప్రక్రియ కావచ్చు - ప్రాధాన్యత తెలియాలంటే అవి లేనప్పటి పరిస్థితి ఊహించి చూడాలి. నిజజీవితంలో నేపథ్యసంగీతం ఉండకపోవచ్చు (ఆ మాట కొస్తే పాటలూ, పద్యాలూ కూడా ఉండవు) కానీ జీవితాన్ని తెరకనువదించే క్రమంలో భావవ్యక్తీకరణకు, సన్నివేశాల 'మూడ్' కు దోహదం చేస్తుందా నేపథ్య సంగీతం. టీవిలో డైలాగ్స్ లేని సన్నివేశాలను 'మ్యూట్' చేసి చూస్తే ఎంత వెలితిగా ఉంటుందో ఒక్కసారి అనుభవించి చూసినవారికి వేరే చెప్పనవసరం లేదు. ఉదాహరణకు వీడియోలో 'అన్నమయ్య' చూస్తూ క్లయిమాక్స్‌నీ, అన్నమయ్య పల్లకిని శ్రీనివాసుడు భుజాని కెత్తుకున్న సన్నివేశాన్నీ మామూలుగా ఒకసారి, నిశ్శబ్దం చేసి మరోసారి చూస్తూ గమనించండి. తేడా మీకే తెలుస్తుంది.

నిజానికి పద్యాలకే కాదు, సంభాషణలలో స్వారస్యాన్ని ప్రస్ఫుటీకరించేందుకు నాటకాల కాలం నాడే హార్మోనియం ఉపయోగించారు. వాచిక ప్రధానమైన నాటకరంగం నుండి దృశ్య ప్రధానమైన సినిమారంగానికి ఎదిగేసరికి మరిన్ని వాయిద్యాలు కావలసి వచ్చాయి. దర్శకుడు ఊహించిన 'మూడ్' సృష్టించేందుకు, అతి తక్కువ మాటలతో 'కథ' నడిపేందుకు వాద్యసహకారం ఎంతో అవసరం. ఒక పాటకు దారితీసేందుకు కూడా నేపథ్యసంగీతం ఉపకరిస్తుంది. దీనికి గాను సంగీతదర్శకుడు, సినిమాదర్శకుడితో చర్చించి అతనితో సమానంగా సృజనాత్మక ప్రతిభను కనబరచాలి. బర్మన్ వాద్యసహకారం లేనిదే గురుదత్ 'ప్యాసా'లో అటువంటి మూడ్ క్రియేట్ చేయగలిగేవాడా? అనిపిస్తుంది.

నేపథ్యసంగీతాన్ని సమకూర్చడాన్ని సినీపరిభాషలో 'రీరికార్డింగ్' అంటారు. ఈ విద్యలో సలిల్ చౌధురి వంటివారు ఖ్యాతి గడించారు. 'కానూన్', 'ఇత్తెఫాక్' వంటి పాటలులేని సినిమాలలో ఆయన ప్రతిభ కొట్టవచ్చినట్టు కనబడింది. తమిళదేశాన ఇళయరాజా, రహమాన్ వంటివారు ప్రత్యేక కృషి చేసి ప్రతి వాయిద్యానికి వ్యక్తిత్వాన్ని సమకూర్చి ప్రేక్షకుల దృష్టిలో పడేట్లు చేశారు.

ప్రత్యేక ప్రతిపత్తి గల ఈ కళ మరింత ప్రతిభావంతంగా వర్ధిల్లాలంటే అవార్డుల ప్రదానం చేసేవేళ దీనిని ప్రత్యేకంగా గుర్తించ వలసిన అవసరం ఉంది. సాధారణంగా సంగీతదర్శకుడే రీరికార్డింగు సమకూరుస్తాడు కాబట్టి వేరే బహుమతి ఇవ్వనక్కరలేదని అనిపించవచ్చు. కానీ వేర్వేరు వ్యక్తులు నిర్వహించిన సందర్భాలు ఉన్నాయి. (ఉదాహరణకు 'పాకీజా'కు సంగీతం గులాం మొహమ్మద్, నేపథ్యం నౌషాద్, 'హమ్ పాంచ్'కు సంగీతం లక్ష్మీకాంత్, ప్యారేలాల్, నేపథ్యం ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం) ఒక్కోప్పుడు పాటల ట్యూన్‌లు జనరంజకంగా లేకపోయినా ఈ అవార్డు ప్రదానం వలన రీ రికార్డింగ్‌లో ప్రత్యేక ప్రతిభ కనబరిచిన సంగీతదర్శకులకు ప్రేక్షకుల గుర్తింపు పొందే అవకాశం లభిస్తుంది. ఈ విషయం గుర్తించిన 'ఫిలింఫేర్' గత కొన్ని సంవత్సరాలుగా రీరికార్డింగుకు బహుమతిని ప్రవేశపెట్టింది.

తెలుగుసీమలో ఈ విభాగంలో అసమాన ప్రతిభ కనబరచిన సంగీత దర్శకులెందరో ఉన్నారు. కీర్తిశేషులు సత్యం రీరికార్డింగు అతి త్వరగా చేయగలిగేవారట! నంది అవార్డుల కేటగిరీలలో 'రీరికార్డింగు' విభాగాన్ని కూడా చేర్చాలని సంగీతాభిమానుల తరఫున 'హాసం' కోరుతున్నది. రీరికార్డింగుకు ప్రత్యేకమైన గుర్తింపు అవసరమా? అని ఇంకా సందేహించేవారుంటే ప్రస్తుతం థియేటర్లలో ప్రదర్శింపబడుతున్న 'శ్రీఆంజనేయం', 'అర్జున్' సినిమాలు చూస్తే సందేహాలు పటాపంచలవుతాయని మా నమ్మకం!



ప్రముఖ దర్శకుడు
శ్రీ సింగీతం శ్రీనివాసరావు
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా రాస్తున్న

కరాజు కథలు 20

# కాశీ మజిలీ



కరాజు రాజ్యంలో శంకరగిరి అనే ఊరు వుంది. ఊర్ని ఆనుకొనివున్న కొండమీద ఒక శివాలయం వుంది. అది చాలా ప్రఖ్యాతమైనది. దీన్ని చిన్న చిదంబరం అని కూడా అంటారు. ఎందుకంటే అక్కడ చిదంబరంలో లాగే గర్భగుడిలో విగ్రహంలేదు. శూన్యంగా ఉంటుంది. కనిపించని దేవుని రహస్యం గురించి పూజారి చెప్తూంటే భక్తులంతా విని దండం పెట్టుకుంటారు. కోరికలున్న వాళ్ళంతా ఇక్కడికి వచ్చి మొక్కుకుంటే మొక్కుకున్న మూడు వారాలకు శివుడు కలలో కనబడి వాళ్ళ కోరికలు ఫలించేట్టు దీవిస్తాడట. ఇలా చాలామందికి శివుడు కనిపించాడంటారు. అలా అనకపోతే వాళ్ళకు భక్తి లేదనుకుంటారని, అందుకని అలా అంటున్నారంటారు కొందరు. ఏమైనా కోరికలు లేనివాళ్ళు లోకంలో ఉండరు గనుక చిన్న చిదంబరానికి సంవత్సరం పొడుగునా భక్తులు వస్తూనే వుంటారనడంలో ఆశ్చర్యం ఏమీలేదు. రాజ్యంలో బాగా ధనబలమున్న దేవాలయాల్లో చిన్న చిదంబరాలయం అతి ముఖ్యమైనది. ఈ దేవాలయానికి రెండు దశాబ్దాలుగా కాశీవిశ్వనాథయ్య ధర్మకర్తగా వ్యవహరిస్తున్నాడు. గుడి భాగంగా ఆ ప్రక్కనే ఆ రోజుల్లోనే కట్టిన పెద్ద ఇంట్లోనే అతను కుటుంబంతో ఇన్నేళ్ళూ వుంటున్నాడు. గుడికి చెందిన ఆవులు, గేదెలు మూడువందల వరకూ ఉంటాయి. ఇవిగాక ఎన్నోఎకరాల భూమి. దేవుడికి అర్పించే నిత్యప్రసాదానికీ, ప్రతి శనివారమూ భక్తులు ఆరగించే ఉచిత భోజనాలకు కావలసిన బియ్యం, కూరగాయలు వగైరా ఈ భూముల్లోనే పండిస్తారు. ఇవి ముందు కాశీవిశ్వనాథుని ఇంటికి చేరుకుంటాయి. శబరి లాగ వీటి రుచిని అతను చూసిన తర్వాతే అవి దేవుడి ప్రసాదానికి వెళ్తాయి. వాళ్ళు నడుచుకునే తీరును బట్టి పూజారులకు కూడా కొంత అప్పుడప్పుడు అవి ముడ్తూంటాయి.

కాశీవిశ్వనాథయ్య చేసే పనులన్నీ దేవుడి పనులే గనుక అతన్ని అందరూ దేవుని ప్రతినిధిగా చూస్తారు. ఎవ్వరూ ఏమీ అడగరు. అడిగితే పాపం అనే భయం కూడా వుంది చాలామందిలో. ఇదే సమయంలో దక్షిణ వీధిలో నివసిస్తున్న కాళహస్తి కనకలింగయ్య ఆరు మాసాలు దేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించి ఎంతో పుణ్యం సంపాదించుకొని తిరిగొచ్చాడు. ఇంత పుణ్యం

దక్కించుకున్న తర్వాత శేషజీవితాన్ని దేవుడి సేవలో కొనసాగించకపోతే తన కృషి అంతా వృథా అనుకున్నాడు. దేవుడి సేవ అంటే ఇంట్లో కూర్చొని దండం పెట్టుకోవడం కాదు. ఒక అధికార స్థానంలో ఉండి దేవుని పనులు చేస్తేనే దానికొక పరమార్థం. ఇలా ఆలోచించగా అతనికి ధర్మకర్త పీఠం మీద కన్ను పడింది. ఆస్థానాన్ని తానుపొందగలిగితే తానే దేవుని ప్రతినిధియై ఎనలేని సేవలతో పరమపదాన్ని చేరుకోవచ్చు.

దీన్ని ఆచరణలో పెట్టాలంటే, రంగంలోకి దూకడానికి ముందు రహస్యంగా కొన్ని పరిశోధనలు చెయ్యాలి. రెండు దశాబ్దాలుగా కాశీవిశ్వనాథయ్య ధర్మకర్తగా ఉండడంవల్ల అందరూ ఆ పదవి ఆ కుటుంబానికి చెందిన సొత్తేననే నమ్మకంతో ఉండిపోయారు.

అతనికి ముందు ఎవరున్నారన్నది ఎవ్వరూ పట్టించుకోలేదు. కాని ఇప్పుడు కనకలింగయ్య పట్టించుకున్నాడు. ఎక్కడో మూలనున్న పాత పుస్తకాలు వెతికి తిరగ చూస్తే ఒక చిత్రమైన వాస్తవం తెలిసి వచ్చింది. కాశీవిశ్వనాథయ్యకు ముందు ధర్మకర్తగా వ్యవహరిస్తున్న వ్యక్తి భీమవరం భీమేశ్వరయ్య. అతను చాలా సంవత్సరాలు గుడికి మహోన్నత సేవలు చేశాడట. అప్పుడొక రాత్రి శివుడు అతనికి కలలో కనిపించి "భీమేశ్వరయ్యా! నీసేవలకు మెచ్చినాను. వెంటనే నీవు కాశీకి ప్రయాణమై నీ శేష జీవితాన్ని అక్కడ గడుపుము. నీకు పుణ్యం దక్కుతుంది" అన్నాడట. మరుసటి రోజు తనకు వచ్చిన కలను గురించి ఊళ్ళో నలుగురికి చెప్పి తాను కాశీ వెళ్తున్నట్టు ప్రకటించాడు. మరప్పుడు గుడి విషయాలు ఎవరు చూసుకుంటారనే ప్రశ్న వచ్చింది. ఆ సమయంలో అప్పటి మంత్రిగారు, అంటే ఇప్పటి మంత్రి గారి తండ్రి, అప్పటి రాజుగారు, అంటే కరాజు తండ్రి ఉత్తర్వులు తీస్కొని ఆలయ పాలనా విషయాలు ఎవ్వరూ చూస్కోవాలన్నది ఊరి భక్తుల్లే నిర్ణయించమని చెప్పాడు. అప్పుడు కాశీవిశ్వనాథయ్య ఊరి వారందర్నీ పిలిపించి వారికొక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేసి, గుడి బాధ్యతలు తీస్కోడానికి తాను సిద్ధంగా ఉన్నట్టు ప్రకటించాడు. విందు ఆరగించిన భక్తులు కాశీవిశ్వనాథయ్య విన్నపాన్ని ఏకగ్రీవంగా సమర్థించారు. అలా అతను ధర్మకర్త అయ్యాడు. ఆ చరిత్రంతా మర్చిపోయిన ప్రజలు ఇప్పుడు గుడి మొత్తం కాశీవిశ్వనాథయ్య సొంత సొత్తను కుంటున్నారు. కాళహస్తి కనకలింగయ్య పరిశోధనలతో ఇప్పుడసలు విషయము బయటపడింది. మిత్రులతో, సన్నిహితులతో సంప్రదించి కనకలింగయ్య తాను ధర్మకర్తగా వ్యవహరించాలనే అభీష్టాన్ని మంత్రిగారికి విన్నవించుకున్నాడు. ధర్మకర్త స్థానం ఒక వంశానికి చెందింది కాదనీ, ఒకప్పుడు భీమేశ్వరయ్య కాశీకి వెళ్తే ప్రజలే అప్పుడు కాశీవిశ్వనాథయ్యను ఎన్నుకొని ఈస్థానం ఇచ్చారని, దేవుని సేవలు ఒకరికే పరిమితం కాకూడదని, మిగతావారికి కూడా ఆ అవకాశాలు రావాలని కనకలింగయ్య గట్టిగా వాదించాడు. ఎదటివారి వాదనలో బలం వుందని తెలిసి నప్పుడల్లా మంత్రి చేసేది ఒక్కటే. కరాజుకు విన్నవించుకోవడం.

ఎప్పుడూ ప్రజాభిప్రాయాన్ని మన్నించే కరాజు కనకలింగయ్యతో ఏకీభవించాడు. ఎన్నికలను నిర్వహించి ధర్మకర్తను నిర్ణయించే ఏర్పాట్లు చేయవలసిందని మంత్రిని ఆజ్ఞాపించాడు. మంత్రి తన సహాయకులతో చర్చలు జరిపాడు.

"ఈ పోటీలో మరికొందరు భక్తులు పాల్గొంటానంటే?'' అన్నారు సహాయ మంత్రులు. దాంతో ధర్మకర్త పదవికి ఎన్నికలు జరగనున్నాయని ఈ ఎన్నికలో పాల్గొన దలచినవారు తమ పేర్లను మంత్రిగారికి సమర్పించుకోవాలని రాజ్యం అంతా చాటేరు. కాని కాశీవిశ్వనాథయ్య, కనకలింగయ్యలు ఇద్దరూ, పెద్దలూ, పలుకుబడి గలవారూ కనక ఎందుకొచ్చిన గొడవా అని ఎవ్వరూ ముందుకు రాలేదు.

ఎన్నికల వథకాన్ని వివరించారు. వచ్చే ఏకాదశి రోజున భక్తులంతా తలా ఒక పావుసేరు గిన్నెను చేతబట్టుకొని దాన్ని 'పాలతోగాని, నీళ్లతోగాని నింపుకొని రహస్యంగా ఉండేట్టు దానికి మూతమూసి గుడికి రావాలి. అక్కడ రెండు ఖాళీ హండాలుంచబడ్డాయి. ఒకటి పాలకు, ఒకటి నీళ్లకు. పోటీ చేసే ఇద్దరు వ్యక్తుల్లో ఒకరి గుర్తుపాలు, ఒకరి గుర్తు నీళ్లు. దాని ప్రకారం భక్తులు వాళ్లవాళ్ల నిర్ణయాల్ని బట్టి పాలుగాని, నీళ్లుగాని ఆయా హండాలలో పోసిపోవాలి. సూర్యాస్తమయానికి ఏ హండా ఎక్కువగా నిండితే ఆ వ్యక్తి ధర్మకర్త.



ముందరి రోజు ప్రభుత్వాధికారులు కాశీవిశ్వనాథయ్యను కల్సుకొని "మీకు పాలు కావాలా?", "నీళ్ళు కావాలా" అని అడిగారు. అధికారంలో వున్నాడు కనుక ముందు అతన్ని అడిగారు. నీళ్లంటే నీచంగా వుంటుంది, తన అంతస్తుకు తగదని తనకు పాలేకావాలన్నాడు కాశీవిశ్వనాథయ్య. కనకలింగయ్యకు నీళ్లు తప్పలేదు. ప్రభుత్వంవారు విశ్వనాథయ్యకు పక్షపాతం చూపిస్తున్నారని అందరితో చెప్పుకున్నాడు కాని ఏమీ చెయ్యలేని పరిస్థితి.

పాలు కావాలని కోరుకున్న కాశీవిశ్వనాథయ్యకు తీరా ఆలోచించగా ఒక అనుమానం వచ్చింది. నీళ్లు ఖర్చులేనిది కదా అందరూ నీళ్ల హండానే నింపుతారేమోనని. అందుకని ముందురోజు రాత్రే ఊరివారందరికీ తలా ఒక సేరుపాలు ఉచితంగా పంచాడు. పావుసేరు హండాలో వెయ్యడానికి, ముప్పావుసేరు ఆ పనిచేసినందుకు కానుకగా. కనకలింగయ్య ఇదంతా అన్యాయమని కనిపించినవాళ్లతో మొరపెట్టుకున్నాడు. కానీ ఏమీ చెయ్యలేని పరిస్థితి.

ఏకాదశి రోజు ఉదయాన్నే ఊరివారంతా తలా ఒకపావుసేరు గిన్నెను చేత్తో మూసికొని గుడికొచ్చారు. ఒక్కొక్కదిశగా లోపలికి వెళ్లి వాళ్లు ఎన్నుకున్న హండాను నింపివస్తున్నారు. ఎవరు నెగ్గుతారోనన్న ఉత్కంఠత గంట గంటకూ పెరుగుతోంది. సూర్యాస్తమయం అయ్యేసరికి ఎన్నికల ప్రక్రియ పూర్తయింది. అధికారులు లోపలికి వెళ్లి చూశారు. నీళ్ల హండా పూర్తిగా నిండిపోయింది. పాల హండాలో పాలమట్టం బెత్తెడు కూడా లేదు. ఊరివారు పాలు ఉచితంగా పుచ్చుకుని హండాలో నీళ్లు పోయడం చూసి కాశీవిశ్వనాథయ్య ఒళ్లు మండింది. కానీ ఇప్పుడు అతనిది ఏమీ చెయ్యలేని పరిస్థితి. కొత్త ధర్మకర్తగా నియమింపబడ్డ కాళహస్తి కనకలింగయ్యను అందరూ జయజయ నినాదాలతో సత్కరించారు.

ఓడిపోయిన కాశీవిశ్వనాథయ్య ఇంట్లోంచి నెలరోజులవరకు బయటికి రాడని అందరూ అనుకున్నారు. కానీ దానికి విరుద్ధంగా ద్వాదశి రోజునే కాశీవిశ్వనాథయ్య సరాసరి కనకలింగయ్య ఇంటికెళ్లి అతన్ని

పూలమాలతో సత్కరించాడు. కనకలింగయ్యకు ఆశ్చర్యం వేసింది. అంతకు ముందు అతనంటే వున్న ద్వేషం పటాపంచలై పోయింది. కాశీ విశ్వనాథయ్య కన్నా గొప్పవాడు ఈలోకంలో లేడని స్తుతించాడు.

"కనకలింగయ్యా! నేనిక్కడకి వచ్చింది నీకొక ముఖ్యవిషయం చెప్పాలని'' అన్నాడు కాశీవిశ్వనాథయ్య. "అదేమిటో సెలవివ్వండి!" అన్నాడు కనకలింగయ్య నమ్రతతో "మొన్నరాత్రి కలలో చిన్న చిదంబరం స్వామి కనిపించి 'కాశీవిశ్వనాథయ్యా! నీవు వెంటనే సకుటుంబంగా కాశీకి వెళ్లి, ఇక అక్కడే నీ శేష జీవితాన్ని గడుపుము' అని ఆనతిచ్చాడు. అప్పుడే నాకు తెలిసి పోయింది. నీవు ధర్మకర్తవు అవుతావని. మేము కాశీకి ఈరోజే బయలుదేరాలి".

కనకలింగయ్యకు ఏం చెప్పాలో తోచలేదు.

"గుడిలెక్కలన్నీ నీకు వివరంగా చెప్పి, అప్పగించిపోవాలి".

శివుడే కలలో కనిపించిన అంతటి మహానుభావుడి దగ్గర లెక్కలడగడం సబబు కాదనుకున్నాడు కనకలింగయ్య. పైగా గుడి ఆస్తుల్లో ఎక్కడెక్కడా ఎంతెంత డబ్బుందో కాశీవిశ్వనాథయ్య చెప్తుంటే, అన్నిటికీ తల ఊపాడు. చివరకు మొత్తం లెక్కలు తనిఖి చేసినట్టు పత్రం మీద సంతకం చేసాడు. ఆలస్యం చేస్తే విశ్వనాథయ్య ప్రయాణానికి ఆటంకం కలుగుతుందేమోనని అతని భయం. ఆ మధ్యాహ్నమే కాశీవిశ్వనాథయ్య సకుటుంబంగా కాశీకి బయలుదేరి వెళ్ళి పోయాడు.

పదవి రాగానే మొదట గుడికి వెళ్ళి, చిన్న చిదంబరం స్వామి రహస్యాన్ని మరొకసారి విని, తన్మయుడై తన పనిలో నిమగ్నుడయ్యాడు. ఒక వారం రోజుల్లో అతనికి నమ్మలేని సత్యాలు కొన్ని తెలిసివచ్చాయి. గుడికి చెందిన ఆవుల్ని, గేదెల్ని కుదువ బెట్టి విశ్వనాథయ్య చాలా సొమ్ము అప్పుగా తీసుకున్నాడు. అలాగే భూములు, ఆస్తులు, నగలూ, ఏవీ ఇప్పుడు గుడి ఆధీనంలో లేవు. వాటిన్నిటినీ సొమ్ముచేసుకొని, మూట కట్టుకొని విశ్వనాథయ్య కాశీకి వెళ్ళిపోయాడు.

కనకలింగయ్య తల తిరిగింది. చిన్న చిదంబరం రహస్యాన్ని మించిన ఈ రహస్యం అతన్ని పూర్తిగా కలిచివేసింది. ఇదే సమయంలో నలభైసంవత్సరాలుగా గుడిలో పనిచేస్తున్న ముసలి రంగయ్య ద్వారా కొన్ని రహస్యాలు తెలిసాయి. తొలి భీమేశ్వరుడు కూడా ఇదే విధంగా సొమ్ములు చేస్కొని, శివుడు కలలో కనిపించాడని చెప్పి కాశీకి వెళ్ళిపోయాడట. ఇప్పుడు కాశీవిశ్వనాథయ్య కూడా ఇదేపని చేసాడు.

కనకలింగయ్య పరిస్థితి దారుణంగా తయారయింది. ఈ విషయాన్ని ఎవ్వరితో చెప్పుకోలేడు. చెప్పుకుంటే కళ్ళు మూస్కొని పత్రాల మీద ఎలా సంతకం పెట్టావని తననే నిందిస్తారు. ఈ పరిస్థితినుంచి ఎలా తప్పించుకోవాలా అని ఆలోచించసాగాడు.

ఉన్నట్టుండి ఒక అద్భుతమయిన ఉపాయం తట్టింది. భక్తులకు ఒక సత్రం వెంటనే కట్టించాలని ప్రకటించి, దానికి దాతలుగా వచ్చిన కొందరు ధనికుల దగ్గర డబ్బు తీస్కొని శంకుస్థాపన చేయించాడు. ఈపద్ధతిలో ఒక వేద పాఠశాలకు, ఒక వంటపానికి, ఒక వైద్యశాలకు శంకుస్థాపనలు జరిగాయి. ఇవికాక వజ్రకిరీటానికి, కొత్తరథానికి, ఇంకా ఎన్నో ఆలయ అభివృద్ధి కార్యక్రమాలకు అందరూ డబ్బులు విరివిగా దానం చేసారు. సంవత్సరం కాగానే ఒక చిత్రమయిన సంఘటన జరిగింది. ఒక రోజు రాత్రి కనకలింగయ్యకు శివుడు కలలో కనిపించి వెంటనే కాశీకి వెళ్ళమన్నాడట. అందుకని ఉదయాన్నే అతను సకుటుంబంగా ఇల్లు ఖాళీచేసి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.

ఈ పరిస్థితిలో ఏంచెయ్యాలో మంత్రిగారికి ఏమీ తోచలేదు.

"ఇప్పుడు ఆలయానికి ధర్మకర్తగా ఎవర్ని నియమించమంటారు, మహారాజా! పోనీ ప్రభుత్వమే తీసేసుకుంటే?" అన్నాడు మంత్రి.

"అప్పుడు అధికారులంతా ఒకరి వెంబడి ఒకరు కాశీకి వెళ్ళిపోతారు" అన్నాడు కరాజు.

''వెళ్ళినవాళ్ళంతా నిజంగా కాశీకి వెళ్ళారంటారా, మహారాజా?" అన్నాడు మంత్రి.

"నిస్సందేహంగా వెళ్ళలేదు. కాశీకని వెళ్ళిన వాళ్ళంతా దారిలో ఒక మజిలీ చూసుకుని అక్కడే స్థిరపడిపోయారు అంతే" అన్నాడు కరాజు.

"మరీ ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? మీరే నిర్ణయించాలి' అన్నాడు మంత్రి దీనంగా.

''ఒకపని చెయ్యండి మంత్రి. ఇకనుంచీ ధర్మకర్త పదవిని అమ్మకానికి పెట్టండి. ఎవరు ఎక్కువ డబ్బు చెల్లించుకుంటారో వారికి ఒక సంవత్సరంపాటు ఆ పదవిని ప్రసాదించండి. ఇలాగే ప్రతి సంవత్సరం జరపండి. ధర్మకర్త కాదలుచుకున్న వాళ్ళంతా గుడినుంచి ఎంత రాబడి వస్తుందో క్షుణ్ణంగా తెలిసిన వాళ్ళు గనక, వాళ్ళు అంతే ఇస్తారు. ప్రతిఫలంగా వాళ్ళకు పుణ్యం తోపాటు హోదా మిగుల్తుంది. ప్రభుత్వానికి డబ్బు వస్తుంది. దాంతో ఆలయం పనులు సక్రమంగా నిర్వర్తించవచ్చు" అన్నాడు కరాజు భగవద్గీతను ఉపదేశించే శ్రీకృష్ణుడిలా.

సమస్య ఇంత సులువుగా తీరినందుకు మంత్రి ఒక్కసారి హాయిగా నిట్టూర్చాడు. ■






సెప్టెంబర్ 12 శంకర్-జైకిషన్‌లోని జైకిషన్ వర్థంతి సందర్భంగా ......

# భైరవీ కా బేతాజ్ బాద్‌షాహ్



# జైకిషన్

"ఆధునిక సినీ సంగీతంలో ఎక్కడున్నవోయ్ శాస్త్రీయమైన స్వరాలూ?" అని సంగీతం తెలుసునను కునే పెద్దలు పెదవి విరుస్తూంటారు....

సినీ సంగీతం పూర్తిగా శాస్త్రీయ రాగాల చట్రంలో, ఉచ్చులో ఆసాంతం ఒదిగి ఉండలేదు.

'పంఛీ బనూఁ ఉడ్‌కే చలూఁ మస్త్ గగన్ మేఁ..." అని స్వైర విహారం చేసింది.

అద్భుతమైన తన సంగీతంతో, అక్షరాలా మంత్ర ముగ్ధుల్ని చేస్తూ ప్రేక్షక శ్రోతలను కట్టి పడేసిన అసామాన్య సంగీత దర్శకుల 'అలనాటి' జోడి... 'శంకర్ -జైకిషన్'...

'శంకర్'...శంకర్ సింగ్ రఘువంశీ, మన హైద్రాబాద్ పహిల్వాన్...

జైకిషన్ ..రింగు రింగుల జుట్టున్న, రంగీన్ మనస్తత్వం... అసలు పేరు జయ్‌కిషన్ దహ్యాభాయి పంచాల్ (ఫ్రమ్ గుజరాత్)....

ఇప్పుడొస్తున్న 'ఢింగ్ ...ఢాంగ్' లేదా 'ఇమిటేషన్ జ్యూవెల్రీ'లాంటి రి-మిక్స్‌లకు 'సై....సై' అని గంతులేస్తున్న 'ఈ తరం' కు 'ఆ తరం' అంతగా తెలియక పోవచ్చు...

ఈ 'కథ' ఆ తరంకు ముందుది ...1948 ముచ్చట... పృథ్వీరాజ్‌కపూర్ తనయుడు 'రణ్‌బీర్ రాజ్‌కపూర్'..ముంబైలోని 'చెంబూర్' లో ఉన్న ఆర్.కె. స్టూడియో అధినేత.... అప్పుడు 23 సం॥ వయస్సున్న ఈ నీలికళ్ళ స్వాప్నికుడు...'ఆగ్' సినిమా తీసాడు.... రాం గంగూలీ సంగీత దర్శకుడు... తన సినిమా బాణీలను బయట విన్పిస్తున్నాడన్న అనుమానంతో తర్వాతి సినిమాకి ఆయన అసిస్టెంట్‌స్‌కి 'చాన్స్' ఇచ్చాడు.... ఆ అసిస్టెంట్సే శంకర్-జైకిషన్.

'బర్సాత్' ..తో విజృంభించిన వారి తొలిజల్లు నాలుగు దశాబ్దాల పాటు సినీ సంగీత ప్రపంచంలో 'తుఫాను' లా వ్యాపించింది.. శాసించింది..!!

'భైరవి' వాళ్ళకు అత్యంత ప్రీతిపాత్రమైన రాగం...

శాస్త్రీయ సంగీత సభల్లో అఖర్న అందుకునే రాగం...

శంకర్ అనేవాడు..." భైరవీ.. సదా సుహాగన్ రాగం" అని... జైకిషన్ కైతే ఈ రాగం అంటే ప్రాణం... తన కూతురికి 'భైరవి' అని పేరు పెట్టుకున్నాడు... దాదాపు 190 సినిమాలకు సంగీతం అందించిన ఆ జంటకు పాశ్చాత్య రాగాల మీద మమకారం ఎక్కువ అని కొందరి విమర్శ...

'బర్సాత్' నుండి వర్షంధారల్లా రసికులను సంగీతంలో ముంచెత్తిన శంకర్- జైకిషన్ అన్ని రకాల పాటలను అంతే హృద్యంగా అందించారు. 'తాజా తెమ్మెర', 'బర్సాత్' అనుకుంటే..

'వెస్టర్న్ స్టైల్' ల్లో వచ్చిన 'ఏన్ ఈవెనింగ్ ఇన్ ప్యారిస్' ఉంది...

'శాస్త్రీయంగా' హుందాగా సాగిపోయిన 'బసంత్ బహార్', 'ఆమ్రపాలీ' ఉంది.... అందమైన జానపద గీతాలున్నాయి... (Folk)...

'రామయ్యా! వస్తావయ్యా..... (శ్రీ 420)

'చలత్ ముసాఫిర్ మోహలియారే.... (తీస్రీ కసమ్)

**నేటికి 50 సం॥ల క్రితం హిందీ సినీరంగంలో ఎలాంటి హేమాహేమీలున్నారో తెలుసా?**

- **'మొగల్ -ఏ-అజమ్/ మేలా/ బైజూ బావ్రా ....తో ఏలిన నౌషాద్**
- **'లతా' ఎంతో అభిమానించిన 'రోషన్ (చిత్రలేఖా/ ఆరతీ)**
- **మరాఠీ హెవీ వెయిట్ 'సంగీతం' ఛాంపియన్స్ సి. రామ్‌చంద్ర/ వసంత్ దేశాయి**
- **'గజలోంఁ కా బాద్‌షా ' మదన్ మోహన్..**
- **పంజాబీ ఠేకా' తో ఉర్రూతలూగించిన ఓ.పి.నయ్యర్**
- **'ఫుట్ బాల్ / టెన్నిస్ ప్రేమికుడు -యస్.డి.బర్మన్**
- **'బెంగాలీ రసికత'ల -హేమంత్ కుమార్**
- **'చాలా BR సినిమాలకు' అమర సంగీతాన్నందించిన - రవి**
- **'మధుమతి' ఫేమ్ -సలిల్ చౌధురీ..**

యస్.యన్.త్రిపాఠీ, ఖయ్యాం, జయ్‌దేవ్ .....ఇంకా ఎందరెందరో...

కాని శంకర్- జైకిషన్‌ల సామ్రాజ్యం పునాదులు మహాగట్టివి.. తనదంటూ ప్రత్యేకతలున్న ఎంతో మంది మేటి సంగీతదర్శకుల వలయంలో 'స్వంత స్టైలుతో' విలక్షణమైన వెలుగుతో వెలిగిపోయారు శంకర్- జైకిషన్ .

ఆరోజుల్లో వాళ్ళది చాలా భారీ సరంజామా ఉన్న టీమ్..!

భారతీయ/పాశ్చాత్య వైవిధ్యాలను ఎంతో సమన్వయంగా మేళవించిన టీమ్...!

శంకర్-జైకిషన్‌లకు 'భైరవీ' రాగంపై ఎంత విలక్షణమైన 'పట్టు' ఉండేదో ఈ పాటలు చాలు, చాటి చెప్పటానికి-

-కొండకోనల్లోంచి 'నిమ్మీ' కోసం లతా గానం చేసిన జైకిషన్ గీతం-

'బర్సాత్ మేఁ హమ్సే మిలే తుమ్' ..(బర్సాత్)

పాట ప్రారంభంలో 'ఎఫెక్ట్' జ్ఞాపకం రాకపోతే మళ్ళీ పాట వినాల్సిందే!

-'సీమా' లో నూతన్ కోసం జైకిషన్ గీతం 'సునో! ఛోటీసి గుడియాకి లంబీ కహానీ'

- 'పట్‌రానీ' లో వైజయంతీ మాలా ఆలాపించిన 'కభీతో ఆఁ'

ఇది శంకర్ 'భైరవీ' రాగంలో చేసిన సృష్టి... మరోటి...

-'అనాడీ' లో నూతన్ పాడిన 'తెరా జానా....!'

-'ఆయీ మిలన్ కి బేలా'లో సైరాబానూ కోసం లతా పాడిన అద్భుతమైన గీతం - 'తుమ్సే ఔర్ క్యాదూఁ మై దిల్ కే సివా !'

-'మయూర్ పంఖ్' లో 'మొహబ్బత్‌కి దాస్తాఁ ఆజ్ సునో ... !"

-'కట్‌పుత్లీ' లో -'బోల్‌రే కట్‌పుత్లీ..'

-'ఆహ్' లో 'రాజాకీ ఆయేగీ బారాత్'

ఇవి చాలవా భైరవిలో శంకర్ - జైకిషన్‌ల సత్తా ఏమిటో నిరూపించడానికి-

ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకోవాలి మనం..

భైరవీలో కొంతమంది ఇతర సంగీతదర్శకులతో వీళ్ళను పోల్చుకోనవసరంలేదు. ఎవరి ప్రత్యేకత వారిదే!

అయినా.. జస్ట్ ఫర్ ఇన్‌ఫర్‌మేషన్...!

-నౌషాద్ వైజయంతి మాలా కోసం స్వరపరిచిన 'దో హంసోఁ కా జోడా' (గంగా జమునా)

-వసంత్‌దేశాయి సంధ్యకోసం చేసిన సంగీత సృష్టి -'జో తుమ్ తోడో - పియా..' (ఝనక్ ఝనక్ పాయల్ బాజే)

-సి.రామ్‌చంద్ర అంజలీదేవి కోసం 'దేవత' లో తయారు చేసిన -కైసేఁ ఆవూఁ జమునాకే తీర్'

-రవిశంకర్ , లీలానాయుడు కోసం సృష్టించిన -'సాఁవరే... సాఁవరే..' (అనురాధ)మచ్చుకు కొన్ని చాలుగా!

-"ఆఁ ! ఏముంది! ఎంతయినా రాజ్‌కపూర్ కోసం శంకర్ జైకిషన్‌లు కాస్త స్పెషల్‌గా కొసరి వడ్డించారు సంగీతాన్ని" అనే విమర్శ లేదనికాదు.

జవాబు 'ఇదీ' అని కాదు కాని-రాజ్‌కపూర్ స్వతహాగా సంగీతాన్ని ఆత్మగా చేసుకున్న కళాతపస్వి... మనదే వుంది! మాములు మనుష్యులం.. ఉంటే...గింటే కాస్తంత.. 'కాన్-సేన్'లం కావొచ్చు కాని, 1956 నుండి 72 వరకు శంకర్-జైకిషన్ పొందిన 9 ఫిల్మ్‌ఫేర్ అవార్డులో ఎన్ని రాజకపూర్ గారివి? అది చాలదా ? శంకర్- జైకిషన్ సంగీతం ఖజానా ఆర్.కె. కోసమే కాదు.... అని చెప్పడానికి..!

మట్టికొట్టుకుపోతున్న ఈ తరం పాటలను (బలవంతంగా/ గతిలేక/ తప్పి) వింటున్నప్పుడు 'నేటికీ' అన్పిస్తుంది... (కొన్ని మినహాయింపులతో) 'సంగమ్'లో 'ఏ మేరా ప్రేమ్ పత్ర్ పఢకర్' కోసం 200 వయొలిన్స్‌తో 'జబర్‌దస్త్ ఎఫెక్ట్ ' ఇచ్చినా పాట తొలి వాక్యాలు జైకిషన్ తన ప్రేయసి (తర్వాత భార్య అయిన పల్లవి) కోసం వ్రాసుకున్నవనీ... ఈ సంగీతం ఆ ప్రేమ లేఖల్లోని ఒక్క అక్షరం ముక్క చెవుల్లో పడ్డా చాలు అని!

**- డా॥ జె.పి.వైద్య**

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటీ జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

12

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'మూగమనసులు'లోని పాటల గురించి చెప్పేముందు ఆ సినిమాకు సంబంధించిన విశేషాలు కొన్ని చెప్పాలి.

గౌరమ్మ పాత్రకు ఎవరు అంటే ఆదుర్తి సుబ్బారావు గారు.. 'ఇంకెవరు జమున చేత వేయిద్దాం' అన్నారు. సావిత్రి ఒకటే గోల. "నాకు హీరోయిన్ వేషం వద్దు... నేను ఆ గౌరమ్మ వేషమే వేస్తాను. నాకు అది వెరైటీగా ఉంటుంది. నేనే వేస్తానా వేషం" అంది. నాగేశ్వరరావు గారు, సావిత్రి.. వీళ్లంతా బాగా చనువుగా ఉండేవాళ్లు. దాంతో నాగేశ్వరరావుగారు "ఆ వేషానికి నవ్వు బాగోవు. హీరోయిన్‌గానే వెయ్యి" అని కన్విన్స్ చేశారు.

అక్కయ్యలాంటి మహానటి కూడా మోజుపడ్డ క్యారెక్టర్ గౌరమ్మ పాత్ర. నిజంగా 'మూగమనసులు'లో గౌరమ్మ లేకపోతే అసలు ఎంటర్‌టైన్‌మెంట్ లేదు. మొత్తం అంతా హెవీ సబ్జెక్ట్ కదా. అందులోనూ ఈ పాత్రకి ఎంటర్‌టైన్‌మెంట్‌తో పాటు సెంటిమెంట్ కూడా ఉంటుంది. నవరసభరిత పాత్ర. అన్‌ఫర్‌గెటబుల్ క్యారెక్టర్. ఆ పాత్ర గోదావరి యాసతో మాట్లాడుతుంది.

ఈ వేషం గురించి అనుకున్నప్పుడు ఇంకో డిస్కషన్ కూడా అయిందంట - నాగేశ్వరరావు గారు అన్నారంట - జమున మాట్లేటప్పుడు స్పష్టంగా, స్వచ్ఛంగా మాట్లాడుతుంది. ఈమెకు ఈ యాస ఎలా వస్తుంది అని. కె.విశ్వనాథ్ గారు ఆ సినిమాకు అసోసియేట్ డైరెక్టర్. నేను ఆ సినిమాలో బుక్ అయిన తరువాత ఓ రోజు

చిత్రం : మూగమనసులు — రచన : దాశరథి
సంగీతం: కె.వి.మహదేవన్ — గానం : పి.సుశీల





గోదారి గట్టుంది - గట్టుమీద శెట్టుంది -
శెట్టుకొమ్మన పిట్టుంది -
పిట్ట మనసులో ఏముంది? ఓ ॥గోదారి॥
ఒగరు ఒగరుగా పొగరుంది,
పొగరుకుతగ్గ బిగువుంది ॥ఒగరు॥
తియ్యతియ్యగా సొగసుంది
సొగసునుమించే మంచుంది ॥తియ్య॥॥గోదారి॥
యెన్నెల వుంది, యెండవుంది -
పువ్వూ వుంది - ముల్లుంది
యెన్నెల వుంది, యెండవుంది -
పువ్వూ వుంది - ముల్లుంది
యేది యెవ్వరికి యివ్వాలో యిడమరిసే ఆ ఆది వుంది ॥గోదారి॥
పిట్ట మనసు పిసరంతైనా పెపంచమంతా దాగుంది ॥పిట్ట॥
అంతుదొరకని నిండు గుండెలో -
ఎంత తోడితే అంతుంది ॥అంతు॥ ॥గోదారి॥







ఆయన వచ్చి 'మేడం... ఇలా అంటున్నారు. ఒక్కసారి డైలాగులు చదవండి' అన్నారు. నేను మామూలుగా వత్తి వత్తి చదివేశాను. 'అలా కాదు మేడం' అని విశ్వనాథ్ గారు ఎంత బాగా ట్రెయినింగ్ ఇచ్చారంటే - ఎన్‌టైర్ క్రెడిట్ గోస్ టు విశ్వనాథ్ గారు. ఆ యాస, ఎలా పలకాలి, ఇదంతా... రెండు రోజులు నాతో కూర్చుని... చిన్న పిల్లలకు ఓ.. నమః లు చెప్తారే ... అలా నేర్పించారు.నిజంగా యాక్టింగ్ కంటే కూడా ఆ భాషను అంత ఫ్లూయెంట్‌గా మాట్లాడగలిగానంటే అదంతా విశ్వనాథ్ గారి చలవే.

షూటింగ్ టైమ్‌లో మేం అంతా బోటులోనే కూర్చునేవాళ్లం. నేనూ, నాగేశ్వరరావుగారు, సావిత్రక్క....

ఓ రోజు నీళ్ళలో పెట్టుకున్న కాళ్లు చూసి ... "అమ్మాయ్ నీ కాళ్లు తెల్లగా, చాలా అందంగా ఉంటాయ్" అన్నారు నాగేశ్వరరావు గారు. "అబ్బా.. మీరు దిష్టి కొడుతున్నారు" అని కాళ్లు ముడుచుకుని కూర్చున్నాను. ఆ రోజు రాత్రి బాత్ రూమ్‌కు వెళుతుంటే... అక్కడో చిన్న గట్టు ఉంది. ఆ గట్టుకు వేలు కొట్టుకుని కంప్లీట్‌గా గోరు మొత్తం ఎగిరిపోయింది. ...రక్తం... ఏడ్చుకుంటూ వెళ్లి కట్టు కట్టుకున్నాను. మర్నాడు గుడ్డ కట్టుకుని షూటింగ్‌కు వెళితే... ఏమయిందని నాగేశ్వరరావు గారు అడిగారు... "మీ దిష్టి కొట్టింది... నా గోరు ఊడింది" అన్నాను. "అయితే లడ్డూలు పడేయ్ నాకు దిష్టి పోతుంది" అని తమాషాగా అన్నారు నాగేశ్వరరావు గారు. మూగమనసులు తలుచుకంటే ఎన్నో సంఘటనలు.

'ఈనాటి ఈ బంధం ఏనాటిదో' పాటలో అక్కయ్య, నాగేశ్వరరావు గారు చేయి చేయి పట్టుకుని పాడుతుంటే చేయి చెమటగా ఉందో ఏమో జారిపోయింది. అక్కయ్య పట్టు తప్పి తటాలున నడి గోదారిలో పడిపోయింది. తనకు బాగా స్విమ్మింగ్ వచ్చు. అయినా చీరతో ఎలా? తరువాత తనే చెప్పింది... "పడిపోయిన తరువాత ఈదాను... ఆనరా కోనం ఏమైనా దొరుకుతుందేమోనని వెతికాను. కానీ ఏమీ దొరకలేదు. చెయ్యి ఇంకాస్త జాపివుంటే లాంచీ ఫాన్ తగిలేది... ఈ లోపులోనే మిగతా వాళ్లు దూకటం... బయటకు లాగటం.. జరిగింది" అని చెప్పింది.

షూటింగ్ జరిగిన సఖినేటిపల్లిలో 8 మంది అన్నదమ్ములుండేవారు. ఒక్కొక్క అన్నదమ్ముడి ఇంటిలో ఒక్కొక్క స్టార్‌ను పెట్టారు. వాళ్లు మా కోసమని చెప్పి వాళ్ళ బిల్డింగ్‌లకు ఎదురుగా ఉన్న పొలం చదును చేయించారు. రోజూ షటిల్ కాక్ ఆడేవాళ్ళం. నిజంగా ఈస్ట్, వెస్ట్ గోదావరిలో ప్రజలకు ఆపేక్ష ఉంటుంది. సెంటిమెంట్స్ ఎక్కువ. నేను షూటింగ్ నుంచి వచ్చాక వాళ్ల

చిత్రం : మూగమనసులు రచన : ఆచార్య ఆత్రేయ
సంగీతం: కె.వి.మహదేవన్ గానం : ఘంటసాల

ముద్దబంతి పూవులో - మూగకళ్ళ వూసులో
ఎనక జనమ బాసలూ ఎందరికీ తెలుసులే ॥ముద్ద॥
పూలదండలో దారం దాగుందని తెలుసును
పాలగుండెలో ఏది దాగుందో తెలుసునా
నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి.
ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా ॥ముద్ద॥
మనసు మూగదేకాని బాసుండది దానికి
చెవులుండే మనసుకే ఇనిపిస్తుందా ఇదీ
ఎదమీద ఎదపెట్టి సొదలన్నీ యినుకో
ఇనుకోనీ బతుకును ఇంపుగా దిద్దుకో ॥ముద్ద॥
ముక్కోటి దేవతలు మురిసి సూస్తుంటారు
ముందు జనమ బంధాలు ముడియేసి పెడతారు
కన్నోళ్ళ కన్నీళ్ళు కడుపుతీసి దీవెనలు
మూగమనసు బాసలు... ఈ మూగమనసు బాసలు
మీ యిద్దరికి సేసలు ॥ముద్ద॥

















పనిమనిషి చేత వెన్నపూస, నున్నిపిండి పంపించేవారు. పొద్దున్నించీ షూటింగ్ చేసి వచ్చి అలసిపోతారు కదా... మసాజ్ చేసుకుని స్నానం చేస్తే హాయిగా నిద్ర పడుతుందనేవారు.

భోజనాల దగ్గర కూడా అంతే. నేను స్ట్రిక్ట్ వెజిటేరియన్ని. నాకోసం ప్రత్యేకంగా వంటలు చేసేవారు. నాకు మరీ చాదస్తం. "ఏవండీ మాంసం వండిన గిన్నెలతో వండుతారా" అని అడిగేదాన్ని. "అబ్బే లేదమ్మా.. వాటికి వేరే గిన్నెలు ఉంటాయి" అని చెప్పి పాపం అలాగే వండేవారు. నాకు చిన్నప్పటినుండి డైట్ కంట్రోల్ ఏమీ లేదు. ఇప్పటికి కూడా పెరుగన్నంలో కొంచెం మీగడ వేసుకో పోతే మింగుడు పడదు. నాగేశ్వరరావు గారు కూడా అంతే. బ్రీతింగ్ ఎక్సర్‌సైజులు చేయడం వల్ల పొట్ట అదీ రాలేదనుకుంటాను.

నేను లావు అంటూ ఎక్కింది పెళ్లప్పుడే. మా బాబు పుట్టిన తరువాత బాగా స్లిమ్ అయిపోయాను. అప్పుడు నేను రాత్రి పూట ఓ పుల్కా, ఓ గ్లాసుడు పాలు అంతే. మా బాబు పుట్టిన పదేళ్ల వరకూ హీరోయిన్‌గానే యాక్ట్ చేశాను. 'బంగారు సంకెళ్లు', మూగనోము, రాము ఈ సినిమాల్లో చాలా స్లిమ్‌గా కనబడతాను

'మూగమనసులు'లో పాటల గురించి చెప్పుకోవాలనుకున్నప్పుడు ఒక్కొక్కపాట ఒక్కొక్క కావ్యం అని చెప్పొచ్చు. అందులో నా పాటలు జానపద సాహిత్యంతో కూడుకున్న పాటలు. వాటిలో - ప్రజలకు బాగా నచ్చింది, బాగా పాపులర్ అయ్యింది, "గోదారి గట్టుంది - గట్టుమీన శెట్టుంది- శెట్టు కొమ్మన పిట్టుంది- పిట్ట మనసులో ఏముంది"

ఈ పాటలో వగరైన పొగరు, తీయనైన సొగసు, సొగసును మించిన మంచి, ఏది ఎవ్వరికి ఇవ్వాలో విడమరిచే 'ఇది' ఆ పిట్టలో ఉన్నాయని రాశారు. ఇక్కడ పిట్ట అంటే ఈ అమ్మాయి గౌరి అన్నమాట... దాశరథి గారు పోలికలు గొప్పగా తీసుకొచ్చి రాశారు. ఆ 'ఇది' అంటే ఏమిటో పూర్తిగా విడమర్చి చెప్పకపోవడంలోనే గౌరి పాత్ర స్వభావం ఉంది.

ఆ తర్వాత 'గౌరమ్మా నీమొగుడెవరమ్మా'

# నేనూ నా పాటలు



చిత్రం: మూగమనసులు
రచన : ఆచార్య ఆత్రేయ
సంగీతం : కె.వి.మహదేవన్
గానం : జమునారాణి



కుహు(-ముక్కు మీద కోపం, నీ ముకానికె అందం - నా
బుంగమూతి సందం, నీ ముందరి కాళ్ళ బందం ॥ముక్కు॥
అడప దడప ఇద్దరూ, అలిగితేనే అందం,,
అలక తీరి కలిసేదే అందమైన బందం ॥ముక్కు॥
సిన్నదాని బుగ్గలకు సిగ్గొస్తే అందం
ఆ బుగ్గ మీద సిటికేసి దగ్గరొస్తే బంధం ॥ముక్కు॥
ఈడొచ్చిన పిల్లకు జోడుంటే అందం,
ఈడు జోడు కుదిరినాక మూడు ముళ్ళె అందం ॥ముక్కు॥
తల్లీ గోదారికీ ఎల్లువొస్తే అందం,
ఎల్లువంటి బుల్లోడికి పిల్ల గౌరి బందం ॥ముక్కు॥

(ఈ పాట సాహిత్యం ఈ సంచికకు ముందు వచ్చిన సంచికలో వేశారు కదా) ఈ పాటను కొసరాజు గారు రాశారు. జానపదాలకు అయనేకదా. 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా' పాటలో సాహిత్యం సహజంగా ఉంటూ ఎంతో డెప్త్ ఉన్న మీనింగ్‌తో ఉంటుంది. హీరో తమాషా చేస్తూ గౌరిని ఏడిపిస్తూ నీ మొగుడెవరు అని అడిగితే చెప్పాలంటే సిగ్గేస్తుందని చెప్పడం, అనవాళ్ళు చెబుతానని సిగలో నెలవంక, మెడలో నాగరాజు, అంటే అప్పుడు హీరో - ఇల్లు వాకిలి లేనివాడు, బిచ్చమెత్తుకుని తిరిగేవాడు ...వాడేనా... అని వెక్కిరిస్తాడు. ఇక్కడ సాహిత్యపరంగా, ఎంత గొప్పగా రాసారంటే - బిచ్చమడిగేది భక్తిట, బదులు ఇచ్చేది ముక్తిట. ఇందులో కూడా ఒక వేదాంతం. ఆఖరి చరణాల్లో - మొగుడు మొగుడని మురిశావే, కులికావే బాగానే ఉంది కాని ఎవరినో నెత్తినెత్తుకుని నిత్యం దాన్నే కొలుస్తాడట అదియే ఆతని ఆలియట అని మళ్ళీ వెక్కిరిస్తాడు హీరో. దానికి - గౌరమ్మ - ఎవరో పిలిస్తే వచ్చింది, ఎవరికోసమో పోతోంది, మయాన్న మజిలీ యేసింది సగం దేహమై నేనుంటే అది పెళ్ళామంటే చెల్లదులే - అని అంటుంది.

ఈ కాలం వాళ్ళకి తెలుస్తుందో లేదో గాని నిజంగా అది ఒక కథ... భగీరథుడి కథ... మూడు లైన్లలో కొసరాజు గారు చెప్పేసారు. సగర సంతతికి సద్గతులు కలిగించడం కోసం భగీరథుడు ప్రార్థించగా గంగ దిగివచ్చింది. అదే - ఎవరో పిలుస్తే వచ్చింది, ఎవరి కోసం పోతోంది. ఆ గంగాదేవి వస్తున్నప్పుడు, ఆ ఉధృతాన్ని భరించలేక ప్రపంచం మునిగిపోతుందేమోనని శివుణ్ణి ప్రార్థిస్తే ఆయన తన జటాజూటంలో ఆ వేగాన్ని తగ్గించడం కోసం గంగాదేవిని చుట్టి లోపల బంధించేస్తాడు. సో... మయాన్న(మధ్యలో) మజిలీ వేయడం అంటే అదన్నమాట. అంత మాత్రం చేత సగం దేహంగా ఉంటున్న నన్ను కాదని ఆవిడ్ని (గంగాదేవిని) పెళ్ళాం అంటే ఎలా చెల్లుతుంది అని గౌరి (సినిమాలో పాత్ర)... పార్వతీదేవి లాగ అడిగినట్టు రాయడంలో మొత్తం గంగావతరణాన్ని, శివ పార్వతుల అభేద రూపాన్ని ఎంత చమత్కారంగా కొసరాజు గారు రాశారో చూశారా... ఆ రోజుల్లో అంత అద్భుతమైనటువంటి సాహిత్య విలువలు పాటల్లో ఉండేవి.

అలాగే 'ముక్కు మీద కోపం నీ ముకానికే అందం' పాట లాస్ట్‌లో -తల్లి గోదారికి పిల్ల గౌరి అందం, ఎల్లువంటి బుల్లోడికి పిల్ల గౌరి బంధం - అని వస్తుంది. ఇలాంటి సాహిత్యం ఇక మనం ఈతరంలో వినమేమో అనిపిస్తుందండి. ప్రతి పాట ఒక ఆణిముత్యం. ఎన్నెన్ని భావాలు, ఎన్నెన్ని అర్థాలు.

'ముక్కు మీద కోపం' పాట షూటింగప్పుడు మంచి ఎండాకాలం. అక్కడంతా రాళ్ళూరప్పలూ వుండేవి. పాపం, అక్కడకీ అంతా శుభ్రం చేసి ఉంచేవారు. నేనసలే సుకుమారిని. అందరు ఎగాతాళిచేస్తుండేవారు - ఈఅమ్మాయి ఇంత సుకుమారంగా ఉంటుంది. ఎలా చేస్తుంది అని. అందులోనూ హీరాలాల్ మాష్టారు వందసార్లు రిహార్సిల్స్ చేయిస్తారు. మనం చేయాల్సిందే... ఆ పాటలో నాగేశ్వరరావు గారికి కాలు అడ్డం పెట్టి కొట్టాలి. అలా ఎగరడంలో శుభ్రంగా ఓ రాయి గుచ్చుకుని మళ్ళీ రక్తం రావడం... ఎండకి కాళ్ళు బాగా బొబ్బలెక్కిపోయేవి. అలాంటి అనుభవాలు ఏన్నో ఈ మూగమనసులు చిత్రంలో నాకు.

ఇక 'మానుమాకును కాను' పాట... ప్రమిదను తెచ్చి వత్తిని వేసి చమురును పోసి భ్రమ చూపించావా, ఇంతా చేసి వెలిగించేందుకు వెనుకముందు లాడుతావా అంటుంది గౌరి. అంటే నీపై నాలో ప్రేమను పెంచి ఇన్ని ఆశలు కల్పించి చివరకు నన్ను నీదాన్ని చేసుకోవడానికి సందేహిస్తావా అనడానికి ఎంత చక్కటి ఉదాహరణలిచ్చారో చూడండి. ప్రమిదతోనూ, వొత్తితోనూ, నూనెతోనూ పోలుస్తూ ఎంత గొప్పగా రాసారంటే సాహిత్యం వింటే ఒళ్ళు జలదరిస్తుంది. ఈరోజున ఈ పిల్లలకి అర్థమవ్వదేమో... సాహిత్యపరంగా హ్యాట్సాఫ్ టు ఆత్రేయ గారు.

పాటకు ముందు హీరో అడుగుతాడు 'ఏంటే గౌరీ... ఏడుస్తున్నావా... నీక్కూడా కన్నీళ్ళున్నాయంటే" అని. అప్పుడు గౌరి మానూ మాకును కాను, రాయిరప్పను కానూ, నీలాంటి మనిషిని నేను, నీ మనిషిని నేను అంటుంది. నాకు ఒక మనసుంది నలుగురిలా ఆశున్నాదీ, కలలు కనే కళ్ళున్నాయి అవి కలతపడితే నీళ్ళున్నాయి - అని అంటుంది. అద్భుతం అండి అత్యద్భుతం....

అఖరి చరణం ఇంకా బాగుంటుంది, మడిసితోటి ఏలాకోలం ఆడుకుంటే బాగుంటాది. మనసుతోటి ఆడకు మావా ఇరిగిపోతే అతకదు మాల్లా... ఎంత సింపుల్ సాహిత్యం... ఎంత గంభీరమైన లోతు... చూస్తే భాష మామూలు పాటక జనం భాష! ఎంత లోతుగా వెళ్ళినా కూడా మామూలు చదువురాని, హృదయమున్న వ్యక్తి ఎలా మాట్లాడతాడో అలా రాసారంటే... ఇవ్వాళ తలుచుకుంటే... అటువంటి చిత్రం... అటువంటి సాహిత్యం.... అటువంటి మ్యూజిక్.... అటువంటి పెర్ఫార్మెన్స్ మళ్ళీ చూడలేం. నభూతో న భవిష్యతి...

ఒక్క నాపాటలే కాకుండా, నాగేశ్వరరావు సావిత్రి పాటల్లో నాకు బాగా నచ్చినది. ముద్దబంతి పూవులో మూగకళ్ళ వూసులో ఎనక జనమ బాసలూ ఎందరికీ తెలుసులే... ఆంధ్రులకు ముద్దబంతి పువ్వంటే చాలా ఇష్టం. తెలుగుతనం ఆ పువ్వులో ఉట్టిపడుతుంది. ముద్దబంతి పువ్వుల్లోంచి అంత గొప్ప పాట రాయటం... మూగకళ్ళ వూసులట. మొత్తం చిత్రమంతా అంతే కదా... నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి. ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా... ఎంత గొప్పగా రాశారో.... ఆఖరి చరణంలో మూగమనసు బాసలు మీ యిద్దరికి

**నేనూ నా పాటలు**



చిత్రం : మూగమనసులు                రచన : ఆచార్య ఆత్రేయ
సంగీతం : కె.వి.మహదేవన్                గానం : పి.సుశీల

మానూ మాకునుకాను - రాయీరప్పను కానే కాను
మామూలు మణిసిని నేను - నీ మణిసిని నేను
నాకూ ఒక మనసున్నాదీ, నలుగురిలా ఆశున్నాదీ
కలలు కనే కళ్ళున్నాయి, అవి కలతపడితె నీళ్ళున్నాయి ॥మానూ॥
పెమిదను తెచ్చీ వొత్తినియేసీ, సమురును పోసి బెమసూపేవా
ఇంతా శేసి యెలిగించేందుకు, ఎనకముందు లాడేవా ॥మానూ॥
మణిసితోటి యేలాకోళం, ఆడుకుంటే బాగుంటాది
మనసుతోటి ఆడకు మాఁవా, ఇరిగిపోతే అతకదుమల్లా ॥మానూ॥















సేసలు అని వస్తుంది. ఈ 'సేసలు' అన్న పదం అసలు చాలా మందికి అర్థం కాదు. జానపదులు పాడుకునే ఆ పదాన్ని ఆత్రేయ గారు ఉపయోగించారు. సేసలు అనే మాటకి ఎవరో పెద్దలు చెబితేనూ, (హాసం) రాజాగారు చెబితేనూ విన్నాను. సేసలు అంటే అక్షతలట. కొన్ని చోట్ల తలంబ్రాలకు కూడా సేసలు అని అంటారట.

ఈ పాట పాడుతున్నపుడు చాలా మంది చేతలని పాడేస్తారు. స్టేజిమీద పాడేటప్పుడు కూడా తప్పులుతప్పులు పాడుతుంటారు.

ఈ పాటలో అక్కయ్య (సావిత్రి) ఎంత అద్భుతంగా చేసిందో. కళ్లతోనే 'పాడు' అన్నట్టుగా చెప్తుంది. కనీసం తల కూడా ఊపదు. 'మిలన్'తో పోలిస్తే అందులో నూతన్ 'పాడు' అని తల ఊపుతుంది. కానీ సావిత్రి కేవలం కళ్లతోనే చెప్తుంది. హేట్సాఫ్ టు సావిత్రి. అక్కయ్య నటనలో ఉన్న గొప్పతనం, విశిష్టత అదీ.

అన్నింటికంటే విచిత్రమేమిటంటే నేను ఆ రోజుల్లో బయటికి వస్తే పబ్లిక్ 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా' అని ఆనందం పట్టలేక అరుస్తుండేవారు. అప్పటికింకా నాకు మ్యారేజి కాలేదు. అందుకే అలా అరుస్తుండేవారన్నమాట.

తర్వాత ఇదే 'మూగమనసులు'ని తమిళంలో సావిత్రి తీసింది. గౌరి వేషం నన్ను వేయమంది. అప్పటికి నాకు పెళ్ళైపోయింది. కడుపుతో ఉన్నాను. ఐదో నెలో, ఆరో నెలో కూడా వచ్చేసింది. 'నేను వెయ్యలేను. డెలివరీ అయ్యే దాకా నువ్వు వెయిట్ చేస్తే చేస్తాను' అని చెప్పాను. చంద్రకళను పెట్టి తీసింది.

వచ్చే సంచికలో.... మరికొన్ని సినిమాల్లోని మరిన్ని పాటల గురించి...




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## దొంగ దొరికాడు !

తిరుపతిలో ఒక సినిమా షూటింగ్. పద్మావతి కళాశాలకు దగ్గరలో వున్న పోలీస్‌స్టేషన్‌లో ఆ షూటింగు. నేను ఇన్‌స్పెక్టర్ వేషంలో వున్నాను దర్జాగా. శుభలేఖసుధాకర్ నా దగ్గరకు ఇంటర్వ్యూకి వస్తాడు. అతనూ నేనూ



మాట్లాడుకోవడం-సీను. అసలు పోలీసులు స్టేషన్‌లో వున్నా, వాళ్లు దృశ్యంలో కనిపిస్తే పోలీసులే నేరం చేసినట్టవుతుంది గనక, వాళ్లు దూరంగా నిలబడి దృశ్యం చూస్తూంటే, ఇద్దరు వేషధారులు దృశ్యంలో నించున్నారు. ఆ సినిమాకి దర్శకుడు ముత్యాల సుబ్బయ్యగారు. ఒక రిహార్సలు అయిన తర్వాత అలా చూస్తే వెనకాల వున్న సెల్ (సెల్ అంటే ఇప్పుడు అర్థం మారిపోయింది- సెల్‌ఫోన్ కాదు -నేరస్తుల్ని నిలబెట్టే కటకటాల గది) ఖాళీగా వుంది. అందులో ఎవరైనా వుంటే బాక్‌గ్రౌండ్‌లో, కూడా పోలీస్టేషన్ వాతావరణం బాగా కనిపిస్తుందని, ఎవర్నయినా అందులో కాస్సేపు నిలబెట్టమనీ - అన్నాన్నేను, నా పనేదో నేను చూసుకోకుండా! ఆ వేషానికి ఎవర్నీ అనుకోలేదు, ఎవర్నీ పిలవలేదు. మరెలా...? ..బాషా అని, మేకప్ అసిస్టెంటుంటే- "మన బాషాని నిలబడమందాం సార్, కాస్సేపు" అని నేనంటే సుబ్బయ్యగారు 'నరే' అని, బాషాని నిలబడమన్నారు- "సరిపోతాడు కూడానూ" అని కూడా అన్నారు. బాషా అందులోకి వెళ్లాడు. బయట తాళం పెట్టారు. దృశ్యం షూటింగయి పోయింది. అక్కడినుంచి, ఇంకో చోటుకి వెళ్లాలి- అందరూ. దీపాలు దించుతున్నారు, వాన్‌లోకి ఎక్కిస్తున్నారు, తక్కిన వాళ్లు సామాన్లు సర్దుతున్నారు. శ్రీకృష్ణ జన్మస్థానంలో వున్న బాషా- అసలు పోలీసుని పిలిచి, తాళం తియ్యమన్నాడు. కాని అక్కడున్న ఇద్దరు పోలీసులూ -బాషాని ఇంకాసేపు వుండమంటున్నారు !. "అదేమిటి?- షూటింగు షిఫ్ట్ అవుతూవుంటే నేను వెళ్లాలి తియ్యండి" అంటున్నాడు బాషా. ఆ పోలీసులు మెల్లిగా మా దగ్గరకొచ్చి, "సార్ !మా ఇన్‌స్పెక్టరు గారు వచ్చేవేళయింది. వచ్చారంటే, 'కేసులేంలేవా?' అని అడుగుతారు. లేవంటే మేమేం పని చెయ్యలేదంటారు. అంచేత, ఆయన వచ్చేవరకు ఇతన్ని సెల్‌లో వుండమనండి సార్ ? "ఆహాఁ! ఎవడో దొరికాడన్నమాట అని అనుకుని -కాస్సేపు వుండి వెళ్లిపోతారు.. మాకోసం అతన్ని అట్టిపెట్టండిసార్... "అని బతిమాలసాగారు. అందరికీ ఒకటే నవ్వు! బాషా మాత్రం చిందులు తొక్కుతున్నాడు. "మీ ఇన్‌స్పెక్టరుగారొచ్చేవరకూ నేనెందుకుండాలి? చస్తే వుండను. ఏదో డైరెక్టరు గారు నిలబడమన్నారని నిలబడితే నిజమైన దొంగలా సాయంకాలం వరకూ వుండాలా! బలే వుందే! తియ్యండి తాళం!" అని అరుస్తున్నాడు. "బలే వుందండీ మీరు అడగడం! అతనేదో సరదాకి, నిలబడితే పాపం... తియ్యండి తాళం!" అని ప్రొడక్షన్ మేనేజరు గద్దిస్తే గాని, వాళ్లు తాళం తీసి, బాషాని 'విడుదల' చెయ్యలేదు! వెంటనే బాషా, దొరికిన కారెక్కి లొకేషన్‌కి పారిపోయాడు! నిజం పోలీసులు అలా చూస్తూండగా. "ఎవరి బాధ వాళ్లది" అనుకున్నాం అందరం నవ్వుకుంటూ.

* * *

## వేషాలు నమ్మిస్తాయి !

పోలీసులనగానే జ్ఞాపకం వచ్చింది. 'నమ్మినబంటు' (1960) షూటింగు - మద్రాసు మౌంట్‌రోడ్‌లో ఏర్పాటు చేసి, పోలీసుల అనుమతి తీసుకున్నారు. షూటింగనగానే, బయటి జనం పోగవడం ట్రాఫిక్‌కి అంతరాయం కలగడం సహజం గనక, పోలీసులు కావాలి. కాని, అవాళ ఎవరో రాజకీయ పెద్దలు దిగుతున్నారట మీటింగులున్నాయి. " మీ షూటింగుల కంటే మా మీటింగులు మిన్న. మీకు బందోబస్తు అందించలేం" అన్నారు పోలీస్ అధికార్లు. "మీరే మీ మనుషుల్ని పెట్టి కంట్రోల్ చేసుకోండి" అని కూడా సెలవిచ్చారు. "ఏంగతి? మనవాళ్లు



ఎంత గట్టివాళ్లయినా, అడ్డం వచ్చే జనం లక్ష్య పెట్టరే - అసలు పోలీసుల్నే లక్ష్యపెట్టరు- వీళ్ల మాట వింటారా! ఏం చెయ్యాలి?" అనుకున్నారు నిర్మాణ పరివారం, దర్శక బృందం. ఉదయం పదిగంటలకి షూటింగు ఆరంభమైంది. రద్దీగా వుండే మౌంట్ రోడ్‌లో పదిహేను , ఇరవై మంది జమా జెట్టీలాంటి పోలీసులు రంగంలోకి దిగి- లాటీలు కదిలిస్తూ జనాన్ని , ట్రాఫిక్‌నీ కంట్రోల్ చేస్తూ రెండు గంటల్లో షూటింగ్ అయిందని పించేశారు. అయితే ఎక్కడినుంచి వచ్చారీ పోలీసులు? సినిమావాళ్ళే. దిట్టంగా వుండే జూనియర్ ఆర్టిస్టులచేత, పోలీసు వేషాలు వేయించి దింపే సరికి- ఎవరికీ తెలియలేదు, అనుమానం కూడా రాలేదు. ఆ ఐడియా ఇచ్చింది ఎవరు? ఆ సినిమాకి సారథ్యం వహిస్తున్న ఆదుర్తి సుబ్బారావుగారే!

* * *

## అనుకోని వేషం

పొన్నలూరి బ్రదర్స్ "శోభ" అని (1958) తీశారు. నేను సహాయ దర్శకుడిని. ఒక దృశ్యంలో -రామారావుగారు, అంజలి దేవిగారు వంటి వారుండగా ఒక డాక్టరు వస్తాడు. అదొక అయోమయం లాంటి పాత్ర - చిన్న వేషము. దానికి ఎవరో ఒకాయన్ని తీసుకొచ్చారు. అతనికి దృశ్యం వివరించి డైలాగులు చెప్పాను. వస్తూనే ఆ డాక్టరు పేషంట్ ఎవరో తెలుసుకోకుండా ఎదురుగా ఎవరుంటే వాళ్ల గుండెల మీద స్టెత్‌స్కోప్ పెట్టి హడావుడి చెయ్యాలి. ఆ నటుడు



'శోభ' చిత్రంలో హేమలత, అంజలీదేవి, ఎన్.టి.ఆర్., రావికొండలరావు, రమణారెడ్డి.

సరిగా చెయ్యలేకపోతున్నాడు. పైగా భయం! రామారావుగారు, అంజలి దేవిగారి పక్కన చెయ్యాలి...! వాళ్లొచ్చే లోపల ఇతను రెడీ అయిపోతే గొడవుండదని మేం తొందర పడుతూవుంటే, అతను కంగారుపడుతూంటే, దర్శకుడు కామేశ్వరరావుగారు గందరగోళం అయిపోతుంది కాబోలని చిందరవందరగా చూసి, "ఎందుకూ - ఆ వేషం మీరే చెయ్యండి... అతని వల్ల కాదు..టైము, ఫిలిమూ రెండూ వేస్టయేలావున్నాయి" అన్నారు నన్ను చూసి. సహకార దర్శకుడు కూడా ఆమాటే అన్నాడు. "పాపం అతని వేషాన్ని చెడగొట్టిన వాణ్ణి అవుతానే" అన్నానేను, "ఎంతిస్తారు గనక అతనికి? ఓ పాతిక రూపాయిలిస్తారు. నేనిస్తాలెండి పర్వాలేదు" అన్నారు డైరెక్టరు. నేనా వేషం వేస్తే, నాకేమీ ఇవ్వరు, నేను బృందంలో వాణ్ణి గనక. అతనేం బాధపడతాడో!..."నేనేం బాధపడను నన్నొదిలేయండి బాబూ! ఏదో డాక్టరు వేషం అంటే వచ్చాను గాని, ఇలా తికమక వేషంలా వుంటుందని తెలీదు. ఆ పాతిక రూపాయలూ మీకు నేనిచ్చుకుంటాను గాని, నన్ను విడిచిపెట్టేయ్యండి" అన్నాడా పాత్రధారి, నాతో 'అప్రూవర్' లా మారి. తప్పలేదు మరి! అలా యాక్సిడెంటల్‌గా రంగప్రవేశం జరిగింది నాకు- ఆ డాక్టర్ వేషంతో నాకు అదే మొదటి అనుభవం! తొణుకు బెణుకూ లేని వాడిలా పైకి నటించానే గాని, వణుకు, భయంలాంటి వాటిని లోలోపలే దిగ్బంధం చేసి, బయటపడ్డాను -'అమ్మయ్య' అనుకుంటూ.

* * *

## పొట్టి పొడుగులు

**త**మిళం నుంచి తెలుగుకి వచ్చిన 'మరవపురాని కథ'(1967)ని ఆ నిర్మాతలే (సుందర్‌లాల్ నహతా, డూండి) హిందీలో తీశారు. తమిళంలో శివాజిగణేశన్, తెలుగులో కృష్ణ వేసిన పాత్రని అమితాబ్ బచ్చన్ చేశారు. ప్రారంభదశ అతనికి. సన్నగా, రివటలా వున్నా పొడుగు మాత్రం అంత! "ఇతనేమిటి,హీరో?"



అనుకున్నారు షూటింగ్ చూడవచ్చిన ఇతరులు. సెట్లో అమితాబ్‌కి టచప్ అందించడానికి, గణేశ్ అని - మేకప్ అసిస్టెంట్ వుండేవాడు. గణేశ్ చాలా పొట్టి. నిలబడితే అమితాబ్ మోకాళ్ల కిందికి వస్తాడు. అంచేత, అతను టచప్ ఇవ్వడానికి వచ్చినప్పుడల్లా అమితాబ్ అతన్ని రెండు చేతులతో ఎత్తుకుని , తన ముఖం దగ్గరికి అతని చేతులు వచ్చేలా చూసుకుంటే, గణేశ్ టచప్ క్లాత్‌తో ఒత్తేవాడు..!.. ఆ దృశ్యం అందరికీ నవ్వే. ఓసారి, అమితాబ్ ఈ గణేశ్‌ని క్రేన్ మీద కూచోబెట్టి, క్రేన్ తన ముఖం మీది వచ్చేలా తోయించి, టచప్ చేసుకుని అందర్నీ నవ్వించేవాడు. "అతని దగ్గర గుడ్డ తీసుకుని, మీరే అద్దం, చూసుకుంటూ ముఖం అద్దుకోవచ్చుగా" అని ఎవరో సలహా ఇస్తే - "అది మామూలే! ఇందులో తమాషా , ఆనందం, నవ్వూ ఎక్కడ వున్నాయి?" అన్నాడు అమితాబ్ బచ్చన్ - హిందీలో.

* * *

## భయం .....భయం..

**ము**రళీమోహన్ "పిచ్చిపంతులు" తీశారు. అందులో నేనూ ఒక పంతుల్నే -టీచర్‌ని. షూటింగ్ ఏలూరు దగ్గరవున్న చాటపర్రులో- షూటింగులకి మద్రాసు నుంచి వెళ్లి వస్తూ వుండేవాళ్లం. ఒకసారి అలాగే నేను బయల్దేరాను. హౌరా మెయిల్ రాత్రి బయల్దేరుతుంది. ఫస్టుక్లాసు లాంటి పెట్టె. నాతోపాటు ఇంకెవరో ముగ్గురున్నారు. నన్ను బండెక్కించిన ప్రొడక్షన్ మేనేజరు-ఎందుకో కంగారుగా వున్నాడు... బండి బయల్దేరే టయిమవుతోంది..

"ఇంక ఎవరన్నా రావాలా?" అని అడిగాను.. "హిహి.. అబ్బే... " అన్నాడతను. ఐనా, గార్డు పెట్టె వేపు చూస్తూనే వున్నాడు. ... టైమైంది. ఆకుపచ్చరంగు దీపం వెలుగుతోంది, ఈలలు వినిపిస్తూన్నాయి...బండి బయల్దేరింది.. కొంత దూరం నడిచేసరికి.. మేనేజరుకి ఒక కంగారు వదిలినా, రెండో కంగారు అందిపుచ్చుకుని, ప్లాట్‌ఫాం మీద పరుగెత్తుతూ, "సార్ ...సార్..." అని కిటికీ దగ్గరకొచ్చి ...."సార్ ..ఇదిగో, ఈ డబ్బు కోసమే వెయిట్ చేస్తున్నాను. తెచ్చాడు.... వచ్చింది...పాతిక వేలు...ఈ పాకెట్ తీసుకుని, పొద్దున్నే మురళీమోహన్‌గారికి అందజేయండి...షూటింగు ఖర్చుకి సార్... పాతికవేలు.. జాగ్రత్త.. " అని గట్టిగా అరిచి, హెచ్చరించి పాకెట్ అందించి, అదృశ్య మయ్యాడు.

నాతోపాటు కూచున్న తక్కిన ముగ్గురు కూడా ఆమాట విన్నారు. ఆ మూట చూశారు!.. నాప్రాణం రైలుకంటే వేగంగా పరుగెత్తుతోంది...ఆ ముగ్గురూ ఒకరికొకరు సంబంధం లేనట్టున్నారు. ఎవరెలాంటి వారో తెలీదు.. వాళ్లు చూస్తూండగా



ఈ డబ్బు పెట్టెలో పెట్టాలో!.... నా దగ్గరే పెట్టుకోవాలా ! వాళ్ల వేపు చూస్తే వాళ్లు, త్రిపాత్రాభినయంలో వున్న అమ్రీష్ పూరీ నా వేపు కొరకొరా చూస్తున్నట్ట నిపించింది..... నన్నొక పోటు పొడిచి, ఆ డబ్బు లాక్కుని ముగ్గురూ పంచుకుంటారా... రైలు, పట్టాల మీద పరుగెత్తడంలేదు, నా గుండెల్లో పరుగెత్తుతోంది.... దీపాలు ఆర్పి పడుకున్నానే గాని, 'భయం' భయపెడుతూనే వుంది... అనవసరంగానే భయపడుతున్నానా...ఏం జరగదుగదా...తెల్లారిందెలాగో.. విజయవాడ సందడి... 'అమ్రీష్ పూరీలు' లేచారు.... పూరీలు, ఇడ్లీలూవస్తే తినడానికి ఉద్యమిస్తున్నట్టున్నారు... ఈ సంఘటన చెబితే నవ్వుతారేమోనని వూరుకున్నానుగాని - నా భయానికి నన్ను చూస్తే నాకే నవ్వొచ్చింది. ■

# కల్లుకుండల మీద కవిత్వం రాసిన

# కైరం భూమగౌడు



(కంప్యూటర్ సహాయంతో చిత్రీకరించిన ఊహా చిత్రం)

అది తెలంగాణా ప్రాంతం ..!

పైగా నైజాం ప్రభుత్వం !!

ఊళ్ళలో బళ్ళు లేవు.. ఉన్నా అందులో తెలుగు లేదు ఉర్దూ తప్ప..!

అలాంటి పరిస్థితుల్లో 1876 సం॥ కైరం రాజమల్లు, లింగమ్మ దంపతులకు ...భూమగౌడు పుట్టాడు....

గౌడులంటే తెలంగాణ ప్రాంతంలో 'కల్లుగీత' కార్మికులు....

నిమ్న వర్గం కింద లెక్క.. అంచేత బాల్యం కొంచెం ముదరగానే కుర్రాడి చేతికో కుండ, నిచ్చెన ఇచ్చి...గీత కార్మికుణ్ణి చేసేసారు!

కానీ 'గీతకారుడి' సంకల్పం మరోలా ఉంది !

ఆ ప్రాంతానికి శ్రీపెరుంబుదూరు నించి ఒక వైష్ణవ స్వామి వచ్చాడు. అక్కడి ప్రజల్ని వైష్ణవ మతంలోకి మార్చడం మొదలెట్టాడు....

మార్చడం అంటే ఆయన అధ్యాత్మిక ప్రవచనాలకి ముగ్ధులైపోయిన జనం... స్వచ్ఛందంగానే శంఖు, చక్రాలు భుజాల మీద వేయించుకునీ విష్ణు భక్తులైపోయారు.

అందులో పదేళ్ళ పిల్లాడు భూమగౌడ్!

మతమైతే తీసుకున్నాడు గానీ.. నోట్లో ముక్క లేదే.....

డొక్క శుద్ధి లేదు......

పైగా వైష్ణవ ప్రవచనాలు ఎక్కువ భాగం తమిళంలోనూ... మిగతావి సంస్కృతంలోనూ ఉండేవి...

అయినా సరే.. పట్టు పట్టాడు...

పెద్ద చెక్క పలకమీద, వస్త్ర గాలితం చేసిన సన్నని ఇటుకపొడిపోసీ చక్కగా పరిచీ దానిమీద కర్రపుల్లతో అక్షరాలు దిద్దడం మొదలెట్టాడు...

పెరుమాళ్ళు కటాక్షించాడు.... అక్షరాలు రాయడం కాదు....కవిత్వం పరిగెత్తుకొచ్చింది..!...ఇక చూడండీ!....

పాల బలపం పట్టుకునీ.. తాటిచెట్లెక్కీ.... నల్లని కుండ మీద తెల్లటి కవిత్వం రాసేవాడు ...!

తాటితోపు 'గీత' తో నారాయణవనం అయిపోయేది.

అలా పెరిగి పెద్దవాడయ్యాడు...

పెళ్ళయింది... పిల్లలు పుట్టారు. అయితే సంసార బంధం కన్నా ఆధ్యాత్మిక బంధం పెరిగిపోయి..భూమగౌడు కాస్తా 'భూమదాసు' అయిపోయాడు.

సంసారాన్ని పట్టించుకోకుండా .. ఎంత సేపు వైష్ణవ భక్తుల చుట్టూ ప్రదక్షిణం చేస్తూ... వాళ్ళ దగ్గర కొత్త విషయాలు నేర్చుకుంటూ.. గొప్ప కవుల్తో స్నేహం....వాళ్ళెవరంటే... తిరునగరి నరసింహదాసు, జంకి కిష్టయ్య, ఆకుల వెంకటీ వగైరా.. మొత్తానికి వైష్ణవ గీతాలు రాస్తూ ఆలపిస్తూ... వెళ్తున్న భూమదాసుకు పరమభాగవతోత్తముడూ, అపర కర్ణుడుగా పేరొందిన... చెన్నమనేని యతిరాజా వారి సాహచర్యం లభించింది!...

ఆ సంస్థానానికి బోర్నపల్లి అని పేరు...

రాజావారు, వారి ధర్మపత్నీ గూడా విష్ణుభక్తులే.. కనక భూమదాసు ఆడింది -భాగోతం..పాడింది -భారతం అయిపోయింది!..

ఉన్నన్నాళ్ళు భాగవత సప్తాహాలు... భూమదాసు ఎంత వీరవైష్ణవు డంటే.. ఆ ప్రాంతంలో వాటన్నిటినీ వైష్ణవీకరించాడు.. ఊరుపేరు మార్చీ జగన్నాధపురమనీ.. ఆగ్రామంలో చెరువుకి సత్యభామ చెరువనీ .. తను గీత కార్మికుడిగా ఉన్నరోజుల్లో కూడ.... తాటి చెట్లకు తమాషా పేర్లు పెట్టాడు..

| | | |
|---|---|---|
| అయోధ్య | మేడమీది చిలుక | ద్రౌపది |
| గొల్లభామ | బాలెంత | కైకేయి |
| ఫకీరుసాబు | అరటికొమ్మ | శూర్పణఖ |
| ఉగాది | ధర్మరాజు | మైరావణ |
| రాజహంస | చిత్రగంధి | ద్వారక.... |

ఇదీ వరస... తన పొలానికి వెంకటేశ్వరుల దరి అనీ, పెంపుడు జంతువులకి కూడ వైష్ణవ నామాలుపెట్టాడు..

వైష్ణవం ముదిరి ఎంతదాకా పోయిదంటే ఇంటికి ఎవరన్నా అతిథులొస్తే.... ఓ రాత్రివేళ పిడకల కుంపటిలో కాల్తున్న శంఖు చక్రాల ఊచలు తీసికెళ్ళి... వాళ్ళ భుజాల మీద శంఖు చక్రాలు వేసేవాడట...

అలాగే.. రాయాలనిపించినప్పుడూ ఏది కనబడితే అది... గోడ నిండా బొగ్గుముక్కల్తో.. ఇంటి కప్పుల మీద సుద్ద ముక్కలతో కనపడ్డ కుండల మీద .. ఎక్కడ చూసిన హరిమయమే... విష్ణు సహస్రనామాలే...

భూమదాసుకి నలుగురు కుమారులు.. ఏదో పండక్కి కూతుళ్ళనీ, అల్లుళ్ళని, బంధువర్గాన్నంతా పిలిచీ.. వనభోజనాలకి ముందు ..అందరినీ కూర్చోబెట్టీ..

"పుట్టినప్పుడు మనం ఏడుస్తూ వుంటాం.. చచ్చినప్పుడూ ఏడుస్తూనే వెళ్తాం.. అలాగే... పెరిగేటప్పుడు పాలకోసం. ....కొంచెం పెద్దయ్యాక తిండి కోసం... మరీ ముదిరాక తోడుకోసం... పిల్లలకోసం ..ఆస్తికోసం... కీర్తి కోసం... ఇలా... జన్మంతా ఏడుస్తూనే ఉంటాం గనుక ... నవ్వడం ఎంత అవసరమో ఏడ్వడం కూడా అంతే అవసరం... అంచేత మీరు అంతా నా ముందు కరువుదీర, మనసు నిండ, బిగ్గరగా ఏడవండి అని ఏడ్పుల పోటీ పెట్టాడు. బాగా ఏడ్చిన వాళ్ళకి బహుమతి ఇచ్చీ.... ఓ కొత్త ఫిలాసఫీ ప్రతిపాదించాడు.. నవ్వుల క్లబ్బులకు మల్లే... 'ఏడ్పుల క్లబ్'.

భూమదాసుకి సాహిత్యంలోనే కాదు.. ఆయుర్వేద వైద్యంలో గూడా మంచి ప్రవేశం ఉంది... దీర్ఘకాలం తలనొప్పితో బాధపడేవారికి... తన రెండు చూపుడు వేళ్ళకీ ఔషదం రాసుకునీ.. ఆ గంధాన్ని రోగి కళ్ళలో పెట్టేవాడట...మొండి చర్మవ్యాధ్యులకి.. చేపమందు ఇంగువతో చేసి ఇచ్చేవాడట.

అలాగే ....., శుద్ధి చేయడం... భస్మం, లేహ్యాలు వగైరాలు తయారుచేస్తూ.. స్వర్ణ భస్మం... రజిత భస్మాలు తయారు చేసేటప్పుడూ ... రోకళ్ళకి..బంగారు, వెండి పొన్నులు వేయించీ నూరించేవాడట...

ఎప్పుడూ దేశాటన చేసినా భుజాన తోలుసంచి సంచీలో మరొక సంచీ వేసుకునేవాడట.. సాహిత్యం, వైద్యం పూజాసామగ్రి.... నిత్యావసరాలన్నీ అందులో ఉండేవి...

| | |
|---|---|
| 4 పచ్చడి డబ్బీలు | 6 రకాల పాషాణాలు (విషాల విరుగుడు మందు) |
| 1 ఉసిరికాయ | |
| 2 ఇనపు పొయ్యిలు | 1 తానికయ |
| 1 వజ్ర చింతామణి (మాత్రలు) | 1 కరక్కాయ(త్రిఫలాలు) |
| 1 పట్టు ఉత్తరీయం | పైత్యానికి వెచ్చాలు |
| జ్వరాంకుశం | 1 త్రాసు |

మంచి జులాబ్
తెల్లమిరియాలు
యాలకులు
జాపత్రి
చిన్న కత్తి
అమృతాంజనం (అవ్వల్ ... దర్జాది)
(అంటే ఒరిజనల్ అని)

అలాగే... భూమదాసు శాపానుగ్రహసమర్థుడనీ కూడ అంటారు వేములవాడ భీమ కవిలాగ.. ఒకసారి... ఆ ఊరి దొర లక్ష్మారెడ్డి ... తననీ భక్త బృందాన్నీ ...కొట్టి... మిట్టమధ్యాన్నం వీపుల మీద బండలు పెట్టి మోయించాడట..

దాంతో కోపం వచ్చిన భూమదాసు....

కం॥ అవనిన్ కడుపాతకుడీ
భువినేలిన లక్మరెడ్డి బూడిదయగునే
కవిగా వాని శపించితి
కవి తిట్టును . పాముకాటు కట్టి కుడుపురా

అన్నాడు.. తర్వాత... లక్ష్మారెడ్డికి కుష్ఠు రోగం వచ్చి.... పురుగులు పడిపోయాడనీ... ప్రతీతి... అప్పట్నించీ భూమదాసుని... 'వరకవి' భూమదాసు అని కూడా పిలవడం ప్రారంభించారు..

భూమదాసు చాలా చాటువులు రాశాడు..

అలాగే రామశతకం... తిరునామాలు.... జానపదాలు.. మంగళహారతులు.. కృష్ణచెలిమిలు... వగైరా... చాలా సాహిత్యం రాశాడు!

వర్ణసంకరాన్ని తూర్పార పడ్తూ...

తండ్రి మధ్వాచారి తనయుడు భట్రాజు
జనని రామానుజజాతి పడతి
ఆలు కోమటి జాతి - అక్క జంగమురాలు
బావగారిది లింగ బలిజె కులము
తను కూచిమతము
తమ్ముడు పాడ్యుండు
నర్వేశ్వర మతము - షడ్డకునిది
ఆడ బిడ్డ సుకారి - అల్లుడు పింజారి
మరదలు కోడలు మారువాడి!



ఇలా తన రచనలతో.... అధ్యాత్మికతనూ.. సామాజిక స్పృహనూ కలగలిపిన వరకవి భూమదాసు...

కుటుంబ సభ్యులందర్ని పిలిచి...అరుగులు అలికించి చాప పరిపించీ... తను చాపమీద పడుకునీ....... తన ధర్మపత్ని నర్సుబాయిని దగ్గరకి రమ్మనీ.. "నువ్వు నాకే గాక... హరికీ దాసివి... ఎంతో సేవ చేసావు... నాకన్న నువ్వు ముందు పోవడం నేను చూడలేను.. అందుకే నేను ముందు పోతున్నా" అని చేతిలో చెయ్యేసి.... పుష్యశుద్ధ పౌర్ణమినాడు ..వైకుంఠ ద్వారానికి పయనమయ్యాడు.... తెలంగాణా గర్వపడదగ్గ వాగ్గేయకారుడు... కైరం భూమగౌడు.

- తనికెళ్ల భరణి

## పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 46.. మరొక నాలుగు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే..ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన..

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ.. మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 5 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి.

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి

ఒక ఆంధ్రుడు రష్యాకెళ్ళి అక్కడి ఈత కొలనులో మునిగి పోతూ "అవెఝ్మావ్! నాయనోవ్! చచ్చాన్రోవ్" అంటూ కేకలేసాడు.

వెంటనే గట్టు మీద విశ్రాంతి తీసుకుంటున్న ముగ్గురు రష్యన్లు కొలనులో దూకి ఆంధ్రుడిని అతి జాగ్రత్తగా గట్టుమీదకు చేర్చి ఆరాధనా భావంతో అడిగారు. "మా పేర్లు మీకెలా తెలుసండీ?" అంటూ.





ఓ కవిగారికి ఒక శ్రోత దొరికాడు. కవిగారి ఆనందానికి హద్దుల్లేవు. నాలుగైదు చిట్టి కవితలు విన్పించాక పొంగిపోతూ ఇప్పుడొక మాష్టరు పీస్ విన్పిస్తా!" నన్నాడు.

శ్రోత నొచ్చుకుంటూ "అబ్బే వద్దండీ! మీ కవితలే విన్పించండి. వేరొకరివి మీరు వినదల్చుకోలేదు" అన్నాడు.

**ఈ జోకులను పంపించినవారు: విజయ**



పెళ్ళిచూపుల్లో పెళ్ళికూతుర్ని పాట పాడమన్నారు మగపెళ్ళివారు.

"అబ్బ! నాకు సిగ్గండి. మీరందరూ అవతలకి వెళ్ళిపోతే పాడుతా" అంది పెళ్ళికూతురు. "పర్లేదమ్మా సిగ్గెందుకు ? అంతా మనవాళ్ళే పాడు" అన్నారు పెద్దలు.

"లేదండి. మీరందరూ అవతలకి వెళ్తేనే పాడుతా" అందామె ఖచ్చితంగా. "ముందు నువ్వు పాట పాడడం మొదలుపెట్టవే అక్కయ్యా! వాళ్ళే వెళ్తారు అవతలకి" అన్నాడు పెళ్ళికూతురు తమ్ముడు అమాయకంగా.



పి.ఏ పోస్ట్ కోసం ఆఫీసులో ఇంటర్వ్యూలు జరుగుతున్నాయి "చూడమ్మా! మాకు నీలాంటి యంగ్ లేడీ అక్కర్లేదు. కాస్త వయసు పైబడిన వారు కావాలి" అన్నారు ఇంటర్వ్యూ బోర్డు అధికారి.

"ఓస్ ఇంతేనా... కాస్త ఉండండి; క్షణంలో నా మేకప్ తీసేసివస్తా" -అంటూ పక్కగదిలోకి వెళ్ళిందామె.

**ఈ జోకులను పంపించిన వారు: ముని శ్రీలత, రేపల్లె.**



జుట్టుపీక్కుంటున్న దర్శకుడితో "ఏమిటి సార్ ప్రాబ్లెం?" అని అడిగాడు హీరో.

"ప్రోబ్లమేనయ్యా! హీరోయిన్‌ని 'అవినాభావ సంబంధాలు ఈనాటివి కావు' అని చెప్పమంటే నానా హింసలు పెడుతోంది"

"ఏమంటున్న దేంటీ?"

'అవి నా బావ సంబంధాలు ఈనాటివి కావు' అంటోంది. ఏం చెయ్యమంటారు" అంటూ మళ్ళీ నెత్తిమీద చెయ్యిపెట్టుకున్నాడు దర్శకుడు.

**ఈ జోకును పంపించిన వారు: జయంతి వెంకట రమణ, పెందుర్తి.**





రెడీమేడ్ షాపు ఓనరుతో సుబ్బారావు "ఏమయ్యా ఈ కోటు అచ్చంగా వులెన్‌దని గొప్పలు చెప్పి అమ్మావు. లోపల 'ప్యూర్ కాటన్' అని స్టిక్కరు ఉంది. పచ్చి మోసం కాదా ఇది!" అన్నాడు బాధగా.

"మోసమే సార్.... బొద్దింకల్ని మోసం చేయడానికి ఆ స్కిక్కర్ని మేమే అంటించాం" అన్నాడా షాపు ఓనరు తెలివిగా.



కోర్టు కేసులో ఓడిపోయిన యాద్గిరి అతని ప్రత్యర్థి మల్లేశం వాదులాడుకొంటున్నారు. "అరేయ్ నేను పై కోర్టుకి పోతారా".

" ఆడకూడా నేను కొట్లాడుతాన్ బే"

"అట్లనా.. ఐతే నేను హైకోర్టులో అప్పీల్ జేస్తా"

"నీకన్న ముందు నేను ఆడికి బోయి నీకు స్వాగతం చెప్తారా".

"ఆహా.... నేను నరకం పోయినా గాని నిన్నిడువన్రురా"

'ఆడ నా లాయర్ నీ సంగతి చూస్తాడు పోరా".



యజమాని ఇంటికి రాగానే కారిడార్లో ఏడుస్తూ కనిపించాడు నౌకరు. కారణమడిగాడు యజమాని. "అమ్మగారు కొట్టారండీ"

"ఛ... ఊరుకో! ఇంతమాత్రానికే ఏడవాలా. నేనెప్పుడన్నా ఏడవటం చూసావా?" పరధ్యానంగా అనేసి నాలుక్కరచుకున్నాడు యజమాని.

**ఈ జోకులను పంపించిన వారు: పి. నాగరాజు,జానకంపేట.**



ఒక అమెరికన్, ఒక జపనీయుడు, ఓ భారతీయుడు విమానంలో ప్రయాణం చేస్తున్నారు. మాటల మధ్యలో "మాది చాలా సంపన్న దేశం. మాకు డబ్బంటే లెక్కలేదు" అంటూ ఓ డాలర్ నోటును విమానంలోంచి క్రిందికి విసిరేసాడు అమెరికన్.

"మా దేశం ఎలక్ట్రానిక్ వస్తువుల ఉత్పత్తిలో అగ్రగామి. నాకు ఈ వాచీ ఓ లెక్క కాదు" అంటూ చేతికున్న వాచ్ తీసేసి విమానంలోంచి బయటపడేశాడు జపనీయుడు.

"మరి నీ సంగతి ఏంటీ " అని అడిగారు భారతీయుడిని.

"జనాల్ని ఉత్పత్తి చేయడయంలో కొన్నాళ్లలో మేం చైనీస్‌ని మించుతాం. మాకు మనుషులంటే లెక్కలేదు" అంటూ అమెరికన్‌ని, జపనీయుడ్ని ఎగురుతున్న విమానంలోంచి బయటకు తోసేశాడా భారతీయుడు!



కాలేజి ఎగ్గొట్టి సినిమా హాల్లోకి ప్రవేశించిన కిశోర్ లోపల చీకటిగా వుండటం తో సీట్లో తడుముకుని కూర్చుంటూ, "ఎంత సే పైంది సార్ సినిమా మొదలయ్యి" అంటూ తన ప్రక్కన కూర్చున్నాయనని అడిగాడు.

"ఓ అయిదునిముషాలే ఐందిరా బడుద్దాయ్" అన్నాడు ఆఫీసు ఎగ్గొట్టి సినిమాకి వచ్చిన అతని తండ్రి.

**ఈ జోకులను పంపించిన వారు: అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, హైదరాబాద్.**



ఓ ప్రియుడు, అతని ప్రేయసి రహస్యంగా ఓ గదిలో కలుసుకున్నారు... అంతలో 'టకటక' మంటూ చప్పడయింది.

ప్రేయసి కంగారుగా వెనక్కి జరిగింది... "అది తలువు తట్టిన శబ్దం కాదులే.. టెన్షన్‌తో నా మోకాళ్ళు ఒకదానినొకటి కొట్టుకుంటున్నాయి'' అన్నాడు ప్రియుడు కంగారుగా.



భర్తకు రెడీమేడ్ షర్ట్ కొనడానికి ఒక ఇల్లాలు బట్టల కొట్టుకు వెళ్ళి ఎన్నోరకాల చొక్కాలు చూసింది. షాపులో ఉన్న బట్టలన్నీ చూశాక "మా ఆయనకు సరిపోయే చొక్కాలు మీ దగ్గర లేవనుకుంటాను " అంది చివరికి.

"మా దగ్గర ఇంకో నాలుగు చొక్కాలున్నాయండీ. అవి కూడ సరిపోకపోతే మీరు మీ భర్తను మార్చుకోవడం మంచిది" అన్నాడు ప్రాణం విసిగిపోయిన ఆ కొట్టు యజమాని.

**ఈ జోకును పంపించిన వారు: మామిడి మహేంద్ర, పూణే.**



ఓ కోపిష్టి భర్త అర్ధరాత్రి క్యాంప్ నుండి ఇంటికొచ్చి తలుపు తట్టాడు.

'ఎవరూ' అంది భార్య

'నేనేనే... నీ మొగుణ్ణి' అన్నాడు భర్త విసుగ్గా

'అయితే మీరు క్యాంప్‌కి వెళ్ళేరోజు నేను ఏ కూరలు వండానో చెప్పండి' అనుమాన నివృత్తి కోసం అడిగిందావిడ.

'నా పిండాకూడూ, నా శ్రార్థం... ముందు తలుపు తియ్యవే"

'హమ్మయ్య! సందేహంలేదు... మీరే' అంది భార్య తలుపుతీస్తూ.

**ఈ జోకులను పంపించిన వారు: యస్.వి. మహేష్‌బాబు, చిత్తూరు.**

**ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన మునిశ్రీలత -రేపల్లె, పి.నాగరాజు-జానకంపేట, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి -హైదరాబాద్, జయంతి వెంకటరమణ-పెందుర్తి, యస్.వి.మహేష్‌బాబు, చిత్తూరు, మామిడి మహేంద్ర - పూణే, విజయ గార్లకు సోహాన్ మ్యూజిక్ వారు 'వన్స్‌మోర్ ఎన్.టి.ఆర్.' రీమిక్స్ పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**






# జంధ్యా మారుతం





(6)

విజయా వారి 'మాయాబజార్' అంటే జంధ్యాలకు పంచప్రాణాలు. ముఖ్యంగా అందులోని పాటల్ని ఏదో ఒక సందర్భంలో మననం చేసుకుంటూనే వుండేవారు. ఆ పాటల పల్లవులనే తన సినిమాలకు టైటిల్స్‌గా పెట్టుకుని ఆ ముచ్చట కూడా తీర్చుకున్నారాయన. జంధ్యాల అందించే తెలుగుదనం, ఆయన సినిమాల నుంచి ప్రేక్షకులు ఆశించే కొత్తదనంకు తగ్గట్టుగానే ఈ టైటిల్స్ కుదరడంతో బంగారానికి తావి అబ్బినట్టయ్యింది.

జంధ్యాల, ఆ తర్వాత నరేష్‌లోని కామెడీ యాంగిల్‌ని అనేక రకాలుగా ఉపయోగించుకున్నారు. జంధ్యాల-నరేష్‌ల కాంబినేషన్‌లో రూపొందిన ఏడవ చిత్రమిది. అంతే కాదండోయ్ ఈ సినిమాలో మరో స్పెషాల్టీ వుంది. నరేష్ ఆడవేషంలో తొలిసారిగా కనిపిస్తారిందులో. ఈ ఆడవేషానికి చాలా మంచి రెస్పాన్స్ రావడంతో నరేష్ మరింత ఆత్మ విశ్వాసంతో ఆ తర్వాత 'చిత్రం-భళారే విచిత్రం' లో ద్వితీయార్ధం మొత్తం ఆడవేషంలో కనిపించి అఖిలాంధ్ర 'మల్లెమాల'గా ప్రసిద్ధి గాంచిన సహజకవి ఎమ్మెస్ రెడ్డి (ప్రముఖ నిర్మాత) ఈ చరణాలను రాయడం విశేషం. అంతేకాదు ఈ చిత్రానికి సమర్పకులు కూడా ఆయనే.

ఈ పాట గురించి, అందులో తను వేసిన లేడీ గెటప్ గురించి నరేష్‌ని అడిగితే ఆ పాటని, ఆ సందర్భాన్ని గుర్తు చేసుకుని తెగ మురిసిపోయారాయన. "నా లైఫ్‌లో ది బెస్ట్ సాంగ్ ఇది. ఇలాంటి సాంగ్ చేసే అవకాశం మళ్లీ రమ్మన్నా రాదు. నాకు తెలిసి ఇద్దరు మగాళ్ల



## నవ్వుల మేళా
## చూపులు కలిసిన శుభవేళ

'మాయాబజార్'లో అభిమన్యుడు, శశిరేఖ కలిసి యుగళగీతంగా పాడుకున్న 'చూపులు కలిసిన శుభవేళా.. ఎందుకు నీకీ కలవరము' పాట పల్లవిని ప్రధాన శీర్షికగా చేసుకుని ప్రణయాన్ని, వినోదాన్ని, సందేశాన్ని కలగలిపి జంధ్యాల వెండితెరపై చేసిన నవ్వుల మేళా ఈ 'చూపులు కలిసిన శుభవేళ' చిత్రం.

'నాలుగుస్థంభాలాట' చిత్రంతో నరేష్‌ని కథానాయకునిగా తెలుగు ప్రేక్షకులకు తొలిపరిచయం గావించి ఆనందం పంచిన ప్రేక్షకులను రంజింపచేసారు.

'చూపులు కలిసిన శుభవేళ' అంటూ నరేష్ (పక్కపేజీల్లోని ఫోటోలు చూడండి) లేడీ గెటప్‌లో కనిపించిన పాటని నరేష్, వీరభద్రరావుల మీద డ్యూయెట్‌లా చిత్రీకరించారు. 'మాయాబజార్' లోని 'చూపులు కలిసిన శుభవేళ' పాటకి ఇది ఒకరకంగా ప్యారడీ అనుకోవచ్చు లేదా 'ఫ్రీమిక్స్' అనుకోవచ్చు. ఒరిజినల్ పల్లవిని యధాతధంగా వుంచి చరణాలు మాత్రం మార్చి రాసారు. మధ్య ఉన్న శృంగార యుగళ గీతం ఇదొక్కటే. అసలు ఆడ గెటప్ వేయాలన్న ఆలోచన నాకు చిన్నప్పటి నుండే ఉంది. 6వ తరగతిలో ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటేషన్‌లో లేడీ గెటప్ వేస్తే అందరూ మా అమ్మ విజయనిర్మల లా ఉన్నావన్నారు. మళ్లీ 10 వ తరగతిలో అలాంటి గెటప్ వేశాను. ఈసారి నా గెటప్ చూసి ముచ్చటపడి మా మాస్టర్లు నాతో ఫోటో దిగారు కూడా. ఇక కాలేజీ ఏజ్‌లో అయితే డెస్టిన్ హఫ్‌మెన్ చేసిన 'టూట్సీ' సినిమా చూసి నేను కూడా అలా సినిమాల్లో

ఆడ గెటప్ వేయాలనుకున్నాను. జంధ్యాల గారికి నా కోరిక చెప్పాను కూడా. ఈ టైమ్‌లో ఇలాంటివి వేస్తే నీ కెరీర్‌కు మంచిదేనంటావా అన్న చిరు సందేహాన్ని వ్యక్తపరిచారాయన. తరువాత ఆయనకు కూడా అలాంటి ఆలోచన వచ్చి 'చూపులు కలిసిన శుభవేళ' సినిమాలో ఈ పాటలో ఆ ఫీట్ చేయించారు. ఈ లేడీ గెటప్‌కు చాలా మంచి రెస్పాన్స్ వచ్చింది. ఆ ధైర్యంతోనే 'టూట్సీ' సినిమాని మౌళీ గారి దర్శకత్వంలో తెలుగులో చేయాలనుకున్నాను. ఈలోగా పి.ఎన్.రామచంద్రరావు ఓ మరాఠీ సినిమా తీసుకువచ్చాడు. అదే 'చిత్రం - భళారే విచిత్రం'. అయితే మరాఠీ సినిమాలో రెండు లేడీ క్యారెక్టర్లు ఉంటాయి. తెలుగులో అలా అయితే బాగోదని బ్రహ్మానందం చేత నాగభూషణం స్టైల్‌లో



వీరభద్రరావుతో చెప్పి, నరేష్ బుగ్గను తడిమి 'ఐ విష్ యూ వేరీ బ్రైట్ ఫ్యూచర్' అనేసి వెళ్ళిపోతారాయన. జంధ్యాలకు చాలా సన్నిహితుడు ఆదివిష్ణు. వీరిద్దరి పరిచయం, అనుబంధం గురించి మున్ముందు ఆర్టికల్స్‌లో తెలుసుకుందాం.

"ఆ పాట తీస్తున్నప్పుడు నేను ఇందిరాపార్క్‌కి వెళ్ళాను. నన్ను చూసాక జంధ్యాల అప్పటికప్పుడు ఏం ఆలోచించాడో వెంటనే నేనీ సన్నివేశంలో నటిస్తే బాగుంటుందన్నాడు. అలా సరదాగా చేశాను" అని ఆ సందర్భాన్ని గుర్తు చేసుకున్నారు ఆదివిష్ణు.

ఇన్ని విశేషాలు కలిగిన ఈపాట చివరికి విషాదాన్ని పంచుతుందని ఎవ్వరూ ఊహించలేదు. 1988 జూన్ నెలలో ఈ పాటను చిత్రీకరిస్తున్న సమయంలో ప్రమాదవశాత్తూ







## పాటలు

| | | |
|---|---|---|
| 1. | నిన్నా మొన్నా నీవే ధ్యానం | మోహన్, అశ్వని |
| 2. | చూపులు కలిసిన శుభవేళ | నరేష్, వీరభద్రరావు, బ్రహ్మానందం తదితరులు |
| 3. | సిరిమల్లె శుభలేఖ | నరేష్, సుధ |
| 4. | ప్రేమా గర్జించవే నీ భీమా నీ భీమా వర్షించవే | నరేష్, సుధ, మోహన్, అశ్వని, నూతన్ ప్రసాద్. |

క్యారెక్టర్ చేయించాం." అని వివరించారు నరేష్.

ఈ పాటలో మరో విశేషముంది. పార్క్‌లో నరేష్, వీరభద్రరావుల డ్యూయెట్‌ను గమనిస్తున్న జనసందోహంలో హీరో రాజశేఖర్ కనిపిస్తారు.

ఈ పాట షూటింగ్ ఇందిరా పార్క్‌లో జరుగుతున్నపుడు, అక్కడే రాజశేఖర్ సినిమా షూటింగ్ జరుగుతోంది. సమయానుగుణంగా సన్నివేశాలను సృష్టించే సామర్థ్యం గల జంధ్యాల, రాజశేఖర్‌ని సరదాగా ఆ సీన్‌లో ఉపయోగించుకుని ప్రేక్షకుల్ని థ్రిల్ చేసారు. అంతకుముందు జంధ్యాల - రాజశేఖర్ కాంబినేషన్‌లో 'నీకూ - నాకూ పెళ్ళంట' చిత్రం రూపొందిన సంగతి అందరికీ తెల్సిందే. అలాగే ఈ పాటలో రచయిత ఆదివిష్ణు సినిమా డైరెక్టర్‌గా కాసేపు కనిపిస్తారు. ఈ సినిమాకి కథా రచయిత వారే. "హలో... ఇక్కడ మేం వేరే పిక్చర్ షూట్ చేస్తున్నామండి. ఇద్దరు మగవాళ్ళు లవ్ చేసుకు పాడటం బాగుందని మీది షూట్ చేసాం. థ్యాంక్యు వెరీమచ్" అని



వీరభద్రరావు కాలు బెణికి గాయమైంది. అయినా కూడా ఆయన ఆ బాధను లెక్క చేయకుండా షూటింగ్‌లో పాల్గొన్నారు. ఫలితంగా కాలిపై కురుపులు ఏర్పడ్డాయి. వైద్యుల సలహా మేరకు జూన్ 28న మద్రాసు సెయింట్ ఇసబెల్లా హస్పిటల్‌లో చేరిన వీరభద్రరావుకు 30వ తేదీ తెల్లవారు ఝామున 2 గంటలకు గుండెనొప్పి రావడంతో అంతిమ శ్వాస వదిలారు.

'చూపులు కలిసిన శుభవేళ' సత్తి వీరభద్రరావు నటించిన చివరి చిత్రంగా నిలిచిపోయింది. హాస్యప్రియులకు దుఃఖాశ్రువులను మిగిల్చి పరలోకానికి పయనమైపోయిన తన సన్నిహితుడైన వీరభద్రరావుకి ఈ చిత్రాన్ని అంకితమిచ్చారు జంధ్యాల. అంతేకాదు ఆ పాత్రకి తన గొంతుని పంచి స్నేహధర్మాన్ని, దర్శకన్యాయాన్ని పాటించారు.

ఈ సినిమా షూటింగ్ సమయంలోనే వీరభద్రరావు కన్నుమూయడంతో ఆ పాత్రకి డబ్బింగ్ ఎవరితో చెప్పిస్తారా, ఒకవేళ ఎవరైనా చెప్పినా రక్తి కట్టించగలరా అన్న సందిగ్ధం యూనిట్‌లో చాలా మందికి కలిగింది. చివరికి జంధ్యాల డబ్బింగ్ చెప్పడానికి సిద్ధమైతే, ఆయనకి అత్యంత సన్నిహితుడు జర్నలిస్ట్ రాజా (ఇప్పటి 'హాసం' సంపాదకులు) "వీరభద్రరావుకి మీ వాయిస్ ఎలా సూట్ అవుతుంది?" అనే సందేహాన్ని వ్యక్తపరిచారు. దానికాయన "భద్రుడికి నా వాయిస్ తప్ప ఇంకెవరిదీ సూట్ కాదు... ఛాలెంజ్" అని ఆత్మవిశ్వానం కనబరిచారు. అంతేకాదు మాటల్లోనూ, చేతల్లోనూ నిరూపించారు. వీరభద్రరావు ఆఖరి పాత్రకి అలా ఫినిషింగ్ టచ్ ఇచ్చారు జంధ్యాల.

వీరభద్రరావు మీద కొన్ని షాట్స్ బ్యాలెన్స్ వుండిపోయాయి. దాంతో అగస్త్య శాస్త్రి అనే మరో నటుడి మీద కొన్ని షాట్స్ తీసి అవి మ్యాచ్ చేశారు.

జంధ్యాల స్నేహ బృందంలో ఈ అగస్త్య శాస్త్రి

## 'చూపులు కలిసిన శుభవేళ'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

★ చదువు పాములాంటిది. ఎప్పుడూ దాన్ని పెద్ద కర్రతోనే కొట్టాలి. అత్తెసరు మార్కులతో కొడితే తోక మీద లేచి కాటేస్తుంది.

★ సారీనయ్యా ప్రసాదు...అనవసరంగా నీ మీద 'కర్ర' చేసుకున్నాను.

★ మోహన్! మా పద్మకోరి అడిగితే ఎప్పుడూ కాదనలేదు. అదృష్టానికి, ఐశ్వర్యానికి వారసురాలు మా బంగారుతల్లి. ఫలానా కుర్రాడిని చేసుకుంటాను నాన్నా అంటూ మా అమ్మాయి ఓ అబ్బాయి వేలు పట్టుకొస్తే ఆ వేలున్న మనిషికి ఎన్ని వేలు, లక్షలైనా ఇచ్చి దాని పెళ్ళి చేయాలని చాలా కాలంగా అనుకుంటున్నాను.

★ మోహన్! నాకు తెలుగు సంస్కృతి అన్న ఇష్టము. తెలుగు ప్రజలన్న ప్రాణం. తెలుగు భాషయందు మక్కువ ఎక్కువ. ఎందులకో తెలియునా... తెలుగు భాషలో అక్షరముల సంఖ్య ఎక్కువ. ఆ యాబది అరు అక్షరములు సఖ్యతతో, స్నేహశీలతతో కలిసియున్నవి. ఒక కుటుంబమనిన తెలుగు భాష వలె తాత, తండ్రి, బిడ్డ, మనుమలు, మునిమనవలు అందరూ కలిసి ఏక కుటుంబముగా ఒకే నీడన వుండలెనని నా ఉద్దేశ్యము.

★ చతుశ్చక్ర శకట నివాస స్థానం - బస్టాండ్
★ శిరస్త్రాణం - హెల్మెట్
★ ఉష్ణగ్రాహక ఘటం - బాయిలర్
★ నిశివరోస్తూతకం - కాఫీ
★ ఉదయ వ్యాహాళి -మార్నింగ్‌వాక్
★ ఉత్తర కుమారుడు - పోస్ట్‌మాన్

ఇవన్నీ కోట తాలుకు తెలుగు పాండిత్యానికి ఉదాహరణలు.

★ పద్మ ప్రేమలో పడిందా ?
పెంట కుప్పలో పడిందన్నట్లుగా అట్లా అరుస్తావేమయ్యా ! పడింది ప్రేమలోనే కదా!!

★ ప్రేమ తిస్కరణా ? అదేంటండి పుష్కరణిలాగా
అది అవిడ పేరు కాబోలు

★ నువ్వు ప్రేమించిన విషయం ముందు ఆ కూనకే చెప్పాల అలా కాక ముందు ఎవరికన్నా చెప్పావో గరుత్మంతుడు గుడ్లెర్ర చేస్తాడు ఆ వెనక కుర్రో కుర్రు... నీ పిట్ట ఇంకొకడితో తుర్రో తుర్రు.

★ వచ్చింది చెవుడు కాదు నీ మొగుడు... నీ పాలిటి యముడు

★ వస్తా... లోపలికే వస్తా... బయట బాదితే బాగుండదు కదా మరి...
బాదటం ఏమిటి సార్ ?
ఆ ప్రక్రియనే తోలు తీయుట, ఉతికి ఆరేయుట అని కూడా అంటారులే... పదా.

★ అమ్మగారు మీకు పాద పూజ చేస్తుంటే నాకు మా ఆవిడ గుర్తుకు వస్తుందండయా?
ఇవాళ అది పోయిన రోజు.... అది బతికున్నాళ్లు నాకు బడిత పూజ చేసిందే తప్ప ఇలా ఒక్క రోజు కూడా పాద పూజ చేయలేదండయ్యా.
బడిత పూజ అంటే ఏంటండి?
నువ్వు అది కూడా చేయాలని ప్రయత్నించకు. ఇన్నేళ్లూ నువ్వు సంపాదించిన పుణ్యం అంతా పుచ్చి పురుగులు పట్టి పోతుంది.

ఒకరు. 'బాచీ' సినిమాలో ప్రకాశ్‌రాజ్‌కి ప్లాస్టిక్ సర్జరీ చేయబూనే డాక్టర్ అంటే ఈ తరం ప్రేక్షకులకి అగస్త్యశాస్త్రి అంటే ఎవరో అర్థమైపోతుంది. ఎలక్ట్రిసిటీ బోర్డ్‌లో ఎలక్ట్రికల్ ఇంజినీర్‌గా పనిచేస్తున్న సమయంలో ఈ



అగస్త్యశాస్త్రి

సినిమాలో వీరభద్రరావుకి డూప్‌గా నటించే అవకాశం లభించిందాయనకు. ఈ సందర్భంగా తన అనుభవాల్ని అగస్త్యశాస్త్రి ఇలా వివరించారు.

"జంధ్యాల గారికి వీరభద్రరావు గారు అంటే చాలా ఇష్టం. అందుకు కమర్షియల్‌గా ఎవరినైనా డూప్‌ని పెట్టకుండా మా స్నేహ బృందంలోని వాళ్ళతోనే ఈ షాట్స్ తీయాలనుకున్నారు. మా బృందంలో వెనుకనుంచి వీరభద్రరావు గారి పోలికలు ముగ్గురికే వున్నాయి. ఒకరు ప్రస్తుతం 'హాసం' సంపాదకులుగా ఉన్న రాజా, మరొకరు మల్లాది గోపాలకృష్ణ (ప్రస్తుతం తెలుగు యూనివర్సిటీలో పనిచేస్తున్నారు), ఇంకొకరు నేను. ఆదివిష్ణు గారు నన్ను జంధ్యాల గారికి పరిచయం చేస్తూ - కొత్త వాళ్ళకి అవకాశాలిచ్చినపుడు కొంచెం మంచి అవకాశాలివ్వండని అన్నారు. నన్ను డూప్‌గా చేయమన్నపుడు కావాలనే నాతో ఇలా చేస్తున్నారని అపోహ పడ్డాను. తర్వాత రాజా, బి.వి.పట్టాభిరాంలు నన్ను ఒప్పించారు. మద్రాసుకి రానూ పోనూ ఫ్లైట్ టిక్కెట్స్ ఇచ్చి, ఓ పెద్ద ఆర్టిస్ట్‌కిచ్చే ట్రీట్‌మెంటే నాకూ ఇచ్చారు. ఒకరోజు అనుకున్నది కాస్తా వర్షాల వల్ల, హీరో మోహన్ డేట్స్ కుదరక పోవడం వల్ల పదిరోజులు



## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : సంతోష్ ఫిలింస్ |
| సంగీతం | : రాజన్-నాగేంద్ర |
| పాటలు | : డా.సినారె, మల్లెమాల, జొన్నవిత్తుల, ముళ్ళపూడిశాస్త్రి |
| నేపథ్యగానం | : బాలు,జానకి, మధవపెద్ది రమేష్, చిత్ర |
| సారథ్యం | : కోనేరు రవీంద్రనాథ్ |
| సమర్పణ | : యం.యస్.రెడ్డి |
| కథ | : ఆదివిష్ణు |
| మాటలు | : జంధ్యాల |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : దాసరి దానయ్య, మనోజ్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : యన్.బి.శాస్త్రి |
| కో - డైరెక్టర్ | : యు.వి.పాణి |
| కూర్పు | : గౌతంరాజు |
| ఛాయాగ్రహణం | : దివాకర్ |
| నిర్మాత | : శ్రీమతి కోనేరు రాధాకుమారి |
| రచన దర్శకత్వం | : జంధ్యాల |



పట్టేసింది. కారు దిగడం, నడిచి వెళ్ళడం లాంటివి కొన్ని క్లోజప్‌లు, మరికొన్ని లాంగ్‌షాట్స్‌లు తీసారు. నిజం చెప్పాలంటే ఈ సినిమాకి నా చేతులు పనిచేశాయి. ఇందిరాపార్క్‌లో తీసిన 'చూపులు కలిసిన శుభవేళ' సాంగ్‌లో కొన్ని బ్యాలెన్స్ షాట్స్‌ని మద్రాస్‌లో ఓ పార్క్‌లో నా మీద తీశారు. ఈ సినిమాలో డూప్‌గా చేసానన్న కృతజ్ఞతతో జంధ్యాల తర్వాత ఓ సినిమాలో పెద్ద వేషం ఇస్తానన్నారు. 23 గంటల్లో తీయాలని ఎమ్మెస్ రెడ్డిగారి బేనర్‌లో ఓ సినిమా ప్లాన్ చేశారు. అది జరగలేదు" అని ఆ సంగతుల్ని గుర్తు చేసుకున్నారు అగస్త్యశాస్త్రి.

ఈ సినిమాలో వీరభద్రరావు హాస్యరస పోషణలో నిజంగా వీరభద్రుడిలానే విజృంభించారు. ఆయన పాత్ర తాలుకు కొన్ని హైలెట్స్ గురించి ఈ సందర్భంలో గుర్తు చేసుకుందాం.

ఇందులో ఆయన పాత్ర పేరు గుండు పాండురంగం. ఆయనకో గడియారాల కంపెనీ వుంటుంది. రకరకాల వాయిన్‌లతో గడియారాలు తయారుచేసి స్నేహితులకి కానుకగా ఇస్తుంటాడాయన. 'ఇంకెంతసేపీ మొద్దు నిద్ర' అని ఒక గడియారం తిట్ల దండకం అందుకుంటే, 'కౌసల్యా సుప్రజా రామా' అని ఇంకో గడియారం సుప్రభాతం పాడుతుంది.

ఓసారి ఓ కుర్రాడొచ్చి 'గుండు పాండురంగంగారు వున్నారా? అని ఓ కుర్రాడొచ్చి వీరభద్రరావుని అడుగుతాడు. అతన్ని తనతో పాటు 26 కిలోమీటర్లు వాకింగ్ చేయించుకుని 'నేనే ఆ పాండురంగాన్ని. నాతో పనివుంటే ఇంటికొచ్చి కలువు. నేను రోడ్డు మీద మాట్లాడను' అని చెప్పేసి కారెక్కి చక్కా వెళ్ళిపోతూ మనకి చక్కిలిగింతలు పెడతారాయన. "ఉయ్యాల నుంచి శ్మశానం దాకా వుండే నడకే జీవితం. పురిటి మంచం నుంచి పుడకల చితిదాకా వుండే నడకే జీవితం" అని నరేష్‌కి ఇందులో ఒకచోట హితబోధ చేసిన వీరభద్రరావు, అనుకోకుండా ఎక్కువ దూరం నడిచేసి స్మశానం చేరుకున్నారు.

ఇందులో నూతన్ ప్రసాద్‌ది ఓ చమత్కార భరితమైన పాత్ర. వీరభద్రరావు అన్నయ్య గుండు నాగలింగంగా కనిపిస్తారాయన. ఈయనగారు ఎదుటివాళ్ళ మనసులోని అసలు నిజం తెలుసుకోవడం కోసం మారువేషాలు వేస్తూంటారు. కాసేపు పనివాడిగానూ, ఇంకాసేపు చిలకజోస్యం చెప్పే జ్యోతిష్యుడుగాను నటిస్తారాయన.

కోటశ్రీనివాసరావుది చిత్రాతి చిత్రమైన పాత్ర. వాళ్ళ కుటుంబం పధ్నాలుగు తరాల నుంచి విజయనగర సామ్రాజ్యంలో దివాన్‌లుగా



పనిచేసారట. ఆ వాసనలు వదులుకోలేని కోట అచ్చమైన గ్రాంధికంలో మాట్లాడుతుంటారు. అంతేకాదు దర్పం కోసం కొడుకుని హార్స్‌రైడింగ్ నేర్చుకోమని పోరుపెడుతుంటారు కూడా ! దాంతో గుర్రపు స్వారీకి ప్రయత్నించి, ప్రయత్నించి ప్రతిసారీ కిందపడి దెబ్బలు తింటూ వుంటాడు మోహన్.

జంధ్యాల సినిమాలో కోట శ్రీనివాసరావు విభిన్నమైన పాత్రలనే పోషించారు. ఇందులో పాత్ర కూడా ఆ కోవకి చెందినదే. "జంధ్యాల సినిమాలో నటించడానికి పెద్ద ప్రిపరేషన్ అవసరం లేదు. పదిహేను పాత్రలుంటే పదిహేను రకాలుగా ఆయనే చేసి చూపిస్తారు. నిజం చెప్పాలంటే ఏ ఆర్టిస్ట్ అయినా కొన్ని పాత్రలకి హోం వర్క్ చేయాలి. కానీ జంధ్యాల సినిమాలకి ఆ అవసరం వుండదు. జనరల్‌గా కామెడీ అనే కాకుండా గమ్మత్తైన మెలికలతో పాత్రను సృష్టిస్తారాయన. ఆయనది బ్యూటిఫుల్ పెన్. హాస్యమెంత గొప్పగా రా(తీ)స్తారో, సెంటిమెంట్ అంత గొప్పగా పండిస్తారు" అంటూ ఉద్వేగంతో జంధ్యాల గురించి చెప్పుకొచ్చారు కోట.

వీరభద్రరావు దగ్గర అసిస్టెంట్ పాత్ర బ్రహ్మానందంది. పేరేమో సుబ్రహ్మణ్యం. బాస్‌కి కాఫీ, టీలు, స్నాక్స్ అందిస్తూ వాటిని చూపులతోనే జుర్రేస్తుంటాడు. ఇలా తిండి

## కథాంశం

గుండుపాండురంగం గారి గడియారం కంపెనీలో మేనేజర్‌గా పనిచేస్తున్న ఆనందమోహన్, వాళ్ళమ్మాయి పద్మని ప్రేమిస్తాడు. నందిగామలో సైకిల్‌షాప్ పెట్టుకుని మొహమాటం కారణంగా అన్నీ పోగొట్టుకుని చివరికి ఆత్మహత్యకు ప్రయత్నిస్తాడు లక్ష్మీప్రసాద్. ఈలోగా మోహన్ వచ్చి అతన్ని కాపాడి, తమ కంపెనీలోనే ఉద్యోగమిప్పిస్తాడు. నందిగామలో తనకు తారసపడిన లలిత సిటీలో కనబడేసరికి తెగ ఆనందపడిపోగతాడు ప్రసాద్. ఆమెను గాఢంగా ప్రేమిస్తాడు. అజ్ఞాత ప్రేమికుడిగా ఆమెతో దాగుడుమూతలాడతాడు. మోహన్, పద్మల ప్రేమను పాండురంగంకు చెప్పే ప్రయత్నంలో తాను ఇరుక్కుపోతాడు. చివరికి మోహన్,పద్మల పెళ్ళికి ఇరుపక్షాలవారు ఒప్పుకుంటారు. పద్మ అసలు తండ్రి పాండురంగం అన్నయ్య నాగలింగం ప్రేమ పెళ్ళిళ్ళకు వ్యతిరేకి. తమ్ముడు తన అంగీకారం లేకుండా తన కూతురి పెళ్ళి జరిపించడంతో కోపంతో ఆస్తి పంపకాలు చేయిస్తాడు. కొడుకులిద్దరూ సీతమ్మని ఒంటరిని చేస్తే, మోహన్ తండ్రి గుర్నాథం ఆమెకు ఆశ్రయమిస్తాడు. మొండివాళ్ళయిన పాండురంగం, నాగలింగయ్యలను 40 రోజుల్లోగా తిరిగి కలవడం కోసం మోహన్,పద్మ,ప్రసాద్‌లు ఛాలెంజ్‌గా ప్రయత్నిస్తారు. చివరకు అన్నదమ్ములు ఒక్కటవుతారు. అలాగే ప్రసాద్, లలితలు దంపతులౌతారు.

వీక్‌నెస్ వున్న బ్రహ్మానందంకు, చాలా పెళ్ళి చూపుల తర్వాత అలాంటి అలవాటే వున్న శ్రీలక్ష్మి భార్యగా దొరుకుతుంది. గారెల దండలు మార్చుకుని, కారంబూంది తలంబ్రాలుగా వేసుకుని ఒక్కటవుతారు వాళ్ళు. తిండి నేపథ్యంలో వీరిద్దరి మీదా జంధ్యాల అల్లిన హాస్యం ఇప్పటికీ గిలిగింతలు పెడుతుంది.

'అహనా పెళ్ళంట' లోని అరగుండు పాత్ర బ్రహ్మానందంకు నటుడిగా లైఫ్ ఇస్తే, 'చూపులు కలిసిన శుభవేళ' లోని సుబ్రహ్మణ్యం పాత్ర ఆయన కెరీర్‌కే టర్నింగ్ పాయింట్‌గా నిలిచిపోయింది. "1987 లో అరగుండు' వేషంతో 14 చిత్రాల్లో అవకాశాలు వచ్చాయి. 1988 లో నా లెక్చరర్ ఉద్యోగానికి రాజీనామా చేసాను. ఈ ఏడాదిలోనే జంధ్యాలగారి 'చూపులు కలిసిన శుభవేళ' చిత్రంలో ఎవరైనా తింటుంటే చూస్తుండిపోయే మేనరిజం గల పాత్ర చేసాను. ఈ పాత్రకి అనూహ్య స్పందన లభించింది" అని చెప్పుకొచ్చారు బ్రహ్మానందం.

ఇందులో శ్రీలక్ష్మికి తొలుత కేటాయించిన పాత్ర సుభద్ర(నూతన్‌ప్రసాద్ భార్య). అయితే ఆమె వేరే సినిమాల్లో బిజీగా వుండటంతో ఆ పాత్ర కాస్తా రాధాకుమారికి దక్కింది. అయితే జంధ్యాల సినిమాల్లో శ్రీలక్ష్మి పర్మినెంట్ మెంబర్ కాబట్టి ఏదో ఒక పాత్ర తప్పనిసరిగా చేయాలి. ఆమె డేట్స్‌కనుగుణంగా బ్రహ్మానందం పక్కన ఓ వేషం వేయించారు జంధ్యాల. "నేను జంధ్యాల శిష్యురాలిని, ఆయన సినిమాల్లో తప్పకుండా చేయాలనే ఉద్దేశ్యంతో చిన్న పాత్రయినా గానీ ఇది చేసాను. అయినా కూడా ఈ పాత్ర బాగా క్లిక్ అయ్యింది. నేనూ, బ్రహ్మానందం ఇద్దరం తిండిపోతులం. మా ఇద్దరికీ పెళ్ళవుతుంది. పెళ్ళయిన తర్వాత కూడా పిల్లలు, సంసారం గురించి కాక తిండి గురించే మాట్లాడుకుంటుంటాం. చాలా చమత్కారంగా వుంటుంది నా పాత్ర" అని చెప్పారు శ్రీలక్ష్మి.

శ్రీలక్ష్మిలాగానే సుత్తివేలుకు కూడా డేట్స్ అడ్జెస్ట్ చేయలేని పరిస్థితి ఏర్పడింది. దాంతో సుత్తివేలు ఇందులో అతిథిపాత్రలో కనిపించాల్సి వచ్చింది. నందిగామలో నరేష్‌కి ప్రేమ గురించి హితబోధ చేసే కొండ దొరగా కనిపిస్తారాయన.

"లేకుంటే వేరే పెద్ద పాత్ర చేసేవాణ్ణి. సెంటిమెంట్‌గా ఆయన సినిమాలో



## పాత్రలు-పాత్రధారులు

| | |
|---|---|
| లక్ష్మీప్రసాద్ | : నరేష్ |
| ఆనంద మోహన్ | : మోహన్ |
| పద్మ | : అశ్విని |
| లలిత | : సుధ (నూతన నటి) |
| నాగలింగం | : నూతనప్రసాద్ |
| గుండు పాండురంగం | : కే.కే. వీరభద్రరావు |
| గుర్నాథం | : కోటశ్రీనివాసరావు |
| కొండ దొర | : వేలు |
| సుబ్రహ్మణ్యం | : బ్రహ్మానందం |
| మండోదరి | : శ్రీలక్ష్మి |
| సుభద్ర | : రాధాకుమారి |
| రవణమ్మ | : రత్నాసాగర్ |
| లక్ష్మి (పాండురంగం భార్య) | : ఆయేషా |
| లలిత వదిన | : లక్ష్మీప్రియ |
| నారాయణమూర్తి (లలిత అన్నయ్య) | : విద్యాసాగర్ |
| త్యాగరాజు | : అశోక్ కుమార్ |
| మండోదరి తండ్రి | : జెన్నీ |

మరియు
మద్దూరి విజయలక్ష్మి, ఈశ్వరచంద్ర, మధు, తిలక్, మనోహర్, కమలాకర్, డా.నాగేశ్వరరావు, లక్ష్మీపతి, సి.హెచ్.రంగబాబు, ఆనంద్, టి. సత్యం, హరిత, జె. వరలక్ష్మి, ప్రియ, అన్నపూర్ణ, శిల్ప తదితరులు.





వుండాలనుకుని ఐదు నిమిషాల వేషమైనా గానీ కొండ దొరగా చేశాను. ఒక నిర్మాతకి ఇచ్చిన డేట్స్‌ను మళ్ళీ వెనక్కి తీసుకోకూడదని జంధ్యాలగారు నాకు ముందు నేర్పిన సూత్రం. దాన్ని తూచా తప్పకుండా ఇప్పటికీ పాటిస్తూనే వున్నాను"అని వివరించారు సుత్తివేలు.

ఇందులో వేలు నటించిన సీన్స్‌ని గంటలోపే చిత్రీకరించారు. ఇప్పుడు హైటెక్ సిటీ వున్న మాదాపూర్ అప్పట్లో ఖాళీగా గుట్టలతో వుండేది. అక్కడో చెట్టు, దానికింద టీ కొట్టు, అక్కడే ఈ సీన్స్ తీశారు.

కమల్‌హాసన్ పోలికలున్న తమిళ నటుడు మోహన్ ఇందులో నరేష్‌తో పాటు హీరోగా నటించడం జరిగింది. ఇతనికి ఘంటసాల రత్నకుమార్ గాత్రదానం చేసారు.

ఈ సినిమా చేస్తున్నపుడు మోహన్ తన అభిప్రాయం వెలిబుచ్చుతూ - "నా తమిళ చిత్రాలు తెలుగులో అనువదించబడి విజయవంతమవుతున్నాయి. కానీ నేను డైరెక్ట్‌గా నటించిన తెలుగు చిత్రాలు మాత్రం ఫెయిలవుతున్నాయి. అందుకే నేను డైరెక్ట్ తెలుగు సినిమాలు చేయడానికి ఇష్టం చూపడం లేదు. అయితే జంధ్యాల గారి సినిమా అనగానే ఆశ చిగురించి ఒపుకున్నాను' అని వివరించారు.

'పాదపూజకు, టైమ్ అయ్యింది పళ్ళెం తెచ్చుకుంటాను' అంటూ పతిమీద అపార ప్రేమాభిమానాలు కనబరిచే పాత్రలో రాధాకుమారి చక్కటి అభినయాన్ని కనబరిచారు.

జంధ్యాల దర్శకత్వంలో రావూ - గోపాలరావూ, శ్రీవారి శోభనం, బాబాయ్ అబ్బాయ్ సినిమాల్లో మంచి హాస్య పాత్రలు పోషించిన రాధాకుమారి ఊహించని విధంగా ఇందులో సుభద్ర పాత్రను పొందారీ చిత్రంలో.

" ఓ రోజు జంధ్యాల గారు మద్రాసు ఫోన్ చేసి వెంటనే బయలు దేరి హైదరాబాద్ రమ్మన్నారు. అధిక పతిభక్తితో పాదపూజలు చేసే ఈ పాత్ర ఇచ్చారు. జంధ్యాల గారితో వర్క్ చేస్తుంటే అస్సలు టైం తెలిసేది కాదు. సీన్స్ చేస్తున్నప్పుడు జోక్స్ వేసి నవ్వించి హుషారు పుట్టించేవారు. ఓ సీన్‌లో నూతన్ ప్రసాద్ గారితో పాటు నేను కూడా మారువేషం వేస్తాను. 'సత్యం శివం' సినిమాలో జీనత్ అమన్‌లాగా సగం ముఖం మాత్రమే కనిపించాలి' అని జంధ్యాల గారు నాతో చమత్కార మాడారు. వీరభద్రరావు గారి ఆఖరు సినిమాలో నేను కూడా పనిచేయగలిగాను. ఆ సాయంత్రం వీరభద్రరావు మద్రాసు ఫ్లైట్‌కి వెళ్లాల్సి వుండటంతో లంచ్‌బ్రేక్ లేకుండా షూటింగ్ చేశాం. నాలుగ్గంటలకి భోజనం చేస్తున్నాం. అప్పటికే తన అనారోగ్యం గురించి తెలిసివున్నా కూడా వీరభద్రరావు గారు కొత్త ఆవకాయ వేసుకుని భోంచేస్తున్నారు. 'ఏంటండి, ఆవకాయ అలా తినేస్తున్నారు' అని నేనంటే, 'ఇప్పుడు తినకపోతే ఇంకెప్పుడు తింటాం. అయినా తింటే చస్తానా' అని అనేశారు. అలా అన్న ఆయన చావు కబురు తర్వాత రోజున తెలిసి షాకయ్యాం" అంటూ ఈ సినిమా తాలూకు జ్ఞాపకాలను గుర్తు చేసుకున్నారు రాధాకుమారి.

నటుడు విద్యాసాగర్ భార్య రత్నాసాగర్

చూపులు కలిసిన శుభవేళా
ఎందుకు నీకీ కలవరము
ఎందుకు నీకీ పరవశము
కమ్మని చూపుల కలయికలో
ఖైదీ అయినది నా మనసు
అందుకే నాకీ కలవరము
అంతే లేని పరవశము ॥చూపులు॥
కులుకులు నేర్చిన నీ నడకలలో
ఆ... నడకలలో...
కులుకులు నేర్చిన నీ నడకలలో
కోటి హంసల హొయలుంది
నిగనిగలాడే నీ వాల్జెడలో
వాల్జెడలో...
నిగనిగలాడే నీ వాల్జెడలో
నిలువున దోచె గుణముంది
అందుకే నువ్వంటే ప్రాణం
అందుకో నా మమతల హారం ॥చూపులు॥
సందె పొద్దులు చాటుకు పొమ్మని
ఆ... చాటుకు పొమ్మని...
సందె పొద్దులు చాటుకు పొమ్మని
చందమామను విందుకు రమ్మని
ముద్దూ ముచ్చట వద్దన చేద్దాం ॥2॥
వద్దను దాకా తినిపిద్దాం
పొదరిల్లే మన విందుకు విడిది
రుచి చూపిద్దాం తక...... ॥చూపులు॥





ఈ సినిమా కోసం గుండు కొట్టించుకుని బామ్మ వేషం వేసారు. అప్పటికామె వయసు 35 ఏళ్ళ లోపే. ఆ వయసులో కూడా ఆ పాత్ర మీద ఉన్న



ఆపేక్ష కొద్దీ గుండు కొట్టించుకోవడానికి సిద్ధమై పోయారామె. బ్రహ్మానందం బామ్మగా వంణ వమ్మగా ఇందులో కొద్దిసేపే కనిపించినా ఎక్కువ కాలం గుర్తుండి పోయే పాత్ర. ఈ సినిమాకు ముందు 'నీకు నాకు పెళ్ళంట' లో కూడా ఆమె ఫుల్‌లెంగ్ బామ్మ కేరెక్టర్ చేశారు.

ఈ చిత్రం ద్వారా నరేష్ సరసన సుధ అనే కొత్తమ్మాయి పరిచయం అయింది.

అసలు 'చూపులు కలిసిన శుభవేళ' కథ ఎలా మొదలయిందో చూద్దాం. వీలు కుదిరినప్పుడల్లా ప్రతి శుక్రవారం మద్రాసు నుంచి హైద్రాబాద్ వచ్చేవారు జంధ్యాల. హోటల్ అన్నపూర్ణ వీరికి కొలువు. శని,ఆదివారాలు మిత్ర బృందంతో గడిపేవారు.

ఆ రోజు ఆదివిష్ణుతో 'ఏదైనా మంచి ఎపిసోడ్ చెప్పు గురువా' అనడిగారు జంధ్యాల. ఆదివిష్ణు, వీరభద్రరావుమంచి స్నేహితులు. ఆ చనువు కొద్దీ వీరభద్రరావు మీద సరదాగా ఓ వాకింగ్ ఎపిసోడ్ చెప్పుకొచ్చారు ఆదివిష్ణు. అలా అలా కథ తయారైపోయింది.

"హోటల్ రూమ్‌లో 2, 3రోజుల్లోనే ఈ కథ రెడీ అయిపోయింది. సరదాగా ఒక లైన్ అనుకోవడం, దాని గురించి చర్చలు.. అలానే కథ పూర్తయి పోయేది. అది మా కథల తయారీ స్టయిల్. ఆ చర్చల్ని టేపుల్లో రికార్డ్ చేసేవాళ్లం. ఈటేపుల్ని బట్టే స్క్రిప్ట్ రెడీ అయ్యేది. అంతేగానీ పేపర్ మీద పెన్నుపెట్టి ఆలోచించడమనేది జరిగేది కాదు." అన్నారు ఆదివిష్ణు.

జంధ్యాల క్లాస్‌మేట్ అయిన కోనేరు రవీంద్రనాథ్ ఈ చిత్రాన్ని ఎమ్మెస్ రెడ్డితో కలిసి నిర్మించారు. జంధ్యాలను 'ముద్ద మందారం'తో దర్శకునిగా పరిచయం చేసింది ఈయనే. ఇక ఎమ్మెస్ రెడ్డికి జంధ్యాల చేసిన సినిమా ఇదొక్కటే. అయితే ఒకసారి ఎమ్మెస్ రెడ్డి బేనర్‌లో ఓ సినిమాకి ప్లానింగ్ జరిగింది. ఆ సినిమా షూటింగ్ కార్యక్రమం యావత్తూ, కేవలం 24 గంటల్లో పూర్తయ్యేలా ప్లాన్ చేశారు జంధ్యాల. అందుకు అనువుగా ఆదివిష్ణు చేత ఓ కథ తయారు చేయించారు. కథ బాగా నచ్చి ఎమ్మెస్ రెడ్డి ఇద్దరికీ అడ్వాన్సులు కూడా ఇచ్చారు. కారణాంతరాల వల్ల ఆ ప్రాజెక్టు వాయిదా పడింది. ఇప్పటికీ ఆ స్క్రిప్ట్ ఎమ్మెస్ రెడ్డి గారి దగ్గరే ఉంది.

దర్శకుడిగా జంధ్యాలకిది 26వ చిత్రం. 2 జూన్ 1988న ఈ చిత్ర ప్రారంభోత్సవం హైదరాబాద్‌లోని బంజారాహిల్స్‌లో జరిగింది. 'హల్లో.. గుడ్‌మార్నింగ్' అంటూ అశ్వనీని చూస్తూ మోహన్ పలకరించడాన్ని ముహూర్తపు షాట్‌గా చిత్రీకరించారు. విఖ్యాత దర్శకులు డా.దాసరి

| | |
|---|---|
| రిలీజ్ | : 1988 |
| నిర్మాణ ప్రాంతం | : హైదరాబాద్ పరిసరాలు |
| నిర్మాణ సమయం | : సుమారు 35 రోజులు |

నారాయణరావు క్లాప్ కొట్టగా, నాటి సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా.సి.నారాయణరెడ్డి కెమెరా స్విచాన్ చేశారు.

ఈ సందర్భంగా జంధ్యాల మాట్లాడుతూ - "ఈ సినిమాలో ఇన్సిడెంటల్ కామెడీ ఎక్కువ. పాటలు కూడా సన్నివేశానుగుణంగానే వుంటాయి. నాకు ఇష్టమైన ఆర్టిస్టుల్లో మోహన్ ఒకరు. ఇందులో నరేష్‌తో పాటు మోహన్ కూడా హీరోగా నటిస్తున్నారు" అని చెప్పారు.

జులై 6 వరకూ హైదరాబాద్ పరిసరాల్లో ఏకధాటిగా జరిపిన షూటింగ్‌తో ఈ చిత్రం మొత్తం పూర్తయ్యింది. మేడ్చల్‌లో ఓ ప్రముఖ కాంగ్రెస్ నాయకుని ఇంట్లో నూతన్‌ప్రసాద్ ఇంటికి సంబంధించిన దృశ్యాలను చిత్రీకరించడం జరిగింది.

ఆదివిష్ణు మాట్లాడుతూ - "జంధ్యాలతో ఇది నా మూడవ చిత్రం. ఈ చిత్రకథ నేను రాసిన ఏ నవలకూ ఆధారం కాదు. ప్రత్యేకంగా సినిమా కోసం రాసిన కథ ఇది" అని చెప్పారు.

ఈ సందర్భంగా ఓ చిన్న విషయం... ఇటీవల యస్వీ కృష్ణారెడ్డి దర్శకత్వంలో 'లేతమనసులు' చిత్రాన్ని నిర్మించిన కొసరాజు రాజేంద్రబాబు 'కలియుగ దైవం' దర్శకుడు ఎం.రోసిరాజు దర్శకత్వంలో చంద్రమోహన్, అరుణ, శరత్‌బాబు, కవితలతో ప్లాన్ చేసిన సినిమాకి మొదట ఇదే టైటిల్‌ని అనౌన్స్ చేసారు.

నరేష్ చెప్పినట్టుగానే - ఈ సినిమాలో ఎప్పటికీ మరచిపోలేని సన్నివేశాలు పుష్కలంగా ఉన్నాయి. టైటిల్ సాంగ్ ఈ సినిమాకు ఓ ప్రత్యేకతను తీసుకువచ్చింది. టైటిల్స్ పడుతున్నప్పుడు, 'శుభం' కార్డుకు ముందు 'మాయాబజార్' లోని 'చూపులు కలిసిన శుభవేళ' పాటను సమయోచితంగా ఉపయోగించుకున్నారు జంధ్యాల. వీరభద్రరావు, నూతన్‌ప్రసాద్, బ్రహ్మానందం ఇత్యాది పాత్రలకు క్లైమాక్స్‌లో ఇచ్చిన ఫినిషింగ్ టచ్ జంధ్యాల మార్క్‌ని మరోసారి తేటతెల్లం చేసింది. పతాక సన్నివేశాల్లో సందేశాన్ని ఇమిడ్చి జంధ్యాల ఓ కొత్త ప్రయత్నం చేశారు. ప్రేమ వివాహాల ప్రాధాన్యతని, వలచిన మనసుల అంతర్మథనాన్ని అర్థవంతంగా ఆవిష్కరించారు. ప్రేమించి పెళ్ళి చేసుకునే వివాహాలు ఎప్పుడూ విఫలమౌతాయి అన్న ఛాందస భావాన్ని కొట్టి పారేసి మనసు మనసు కలిస్తే ఏ పెళ్ళయినా ఫలిస్తుందని నిరూపించే రెండు జంటల కథని ఇలా నవ్వుల కోటింగ్‌తో కనుల పంటగా తెరకెక్కించి తన ప్రత్యేకతను నిలుపుకున్నారు జంధ్యాల. అందుకే ఈ ప్రయత్నం నూటికి నూరు రోజుల ఫలితాన్నిచ్చింది.

- పులగం చిన్నారాయణ

# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**13**

### జరిగిన కథ

**మ**ధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. వసుంధర శనాదివారాలు కృష్ణమూర్తి దగ్గర ఆర్టు నేర్చుకుంటానని చెప్పి అతని గదికి వస్తుంది. ఆ ఏర్పాట్లు చూడడానికి వచ్చిన కొండల్రావు, కృష్ణమూర్తి వసుంధరను వలలో వేసుకుంటున్నాడని చెప్పడంతో భయపడుతుంది.

**-(ఇక చదవండి)**

**ఆ**ఫీసులో కూర్చుని ఏదో టైపుచేసుకుంటున్నది సత్యభామ. ఇతర సిబ్బంది అంతా ఎవరి పనులు వారు చేసుకుంటున్నారు. క్రమశిక్షణ విషయంలో కఠినంగా వ్యవహరించే శ్రీధరం ఆఫీసులో ముచ్చట్లు, బాతాఖానీలు, మహారాజశ్రీ గవర్నమెంటు వారి ఆఫీసుల్లోలా నిద్రపోవడాలు, సీట్లో కూర్చోకుండా క్యాంటిన్లో సెటిల్‌మెంట్లు చేసుకోవడాలు వంటివి కనిపించవు. ఎవరికి వారు వారి సీట్లలో తలవంచుకు కూర్చుని బుద్ధిగా పనిచేసుకోవడమే ఉంటుంది. అందుకనే ఒక హాల్లో పాతికమంది కూర్చున్నా చీమ చిటుక్కుమన్నా వినిపిస్తుంది.



దూరం నుంచి టేప్‌రికార్డర్లో "కృష్ణం కలయ సఖి సుందరం-బాలకృష్ణం కలయసఖి..'' పాట వినిపించింది. ఆ పాటకే తాను వసుంధరకు నృత్యం నేర్పించడం వలన ఆ పాటవినగానే తల అటు వైపు తిప్పింది భామ.

గిరి హుషారుగా ఒక చేత్తో టేప్‌రికార్డర్, మరో చేత్తో ఒక ఆల్బమ్ పట్టుకుని లోపల కొచ్చాడు. హాలు మధ్యలో నిలుచుని "కే.కే.. మిస్టర్ కే.కే..ప్లీజ్ కమ్..క్విక్... అర్జెంటుగా రావాలి. ది కాంపెయిన్ ఆఫ్ ద సెంచరీ. దషాంపెయిన్ ఆఫ్ ఆల్ కాంపెయిన్స్, కే.కే. ..'' అరిచాడు.

సిబ్బంది అంతా ఆశ్చర్యంగా గిరివైపు చూశారు. తమ కంపెనీ డైరెక్టర్లో ఇంత హుషారు వారెప్పుడు గమనించలేదు మరి. కృష్ణమూర్తి నుంచి ఎలాంటి స్పందనా లేదు.



దాంతో మరోసారి "ఇట్స్ ఓకే..కే.కే... చేతిలో పనులాదిలేసి రావాలి" కేక పెట్టాడు గిరి.

"యస్సార్... " బయట కొచ్చాడు కృష్ణమూర్తి. గిరిచేతిలో ఉన్న ఆల్బమ్ లోంచి ఫోటోలు చూపించాడు సిబ్బంది అందరికీ. భామకు ప్రత్యేకంగా చూపించాడు. ఆ ఫోటోలు చూసిన భామ ముఖం ఎర్రబడ్డది. తాను వసుంధరకు డాన్స్ నేర్పుతున్నప్పుడు తన అనుమతిలేకుండా దొంగచాటుగా గిరి తీసిన ఫోటోలవి.

"లుక్ ఎట్ దిస్ కె.కె. ద స్టోరీ ఆఫ్ ద డాన్సింగ్ సారీ. నాట్యమాడే చీర. నిన్న ఫోటోలు తీశాను. ఎలా ఉన్నాయి?'' కృష్ణమూర్తిని అడిగాడు గిరి.

కృష్ణమూర్తి నేత్రాలు నిప్పులు రాల్చాయి. కానీ కోపాన్ని రెప్పల మాటునే దాచాడు. అనువుకాని చోటు అధికుల మనరాదు. పైగా స్థానబలమేమి లేదు మౌనం దాల్చాడు.



ఫోటోలను మళ్ళీ భామకు చూపించాడు గిరి. పైశాచికానందం అతని ముఖంలో చిందులు వేస్తున్నది. "బ్యూటిఫుల్ కదూ మేడం?'' నవ్వాడు విషం చిమ్ముతూ.

ఆల్బమ్‌ను అలాగే తెరిచి పట్టుకుని కృష్ణమూర్తి దగ్గర కొచ్చాడు గిరి. "ఇది డాన్స్

చేస్తుంటే -చక్కని చీర ఎంతలా డాన్సాడుతుందో ...దీని వంపు సొంపులు ఎన్ని పోకళ్ళు పోతాయో చూపే ఫోటోలు! నువ్వు ఈ దృష్టితో డాన్సింగ్ శారీ అని పేరు పెట్టి పబ్లిసిటీ ప్లాన్ చెయ్యాలి. లక్ష....వన్ లాక్..చీరలు అమ్మే పూచీ నాది " అన్నాడు.

దిగ్భ్రమగా చూస్తూ సీట్లోంచి లేచింది భామ. కృష్ణమూర్తి వంక దీనంగా చూసింది. అదేం గమనించలేదు గిరి. "కమాన్ కే.కే.. హౌ ఈజిట్?" ఉద్రేకంగా అరిచాడు.

అందరి మధ్యా గిరితో వాదించడం ఇష్టంలేక "సార్... మనం రూం లోకి వెళ్ళి మాట్లాడుకుందాం" అన్నాడు.

గిరి అహంకారం అందుకు అంగీకరించలేదు. "నో... ఇందులో మాట్లాడటానికేం లేదు. దిసీజ్ ఏన్ ఆర్డర్. నేను ఈ కంపెనీ డైరెక్టర్ని" కోపంగా అన్నాడు.

కృష్ణమూర్తి మాట్లాడలేదు. తన ఆదేశం వెంటనే అమలు కాకపోవడం- తనకింద పనిచేసే వ్యక్తి తన ఆజ్ఞను ధిక్కరించడం గిరిలో క్రోధావేశాలను పెంచింది. తానంటే అందరూ గడగడలాడటం మాత్రమే ఎరిగిన గిరి ఈ ధిక్కారాన్ని సహించలేకపోయాడు.



తన శ్రీమతి అందాలను ఇలా నలుగురిలో పెట్టడం ఏ మాత్రం రుచించడంలేదు కృష్ణమూర్తికి. గిరిపై ఆగ్రహం రగులుతున్నది. కానీ ఏమీ చేయలేని నిస్సహాయస్థితి! గొంతు పెగల్చుకుని "ఎవరి ఆర్డరైనాసరే...నాకు నచ్చితేనే చేస్తాను" అన్నాడు స్థిరంగా

సిబ్బంది అంతా ఏమౌతుందోనని ఉగ్గబట్టుకుని చూస్తున్నారు. నోరు తెరిచే సాహసం చెయ్యడంలేదు.

"ఏవరేంటి? నేనే చెపుతూన్నాను" తీవ్రంగా అన్నాడు గిరి.



కృష్ణమూర్తిలో చలనం లేదు.

"డూ ఇట్" పై కప్పు ఎగిరేలా అరిచాడు గిరి.

"సారీ సార్... " శాంతంగా బదులిచ్చాడు కృష్ణమూర్తి.

"నీ కన్న గొప్ప అయిడియా నా కొచ్చిందని నీకు అసూయ?" అన్నాడు గిరి విషం కక్కుతూ.

"మీరెలా అనుకున్నా సరే" అదే శాంతంతో అన్నాడు కృష్ణమూర్తి.

"ఐ రిపీట్.. డూ ఇట్...డూ ఇట్ నౌ" చివరిసారి అన్నట్లు హెచ్చరించాడు గిరి. కృష్ణమూర్తి నుంచి సమాధానం లేకపోవడంతో గిరి ఆవేశం హద్దులు దాటింది. ఆల్బమ్‌ను బలవంతంగా కృష్ణమూర్తి చేతుల్లో పెట్టాడు.

"నో" అరుస్తూ ఆల్బమ్‌ను విసిరి కొట్టాడు కృష్ణమూర్తి. ఆల్బమ్‌లోని ఫోటోలన్నీ కిందపడి చెల్లా చెదురయ్యాయి సిబ్బంది అంతా దిగ్భ్రాంతులై ఇద్దరి వంకా చూడసాగారు. 'మొగుడు కొట్టినందుకు కాదు తోటికోడలు నవ్వినందుకు' అన్నట్లు కృష్ణమూర్తి ధిక్కారం కంటే సిబ్బంది అంతా అలా చూడటం తీవ్ర అవమానంగా తోచింది గిరికి. ఆవేశంతో పళ్ళు పటపటకొరకాడు. కృష్ణమూర్తి వంకా, భామ వంకా, సిబ్బంది వంకా ఉరిమి చూశాడు.



కృష్ణమూర్తి వైపు కొరకొర చూసి "మిస్టర్ కే.కే. నువ్వాఫైల్‌ను విసిరి కొట్టింది నామొహాన కాదు. మనబాస్ శ్రీధరంగారి మొహం మీద. నీకు అన్నం పెట్టే సంస్థ ముఖం మీద." అంటూ గర్జించి "పిక్ ఇట్ అప్... అవన్నీ ఏరి సరిగ్గా ఫైల్లో పెట్టు. అండ్ దెన్ ..క్షమాపణ చెప్పు.." అన్నాడు కసిగా.

భామ భయం భయంగా లేచి ఫోటోలను ఎత్తబోయింది. "నో..డోంట్ టచ్ ఇట్. ఎవరూ దాన్ని తియ్యకూడదు. తప్పుచేసిన వాడే తియ్యాలి" సీరియస్ గా అన్నాడు భామతో గిరి. భామ లేచింది వణుకుతూ.



భామ కృష్ణమూర్తి దగ్గరకొచ్చి ఎత్తమన్నట్లు కన్నీళ్ళతో చూసింది. కృష్ణమూర్తి ఫోటోలన్నింటినీ ఫైల్లో పెట్టి టేబుల్ మీద పెట్టాడు. గిరివైపు తిరిగి "గిరీ.. ఇదే పొర్పు మొన్నోసారి జరిగింది. పెళ్ళైన వాళ్ళ ఫోటోలు వారి పర్మిషన్ లేకుండా వాడకూడదని చెప్పాను. మళ్ళీ అదేతప్పు చేస్తున్నావు. చెయ్యమంటున్నావు. ప్లీజ్ డోంట్ డూ ఇట్... "కోపాన్ని నిగ్రహించుకుంటూ చెప్పాడు.

"అవన్నీ నేను చూసుకుంటాను. నీ డ్యూటీ ఇచ్చిన పని చెయ్యడమే కే.కే. ..." పరిహసించాడు గిరి.



"నువ్వు భామగారి ఫోటోలు తీశావు. నేను నీ మేనకోడలు వసుంధర ఫోటోలు ఇలాగే తీసి తెస్తే నువ్వొప్పు కుంటావా?" అన్నాడు కృష్ణమూర్తి.

గిరి కోపం అవధులు దాటింది. "వసుంధర ఫోటోలా? హౌ డేర్ యూ.. వసుంధరకూ దీనికీ పోలికేమిట్రా? యూ యారోగంట్ బాస్టర్డ్.." అని చేతిలోని టేప్‌రికార్డర్‌ను కృష్ణమూర్తి ముఖం మీదకి బలంగా విసిరాడు. టేప్‌రికార్డర్ కృష్ణమూర్తి తలకు గట్టిగా తగలడంతో నుదుటి మీద చేతులు పెట్టుకుని "అబ్బా..." అని బాధగా మూలిగాడు కృష్ణమూర్తి.

ఆ సంఘటనతో భామతో పాటు సిబ్బంది యావత్తు నిశ్చేష్టులయ్యారు. కృష్ణమూర్తి ముఖం, చేతులు రక్తసిక్తమయ్యాయి. భామవెంటనే కర్చీఫ్‌తో కృష్ణమూర్తి ముఖం తుడిచి కట్టు కట్టింది విలపిస్తూ. ఒక గుమాస్తా నీళ్ళ గ్లాసు తెచ్చాడు. తడిగుడ్డతో కృష్ణమూర్తి నుదురు భాగాన్ని శుభ్రం చేసింది భామ. అందరూ చేష్టలుడిగి చూడసాగారు. మానవతా రాహిత్యం, వాళ్ళ ఉదాసీనత ఈ రెండూ భామకు దుఃఖం అధికం చేశాయి.



"ఏమిటిలా గుడ్లు వెళ్ళబెట్టి చూస్తారు? సాటిమనిషి బుర్ర బద్దలై నెత్తురు కారుతుంటే చూస్తూ నిలుచుంటారా? డాక్టరుకు కబురు పంపండి" పిచ్చిదానిలా అరిచింది.

రెండు నిమిషాలకు రక్త ప్రవాహం ఆగింది. మెల్లగా లేచాడు కృష్ణమూర్తి. భామ వెక్కి వెక్కి రోదిస్తూ టేబుల్‌మీదున్న ఫోటోల్ని గిరి ముఖాన విసిరి కొట్టింది. నిశ్శబ్దంగా డ్రామా చూసినట్లు దారుణసంఘటన చూసిన వారంతా మెల్లగా తమ తమ స్థానాల్లో కూర్చుని మళ్ళీ పనిలో నిమగ్నమయ్యారు.

ఇంత జరిగినా గిరిలో ఏమాత్రం పశ్చాత్తాపం కనిపించపోవడమే పెద్ద వింత !

(ఇంకావుంది)



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బీయస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 1

సమన్వయం
మంజీర



"హలో, నా పేరు లక్కీ! మాటలు నేర్చిన కుక్కను. ఎటొచ్చీ నా మాటలు మీలో డాక్టర్ డూలిటిల్ ఒక్కడికే అర్థమవుతాయి. ఈ శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో మా డాక్టరు డూలిటిల్ పేరెరగనివారు లేరు. ఆ మాట కొస్తే ఈ ఒక్క ఊరేనేమిటి? అతని పేరు అన్ని ఊళ్లలోనూ మారుమ్రోగిపోతోంది.

మీ ఊళ్లో మ్రోగకపోతే ఇప్పటికైనా తెలుసుకోండి - డాక్టర్ డూలిటిల్ ప్రత్యేకత ఏమిటంటే - అతనికి జంతువుల భాష అర్థమవుతుంది. కుక్క, నక్క, బాతూ, కోతీ.. ఏ జంతువైనా సరే అతను హాయిగా కబుర్లు చెప్పగలడు. వాళ్ల బాధలు తెలుసుకుని వైద్యం చేయగలడు. చాలామంచి డాక్టరు లెండి. ఈ చేత్తో మనుషుల రోగాలనీ, ఆ చేత్తో జంతువుల రోగాలనీ నయం చేయగల సవ్యసాచి. పులికి కంటి ఆపరేషన్ చేసిన దగ్గర్నుంచీ అతనికి మంచిపేరు వచ్చింది. ఈ ఐదారేళ్లలో అతని ప్రాక్టీసు బాగా పెరిగింది. అందుచేత అతనికి ఎడాపెడా ఎపాయింట్‌మెంట్స్! ఎడవైపు ఎపాయింట్‌మెంట్స్ హాస్పటల్ స్టాఫ్ చూసుకుంటే, పెడవైపు నేను చూసుకుంటాను. కావాలంటే ఈ దృశ్యం చూడండి..."

డాక్టరు జాన్ డూలిటిల్ హాస్పిటల్ కారిడార్‌లో నడుస్తున్నాడు. వెంటనడుస్తున్న అతని అసిస్టెంట్ చెబుతోంది - "డాక్టర్, మీరు 10 గం॥లకు మిస్టర్ ఫలానాకు ఎపాయింట్‌మెంట్ ఇచ్చారు. మిసెస్ గిలానా 10-30 కల్లా ఎపాయింట్‌మెంట్ అడిగింది. నేను 12-15కి అడ్జస్ట్ చేస్తానన్నాను. కానీ 12-00లకు ఫిక్స్ చేసుకున్న మిసెస్ ఫలానా, ఫలానా.."



మరోపక్క కూడా నడుస్తున్న లక్కీ చెబుతోంది-"డాక్టర్! కానీ 12-30 కు బాతులకు ఇచ్చిన ఎపాయింట్‌మెంట్‌తో క్లాష్ రాకుండా చూసుకో!"

ఇద్దరూ చెరోపక్కా చెప్పనారంభించేరు. దేవుడిచ్చిన రెండు చెవులూ సద్వినియోగం చేస్తూ జాన్ ఇద్దరివీ వినేసి టపటపా ఇనస్ట్రక్షన్స్ ఇచ్చేశాడు. - "మిసెస్ గిలానాను గంట ముందే రమ్మనమను... గుడ్లగూబను మిట్టమధ్యాహ్నం రమ్మనమను. కావాలంటే ఎవర్నైనా తోడు తెచ్చుకోమను." అంటూ..

"చూశారుగా, ఇదీవరస. జంతువులు ఫీజివ్వలేవని జాన్‌కు తెలియక కాదు, అయినా మనుష్యుల కెంత ప్రాధాన్యత ఇస్తాడో జంతువులకూ అంతే ప్రాధాన్యత! అంతేకాదు, జంతువులకు వ్యక్తిత్వ వికాసం క్లాసులు కూడా తీసుకుంటాడు... వ్యక్తిత్వం అనేమాట మా విషయంలో వాడవచ్చో లేదో తెలియదనుకోండి... అంతేకాదు, ఆత్మవిశ్వాసాన్ని నింపుతాడు. ఇదిగో ఇంకో దృశ్యం చూడండి -"

ఆ క్లాసురూమ్‌నిండా కుక్కలే! జాన్ ఒక్కడే మనిషి. ఓ కుక్కను వేదికపైకి పిలుచుకువచ్చి మాట్లాడిస్తున్నాడు. అది వచ్చి తన పరిచయం చేసుకుంది-

"నా పేరు బ్యాండీ.."

జాన్ సైగ చేయడంతో తక్కిన కుక్కలన్నీ ఎలుగెత్తి పలకరించాయి - "హాయ్, బ్యాండీ.."

బ్యాండీ నిట్టూర్చింది - "మనుష్యుల భాషలో నేనొక ఊరకుక్కని! తల్లీతండ్రీ ఎవరో తెలియని అనాథను!"

జాన్ సముదాయించాడు - "నువ్వలా ఫీలవకూడదు బ్యాండీ. పదిమందిలో నీ కష్టం చెప్పుకుంటే బాధ తగ్గుతుంది. మొదటిసారి ఇబ్బందిగా ఉంటుంది. క్రమంగా అలవాటవుతుంది."

కుక్కల సముదాయం కూడా సముదాయించింది - "ఆ మాటకొస్తే మేమూ ఊరకుక్కలమే! ఇక్కడున్న అందరమూ అనాథలమే! నువ్వు ఒంటరిగా ఫీలవ్వద్దు" అని.

జాన్ అందుకున్నాడు - "చూశావా, అందరూ నీలాటివారే. అందువల్ల ఏమాత్రం కించపడవద్దు. నీకూ ఓ కుటుంబం త్వరలోనే ఏర్పడుతుంది. ఆశ అనేది ఎన్నటికీ విడిచిపెట్టవద్దు. నీకే కాదు, ఇక్కడున్న ప్రతి కుక్కకూ ఓ రోజు వస్తుంది. 'నాకో ఓ కుటుంబం ఉంది. నాకూ ఓ బెస్ట్ ఫ్రెండ్ వున్నాడు' అని గర్వంగా చెప్పుకునే రోజు వస్తుంది. ఎప్పటిదాకానో ఎందుకు? ఇప్పుడే..మనమే.. ఇంకోళ్లకి బెస్ట్‌ఫ్రెండ్ అనుకుందాం. ఈ రోజు నినాదం - 'ఐ యామ్ సమ్‌బడీస్ బెస్ట్‌ఫ్రెండ్!' అనండి అందరూ ముక్తకంఠంతో అనండి.."

శునకసమూహం ఒక్కపెట్టున అరిచింది - 'ఐ యామ్ సమ్‌బడీస్ బెస్ట్ ఫ్రెండ్!"

"మళ్లీ ఒక్కసారి.. ఇంకాస్త .. గట్టిగా"

జాన్ మాట మళ్లీ మన్నించడం జరిగింది.

"అద్దీ.. అలాగుండాలి. సరే, ఇంకో విషయం.. నార్త్ బీచ్ ఏరియాలో ఓ ఫ్యామిలీవాళ్లు అడిగారు. వాళ్లకో మంచి కాపలాకుక్క కావాలట. బయట షికార్లు కొట్టకుండా ఇంటిపట్టున ఉండాలిట. పిల్లలతో ఆడుకోవాలట. ఈ విషయంలో అనుభవం ఉన్నవాళ్లెవరైనా ఉన్నారా?"

"రస్టీకి మంచి అనుభవం ఉంది." అని సభలో కేకలు వినబడ్డాయి

"రస్టీ ఎవరు? లేచి నిలబడు." అన్నాడు జాన్ సభ కలయజూస్తూ.

రస్టీ నిలబడింది. కానీ ఒంటిమీద గజ్జి ఉన్న లక్షణాలు కనబడ్డాయి.

"ఇదిగో, ఇలా వుంటే ఉద్యోగం ఇవ్వకపోగా తన్ని పంపిస్తారు. ముందు నా దగ్గర మందు తీసుకో. తర్వాత ఉద్యోగానికి రికమెండ్ చేస్తాను." అని మందలించాడు జాన్.

**"చూశారా, మా డాక్టరుగారు ఉద్యోగాలు కూడా ఇప్పిస్తారు. మీకు తెలుసా? అతన్ని దేశంలో అనేక జంతుప్రదర్శనశాలలకు పిలుస్తారు. నిజం చెప్పాలంటే ప్రతి 'జూ'కి ఓ డాక్టరు అవసరం ఉంది. ముఖ్యంగా జంతువులు సుఖసంసారం సాగించాలన్నా, కొన్ని అరుదైన జాతులు అంతరించి పోకుండా ఉండాలన్నా డాక్టరు సలహాల అవసరం ఉంది. మా జాన్ కాలిఫోర్నియా జూలో తాబేళ్ల సమస్యను ఎలా పరిష్కరించాడో చూడండి. మీకు తెలుసుకదా, తాబేళ్లు వందలాది సంవత్సరాలు జీవిస్తాయని! అందువల్ల ప్రతిదానికీ గ్యాప్ ఎక్కువ! జాన్ ఏమడిగాడో తెలుసా? -"**

జూలో తాబేళ్ల జంటను చూడడానికి అనేకమంది వచ్చారు. జాన్ మగ తాబేలు నుద్దేశించి - "మీ ఆఖరుపిల్ల పుట్టి ఎన్ని సంవత్సరా లయింది?"

"అబ్బే, ఎంతోకాలం కాలేదు. ఓ 20 ఏళ్లయి వుంటుంది."

వెంటనే ఆడతాబేలు భర్త మాటల్ని ఖండించింది. " చాల్లెండి. వచ్చే సోమవారానికి 48 ఏళ్లయింది."



జాన్ ఇద్దరికేసీ సాలోచనగా చూసి సమరోత్సాహంతో ప్రకటించాడు - "మీ సమస్య ఏమిటో నాకు తెలిసిపోయింది. నేను కొన్ని మాత్రలు ఇస్తాను." అంటూ జేబులోంచి మాత్రల సీసా తీశాడు. "వీటిని బాగా పొడిపొడిచేసి ఇవి తింటూన్న ఆహారంలో కలిపేయండి." అంటూ జూ స్టాఫ్‌కు ఇచ్చాడు. కాస్త తినగానే మగతాబేలు భార్య కేసి చూసి కన్ను కొట్టింది. జాన్ తృప్తిగా నవ్వుతూ లేచి నిలబడ్డాడు.

**"నిజానికి ఇటువంటి అద్భుతాల ద్వారా మా జాన్ ఇంటర్నేషనల్ సెలబ్రిటీ అయిపోయాడు. అలాస్కా నుండి ఆస్ట్రేలియా దాకా అనేక దేశాలలో పర్యటించాడు. వింత వింత పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొన్నాడు. డిస్కవరీ ఛానెల్‌లో ప్రఖ్యాత ఏనిమల్ హంటర్ స్టీవ్‌ను చూసేవుంటారు. అతనితో ఓ సారి ఏం జరిగిందో తెలుసా? ఈ దృశ్యం చూడండి."**

ఓ అడివిలో టీవీ కెమెరాకు ఎదురుగా స్టీవ్ నేలమీద గొంతుకు కూచుని ఉన్నాడు. పక్కనే డూలిటిల్. వాళ్లకు కాస్త దూరంలో నిద్రిస్తున్నట్టున్న ఓ మొసలి ఉన్నాయి. స్టీవ్ తన ప్రేక్షకులకు చెబుతున్నాడు - 'హలో ఎవ్విబడీ, దిసీజ్ స్టీవ్. జంతువుల వేటాడం ఎలాగో ఇన్నాళ్లూ మీకు నేర్పడం జరిగింది. ఇప్పుడు బురదలో కూరుకుపోయిన ఓ మొసలిని రక్షించడం ఎలాగో చూపించడం జరుగుతుంది.

ఈ రోజు నాతోబాటు ఉన్నది డాక్టర్ జాన్ డూలిటిల్. ఈయన జంతువులతో మాట్లాడగలడు. అవును, మీతో, నాతో మాట్లాడినంత సులభంగా ఈయన జంతువులతో మాట్లాడగలరు. ఇప్పుడు మనం ఏం చేయబోతున్నామంటే ఈ మొసలిని కాపాడబోతున్నాం. పాపం దానికి



తెలియదు, తను బురదలో ఇరుక్కుపోయి ఉన్నానని..."

స్టీవ్ ఇలా మాట్లాడుతుండగానే మొసలి గుర్రుమంది. కానీ అదేమీ పట్టించుకోకుండా స్టీవ్ చెప్పుకుపోయాడు - "..నేనేం చేస్తానంటే చాటుగా వెళ్లి ఏమరుపాటుగా ఉన్న మొసలిపైన పడి దాన్ని రక్షించేస్తాను. రక్షించాక నా గురించి అదేమనుకుంటోందో ఈ డాక్టరు గారిని అడగమంటాను. మొసలి వెలిబుచ్చిన కృతజ్ఞతను డాక్టర్ జాన్ మనకు మన భాషలో చెప్తారు. మొసలిని పట్టుకునే చిట్కా ఏమిటంటే తోక పట్టుకుని నోటిలో చేయిపెట్టి దవడలు దూరంగా లాగి..."

ఈ ఉపన్యాసం సాగుతుండగా జాన్ మొసలికేసి చూపు సారించాడు. మొసలి స్వగతం చెప్పుకుంటూండడం చూసి ఓ చెవి అటు పారేశాడు. మొసలి అనుకుంటోంది - 'వెర్రివెధవ, నేను అపాయంలో ఉన్నాన్ట! వాడు కాపాడతాడుట!! నేనే కావాలని ఈ బురదలో దూరి పడుక్కున్నానని తెలియదు. నాకు తెలియకుండా వెనక్కాలే వచ్చేస్తాట్ట. నేనేం చేస్తానంటే స్టీవ్‌ను దగ్గరికి రానిచ్చి తోక పట్టుకోగానే గబాలున ఓ రౌండు కొట్టి అతని చెయ్యి పట్టుకుంటాను. టిఫిన్‌కి పనికొస్తుంది. బలే బలే..'



జాన్ కొయ్యబారిపోయాడు. మొసలి ఏమనుకుంటోందో స్టీవ్‌కు చెప్పబోయాడు - 'స్టీవ్ మనం ఇక్కడున్నట్టు మొసలికి తెలిసిపోయింది' అని. కానీ స్టీవ్ వినిపించుకుంటేనా!

'ష్, నిశ్శబ్దంగా ఉండమన్నానా, అదాటున వెళ్లి పడతాను, చూడు



తమాషా' అంటూ జాన్ వారిస్తున్నా వినకుండా వెళ్లి మొసలిమీద పడ్డాడు. మొసలికూడా అంతే ఫోర్సుతో స్టీవ్‌మీద పడింది. జాన్ కాలికి బుద్ధి చెప్పాడు. పరిగెడుతూండగానే అతనికి మొసలి త్రేన్చిన శబ్దం వినబడింది.

**"చూశారుగా, ఇలాటి అనుభవాలు కూడా ఉన్నాయి. ప్రతివాళ్లు డాక్టరుగారు కావాలని అడిగేవాళ్లే. ఇంత ప్రజాసేవ చేయాలంటే కుటుంబసభ్యులు సహకరించాలి. పాపం అందరూ సహకరిస్తూనే ఉన్నారు... అందరూ అంటే అందరూ కాదనుకోండి.. నేను చెప్పడం ఎందుకు? మీరే చూద్దురుగాని..."**

పారిస్ ట్రిప్ నుండి జాన్ తిరిగివచ్చాడు. ఎయిర్‌పోర్టు నుండి కార్లో వచ్చి ఇంటిగేటు ముందు కారాపి హారన్ కొట్టాడు. గేటు దగ్గర చాలామంది జబ్బుపడ్డ మనుషులు, జబ్బుపడ్డ పెంపుడు జంతువులను తీసుకువచ్చిన మనుషులు కాచుకుని కూచున్నారు. కారు హారన్ విని లక్కీ బయటకు చూసింది. "ఎవరూ?" అంది.

"నేను జాన్‌ని. లక్కీ, గేటు తియ్యి." అన్నాడు జాన్.

"గేటు తాళం చెవి డూప్లికేటు నీ దగ్గర ఉంటుందిగా. నువ్వే గేటు తెరుచుకుని రావచ్చు. నేనెందుకు తీయడం?" అంది లక్కీ.

"ఎక్కడో పారేసుకున్నాను. తలుపు తియ్యి. నీకు అందకపోతే ఇంట్లోకి వెళ్లి లీసానో ఎవర్నో పిలుచుకురా."

"డాక్టర్, ఎవర్నీ పిలవను కానీ నువ్వే కాస్సేపు బతిమాలు. సాధారణంగా కుక్కలు బయటవుండిపోయి లోపలికి రానివ్వమని బతిమాలుతూంటాయి. మనుష్యులు హాయిగా తలుపులు బిడాయించుకుని కూచుని ఛీ, పో అంటూంటారు. ఇన్నాళ్లకు మన పాత్రలు

రివర్సయ్యాయి."

"చాల్లే బడాయి. నువ్వు తెరవకపోతే నేనే కారుతో గేటు బద్దలుకొట్టుకు రావాల్సివుంటుంది. తర్వాత వారంరోజులపాటు నువ్వు తిండిలేక మాడాల్సి వుంటుంది."

"వద్దులే, అంతపనీ చేయగలవ్." అంటూ లక్కీ గేటు తీసింది. ఇంట్లోకి వస్తూ జాన్ "ఎవరొచ్చారో చెప్పుకోండి చూద్దాం" అంటూ ఓ కేక పెట్టాడు.

లోపలినుండి లీసా వచ్చి కౌగలించుకుంది. జాన్ "నీకోసం పారిస్ నుండి ఓ బహుమతి తెచ్చాను చూడు" అంటూ ఓ సెంటుబాటిల్ ఇచ్చాడు.

"థాంక్యూ" అంటూ తీసుకుని 'ఇవన్నీ కాదు కానీ, అసలైన బహుమతి ఏమిటో తెలుసా? ఆ పేషెంట్లు ఇంటిని ముట్టడించకుండా చూడడం. నీ పాప్యులారిటీ కాదు కానీ వీళ్ళందరినీ భరించలేక ఛస్తున్నాం." అని ఫిర్యాదు చేసింది లీసా.

"అవును, మీకు ఇబ్బందేలే, దాని గురించి ఏదైనా చేస్తాను. కంగారుపడకు." అని జాన్ ఊరడిస్తుండగానే అతని చిన్నకూతురు మాయా "నాన్నా" అంటూ పరిగెట్టుకు వచ్చింది.



"హేయ్, మాయా, హౌ ఆర్యూ, నీకు మెక్సికో నుండి ఓ ప్రెజెంటు తెచ్చాను." అన్నాడు తండ్రి ఆప్యాయంగా ఆమెను హత్తుకుంటూ.

"అలాగా, అదేమిటో చూపించవా?" అంది మాయా ఉబలాటపడుతూ.

"ఉండుండు." అని ఓ బ్యాగులోంచి అట్టపెట్టె తీసి మాయా చేతిలో పెట్టాడు జాన్. ఏమిటయివుంటుందాని పెట్టె ఊపి చూసింది మాయా. "చచ్చానురోయ్ బాబూ, భూకంపం, భూకంపం" అన్న కేకలు వినబడ్డాయి.

ఆ కేకల అర్థం తెలిసిన జాన్ "మాయా, అలా ఊపకూడదమ్మా, అదే నేనైతే జాగ్రత్తగా తెరిచి చూస్తాను తెలుసా" అన్నాడు.

తండ్రిమాట వినే బుద్ధిమంతురాల్లా మాయా జాగ్రత్తగా పెట్టె తెరిచి చూసింది. లోపల చూస్తే ఓ ఊసరవెల్లి!

ఊసరవెల్లి చూస్తూనే మాయా గంతులేసింది. "థాంక్యూ ఫర్ ది గిఫ్ట్ డాడ్! ఊసరవెల్లి భలే క్యూట్‌గా ఉంది కదూ. మెక్సికన్ భాషలో ఏదో అంటోంది చూశావా! నా గురించి ఏమనుకుంటోందో కనుక్కోవా?"

"ఊసరవెల్లికి ఓ ప్రత్యేకలక్షణం ఉంది తెలుసా? పరిసరాల బట్టి రంగులు మార్చుకోగలదు. ఇప్పుడా సోఫామీద పెట్టు. సోఫా కలర్‌లోకి మారిపోతుంది. చూస్తుండు."



మాయా సోఫా మీద ఊసరవెల్లిని పెట్టింది. ఊసరవెల్లి మహా గర్వంగా "చూశారా, నేనిప్పుడు కనబడుతున్నాను కదూ. సోఫా రంగులోకి కలిసిపోతాను. కనబడకుండా పోతాను. ది ఇన్‌విజిబుల్ కామెలాన్, హె, హె. ఇదిగో, ఇప్పుడు నేను మీకు కనబడటం లేదు కదూ.."

"నీ మొహం, కనబడుతూనే వున్నావ్" అన్నాడు జాన్.

ఇంతలో లీసా "ఇవాళ షెరెజ్ పుట్టినరోజన్న సంగతి నీకు గుర్తుందా?" అంది.

షెరెజ్ వాళ్ళ పెద్దకూతురు. పదహారేళ్ళ వయసు వచ్చింది. మధ్యలో కొంతకాలం షేప్రీకా అని పేరు మార్చుకుంది గానీ ఇటీవల మళ్లీ పాతపేరే నచ్చినట్టుంది. ఆ పేరుతోనే పిలిపించుకుంటోంది.

"గుర్తు లేకపోవడమేం? అవునూ, బర్త్‌డే కేక్ తెప్పించావా?"

"తెప్పిద్దును గానీ, షెరెజ్ ఏమంటోందంటే.."

"నాన్నకు, ఏమంటోంది?"

"తన బర్త్‌డే ఫ్యామిలీతో కలిసి జరుపుకోవాలని లేదంటోంది షెరెజ్. అందుకని.., నిన్నడిగి కేక్ తెప్పిద్దాంలే అని.."

"ఎప్పుడూ మనం అందరం కలిసే పార్టీ చేసుకుంటాం. ఈ కొత్త కథేమిటి?" అడిగాడు జాన్ చికాగ్గా.

ఈ లోపున ఊసరవెల్లి తన విద్య ప్రదర్శించే మార్గాల గురించి వెతుకుతోంది. "ఈ సోఫా కలరు నాకు మ్యాచ్ కావటం లేదు గానీ, మీ ఇంట్లో ఆకుపచ్చ దేమైనా ఉందా?" అని అడిగింది.

జాన్‌కు చిర్రెత్తింది. "ఇదిగో మాయా, దీన్ని ఇక్కణ్నుంచి తీసిపారేయి. తీసుకెళ్లి నీ గదిలో పెట్టుకో"అంటూ హుకుం జారీచేసి భార్యతో "షెరెజ్ సంగతేమిటి? నాకు కాస్త అర్థమయ్యేట్టు చెప్పు" అన్నాడు.

లీసా చిరునవ్వు నవ్వి, "తనకో బాయ్ ఫ్రెండు ఉన్నాట్ట. వాడితో ఇవాళ డేట్ పెట్టుకుందట"

జాన్ ఉలిక్కిపడ్డాడు. "డేటా? డేట్ లేదూ, గాడిదగుడ్డూ లేదు. ఎవడు వాడు?"

"నేనడగలేదు. నువ్వూ అడక్కు. మర్చిపోవద్దు, అది ఇప్పుడు పెద్ద పిల్లయింది. అది గుర్తుపెట్టుకుని మసలుకోవాలి మనం."



తల్లి కున్నంత అవగాహన తండ్రికి లేకపోయింది. కూతురు షికార్లు కొట్టేటంత పెద్దది అయిందన్న సంగతి అతనికి జీర్ణం కావటం లేదు. "డేట్ సంగతి తర్వాత చూద్దాంలే. ముందు బర్త్‌డే బేబీ ఎక్కడుందో చెప్పు."

"షీ ఈజ్ అన్‌రీచబుల్. దాన్ని పట్టుకోవడం అసాధ్యం."

"ఏమయింది? ఎవరైనా ఎత్తుకుపోయారా ఏమిటి కొంపదీసి?"

"ఛ, ఛ అదికాదు. తన గదిలోనే లోపల గడియ వేసుకుని పాటలు వింటోంది. చెవులకు హెడ్‌ఫోన్సు పెట్టుకుంది. మన మాటలు వినబడవు. ఏమైనా మాట్లాడదలచుకుంటే సెల్‌ఫోన్ చేయాలిట."

జాన్ మండిపడ్డాడు. "దానికి లేకపోతే నీకైనా బుద్ధి వుండాలి. ఇంట్లోనే ఉందిట. సెల్ చేసి మాట్లాడాలిట. గాడిదగుడ్డు కదూ, సెల్ చేయకుండా దానిచేత తలుపు ఎలా తెరిపిస్తానో చూద్దువు గాని రా." అంటూ విసవిసా షెరెజ్ గదివైపు అడుగులు వేశాడు.

అతని వెంటనే లక్కీ వెళ్లింది. "డాక్టర్, జాగ్రత్తగా డీల్ చేయి డాక్టర్. అమ్మాయిది పదహారేళ్ల వయసు.. అంటే.. ప్రమాదకరమైన వయసు" అని సలహా ఇచ్చింది.

(సశేషం)

# ప్రేయసి సౌందర్యం రఫీ స్వరంలో తన్మయం



## రఫీ ప్రేమగీతాలు-1

ఏ సినిమా కథలోనైనా అతి ముఖ్యమైన ఘట్టం ప్రియుడు ప్రియురాలిని చూడడం; ఆమె సౌందర్యానికి ముగ్ధుడు కావడం; ఆ లావణ్యాన్ని వర్ణించడం. ఆమె సాన్నిధ్యాన్ని ఆశించడం. ఇదంతా ప్రేమకు పూర్వరంగం. ఈ రంగాన్ని ప్రణయకవిత్వ సిద్ధాంత పరంగా చెప్తే, పూర్వ రాగం. ఈ రాగాలాపన రఫీ కంఠంలో ఎలా పలికింది?

ముందు ఆమెను కల్లో చూశాడు. **'పహలే మిలే థే సప్‌నోమె ఔర్ ఆజ్ సామ్ నే పాయా - హాయ్ కుర్ బాన్ జావూ'** (జిందగీ) అక్కడ మొదలైంది. ఆ తర్వాత ఆమె ఫొటోని చూడగానే ఆమెపై మోహం కలిగింది. అందుకే ఆమె ఛాయా చిత్రాన్ని పట్టుకుని **'తేరీ సూరత్ సే నహీ మిల్ తీ కిసీకీ సూరత్'** (జిద్ది) అని పాడుతూ, అందరి ముఖాలు చూస్తూ, ఎందులోనూ ఆవిడ సౌందర్యం కనిపించక నిరాశ చెందుతూ తిరిగాడు. సరే, ప్రేయసి కనిపించింది. ఎందరో సుందరాంగులను చూసిన అతనికి ఆమెను చూడగానే విస్మయం కలిగింది. **'యూంతో హమ్‌నే లాఖ్ హసీ దేఖీ హై - తుమ్ సా నహి దేఖా'** (తుమ్ సా నహి దేఖా) అని అప్రయత్నంగా స్వరంలోంచి వచ్చేసింది. ఆమె అందం తను చూస్తే ఫర్వాలేదు. కానీ ఇతరులు చూస్తే దిష్టి తగులుతుందని బెంగపడ్డాడు. **'తేరీ ప్యారీ ప్యారీ సూరత్ కో కిసికీ నజర్ నా లగే-చష్మే బద్దూర్'** (ససురాల్) అని హెచ్చరించాడు. ఆవిడ కనుమరుగై పోయింది. కానీ ఆవిడను తొలిసారి చూసిన జ్ఞాపకం వదలిపోలేదు. **'జిందగీ భర్ నహీ భూలేగె వో బర్ సాత్ కీ రాత్-ఏక్ అంజాన్ హసీనా సే ములాకాత్ కీ రాత్'** (బర్సాత్ కీ రాత్ ) అని తలుచుకుంటు విహ్వాలుడై పోయాడు. **'హాయే తబస్సుమ్ తేరా-ధూప్ ఖిల్ గయి రాత్ మే- యా**

ఇస్ రంగ్ బదల్‌తీ దునియా మేఁ
ఇన్‌సాన్‌కే నీయత్ ఠీక్ నహీ
నిక్‌లా న కరో తుమ్ సజ్‌ధజ్‌కర్
ఈమాన్ కే నీయత్ ఠీక్ నహీ ॥ఇస్ రంగ్॥
యే దిల్ హై బడా హీ దీవానా
ఛేడా న కరో ఇస్ పాగల్ కోఁ ॥యే దిల్॥
తుమ్‌సే న షరారత్ కర్ బైటే
నాదాన్ కే నీయత్ ఠీక్ నహీ ॥ఇస్ రంగ్॥
కాంధేసే హటాలో సర్ అప్‌నా
యే ప్యార్ మొహబ్బత్ రహనే దో ॥కాంధేసే॥
కష్తీ కో సమ్హాలో మోజోఁ సే
తూఫాన్ కే నీయత్ ఠీక్ నహీ ॥ఇస్ రంగ్॥
మై కైసే ఖుదా హాఫిజ్ కెహదూఁ
ముఝ్‌తో తొ కిసీ కా యకీన్ నహీ ॥మై కైసే॥
చుప్ జావో హమారీ ఆఁఖో మే
భగ్‌వాన్‌కే నీయత్ ఠీక్ నహీ ॥ఇస్ రంగ్॥

చిత్రం
రాజ్‌కుమార్

రచన
హస్రత్ జైపురి

సంగీతం
శంకర్-జైకిషన్

గానం
రఫీ

అభినయం
షమ్మీకపూర్, సాధనా









**చిత్రం : తుమ్ సా నహి దేఖా రచన: సాహిర్ లుథియాన్వి**
**సంగీతం: ఓ.పి.నయ్యర్ గానం : రఫీ అభినయం: షమ్మికపూర్, అమిత**

యూఁతో హమ్‌నే లాఖ్ హసీ దేఖే హై
తుమ్ సా నహి దేఖా... హో... తుమ్ సా నహి దేఖా... ॥యూఁతో॥
ఉఫ్ యే నజర్ ఉఫ్ యే అదా॥2॥
కౌన్ న అబ్ హోగా ఫిదా
జుల్ఫే హై యా బద్‌లియా
ఆఁఖే హై యా బిజిలియా
జానే కిస్ కిస్‌కి ఆయేగి కజా ॥యూఁతో॥
తుమ్ భి హఁసీ రుత్ భీ హఁసీ
ఆజ్ యే దిల్ బస్ మే నహీ ॥తుమ్॥
రాత్ కే ఖామోష్ హై
ఘుర్ ఛలే మధుహోష్ హై
పియ బిన్ ఆజ్ హమ్ ఛేడే హై నషా ॥యూఁతో॥
తుమ్ న అగర్ బోలోగే సనమ్॥2॥
మర్‌తో నహీ జాయేఁగే హమ్
క్యా పరీ యా హూర్ హో
కిత్‌నే క్యూఁ మగ్‌రూర్ హో
మాన్‌కే తో దేఖో కభీ కిసీ కా కహో ॥యూఁతో॥



**చిత్రం : ఆయీ మిలన్ కీ బేలా రచన : హస్రత్ జైపురి**
**సంగీతం: శంకర్ - జైకిషన్ గానం : రఫీ**
**అభినయం : రాజేంద్రకుమార్, సైరాబాను**

తుమ్ కమ్‌సి న హో నాదా హో నాజుక్ హో బోలీ హో ॥తుమ్॥
సోచ్‌తా హూ మై కే తుమ్సే ప్యార్ నా కరూఁ
మై తుమ్సే ప్యార్ నా కరూఁ ॥తుమ్॥
మద్‌హోష్ అదా యే అల్లడ్‌పన్
బచ్‌పన్ తొ అభీ ఉంచా హి నహీ
యహ్ సాస్ హై క్యా ఔర్ క్యాహై తడప్
ఇస్ సోచ్ మే దిల్ డూబా హి నహీ ॥యహ్॥
తుమ్ కమ్‌సి న హో నాదా హో నాజుక్ హో బోలీ హో
సోచ్‌తా హూ మై కే తుమ్సే ప్యార్ నా కరూఁ మై తుమ్సే ప్యార్ నా కరూఁ
తుమ్ ఆహి భరో ఔర్ షిక్‌వే కరో
యే బాత్ హమే మంజూర్ నహీ
తుమ్ సారే దినో అరె నీంద్ ఉడే
హో రాత్ హమే మంజూర్ నహీ ॥తుమ్ సారే॥ ॥తుమ్॥



బిజిలి గిరీ బర్ సాత్ మే' (నిశాన్)అని పదే పదే తలుచుకుని మురిసిపోయాడు.

తన ప్రేయసిని ఎవరితో పోల్చాలో తెలియలేదు. మైనే పూఛా చాంద్ సే కీ దేఖాహై కహీ-మేరే యార్ సా హసీ -చాంద్ నే కహా చాంద్‌నీ కీ కసమ్ -నహీ, నహీ, నహీ' (అబ్దుల్లా) అంటూ, చందమామ కూడా తన ప్రేయసి లాంటి అందగత్తెని చూడలేదని చెప్పిందని గర్వపడ్డాడు. అంతే కాదు. నీకు ఎవరితోనూ పోలికలు చెప్పలేనని తేల్చేసాడు 'అబ్ క్యా మిసాల్ దూ మై తుమ్హా రీ శబాబ్ కో' (ఆరతి) అంటూ 'జానే బహర్ హుస్న తేరా బేమిసాల్ హై- వల్లా కమాల్ హై తేరా వల్లా కమాల్ హై' (ప్యార్ కియా తో డర్ నా క్యా) అని ఆవిడ సౌందర్యానికి ఉపమానాలే లేవన్నాడు. సరిలేరు నీకెవ్వరూ అనడానికి 'హుస్న వాలే తేరా జవాబ్ నహీ-కోయి తుఝ్‌సే నహీ హజారోమే' (ఘరానా) భగవంతుడు సైతం తన ప్రియురాలిని ఎవరు సృష్టించారో అని ఆశ్చర్యపోతాడని 'ఖుదా భీ ఆస్‌మాసే జబ్ జమీ పర్ దేఖ్ తా హోగా మేరే మెహబూబ్ కో కిస్ నే బనాయా సోచ్ తా హోగా (ధర్తీ) పాటలో సవాలు చేశాడు.

ఆమె అందాన్ని పొగిడితే చాలదు. దాన్ని స్మరించుకోవాలంటే... ? అందుకని చిత్రకారుడైపోయాడు. 'మెహబూబా తేరీ తస్ వీర్ కిస్ తర్హా మై బనావూ' (ఇష్క్ పర్ జోర్ నహీ) అని ఆమెనే ప్రశ్నించాడు. 'జో బాత్ తుఝ మే హై తేరీ తస్ వీర్ మే నహీ- తస్వీర్ మే నహీ' (తాజ్ మహల్) అని వాపోయాడు. తన రక్తంతో ఆమె చిత్రాన్ని గీస్తానన్నాడు 'తస్ వీర్ బనాతా హు తేరీ ఖూనే జిగర్ సే ' (దీవానా)అంటూ!

తన ప్రేయసి సౌందర్యానికి తను చలిస్తే చాలదుట. యావత్ ప్రకృతీ చలించాలిట. ఆమెను మోహించాలిట. అప్పుడు గానీ అతనికి తృప్తి లేదుట. అందుకే 'బహారో ఫూల్ బర్ సావో మేరా మెహబూబ్ ఆయా హై' అని ఆహ్వానించాడు. అంతే కాదు. ప్రకృతి తనతో పాటు సంతోషిస్తుందేమో కానీ ఆమె అలకంరించుకుని వీధిలోకి వెళ్తే, మనుషుల ప్రవర్తనే మారిపోయే ప్రమాదం ఉందన్నాడు- 'ఇన్ సాన్ కీ నీయత్ ఠీక్ నహీ ఇస్ రంగ్ బదల్ తీ దునియామే - నిక్ లా నకరో తుమ్ సజ్ దజ్ కే- ఈమాన్ కి నీయత్ ఠీక్ నహీ' (రాజ్ కుమార్ ) ఆమె సౌందర్యం ఎలాంటిదంటే, అది చూసిన వారి ప్రవర్తన ఎలా అయిపోతుందో చెప్పలేమంటాడు.

ఇంత అందంగా, వైవిధ్య భరితంగా నాయిక సౌందర్యం - రఫీ సుమధుర స్వరాల్లో ఒదిగిపోయింది. ఆ పాడడంలో సందర్భాన్ని బట్టి.

ఇలా వివశత్వం ఉంటుంది.

'తుమ్ మేరే సామ్ నే హో-తేరీ జుల్ఫే హై ఖులీ -తేరా అంచల్ హై

చిత్రం : ససురాల్ రచన : హస్రత్ జైపురి
సంగీతం: శంకర్-జైకిషన్ గానం : రఫీ
అభినయం : రాజేంద్రకుమార్, బి.సరోజాదేవి

తెరి ప్యారీ ప్యారీ సూరత్ కో
కిసీ కి నజర్ నా లగే చష్మే బద్దూర్ ॥తెరి ప్యారీ॥
ముఖ్డే కో చుపాలో ఆచల్ మే
కహి మేరి నజర్ నా లగే చష్మే బద్దూర్ ॥ముఖ్డే॥
యూ న అకేలే ఫిదా కరో
సబ్ కి నజర్ సే దయా కరో ॥యూ న॥
ఫూల్ సే జ్యాదా నాజుక్ హో తుమ్
ప్యార్ సమ్హల్‌కర్ చలా కరో
జుల్ఫోం కో గిజాలో జాలో పర్
మౌసమ్ కి నజర్ నా లగే చష్మే బద్దూర్ ॥తెరి ప్యారీ॥
ఏక్ జలక్ జో పాతా హై
రాహి వాహి రుఖ్ జాతా హై ॥ఏక్॥
దేఖ్ కే తేరా రూప్ సలోనా
జాన్ జీ సర్‌కో ఝుకాతా హై
దేఖా నా కరో తుమ్ ఆయీ న
కహి ఖుద్ కి నజర్ నా లగే చష్మే బద్దూర్ ॥తెరి ప్యారీ॥
దిల్ మే జుబేవో తీర్ హో తుమ్
చాహత్ కి తక్‌దీర్ హో తుమ్ ॥దిల్ మే॥
బోల్ నా హోగా తుమ్‌సే దివానా
ప్యార్ భరీ తస్‌వీర్ హో తుమ్
నిక్‌లా న కరో తుమ్ రాహో పర్
జల్వోంకి నజర్ నా లగే చష్మే బద్దూర్ ॥తెరి ప్యారీ॥



ఢలా- మై భలా హోశ్ మే కైసే రహూ' (సుహాగన్)

చెప్పలేని అల్లరి ఉంటుంది. 'యే చాంద్ సా రోశన్ చెహరా' (కశ్మీర్ కీ కలీ)' లో లాగ..!

బుజ్జగించే గారాబం ఉంటుంది.

**'తుమ్ కమ్ సిన్ హో- నాదాన్ హో- నా జుక్ హో భోలీహో'** (ఆయీ మిలన్ కీ బేలా) లో లాగ!!

ఆమె తోనే అణువణువూ లయమైపోయిన తాదాత్మ్యం ఉంటుంది.

**'తేరీ ఆంఖోం కే సివా దునియామే- రఖా క్యాహై**

**యే ఉఠే సుబహ్ చలే - యే ఝుకే శామ్ ఢలే - మేరా జీనా మేరా మర్ నా ఇన్హి పల్కోంకే తలే'** (చిరాగ్) అన్నట్లు.

ఆ సౌందర్యాన్ని చూస్తూకూడా నమ్మలేని విస్మయం ఉంటుంది.

**'యే ఆంఖే ఉఫ్ యుమా - యే సూరత్ ఉఫ్ యూమా'** (జబ్ ప్యార్ కిసీ సే హోతాహై)

ఆ సౌందర్యంలోనే ఓదార్పు పొందాలన్న తపన ధ్వనిస్తుంది.

**'తుమ్హా రీ జుల్ఫ్ కీ సాయే మే శామ్ కర్లూంగా**

**సఫర్ ఏక్ ఉమ్ర్ కా పల్ మే తమామ్ కర్ లూంగా'** (నౌనిహాల్)

ప్రేయసి శారీరక, ఆత్మ సౌందర్యాల పట్ల గౌరవం వెల్లువలవుతుంది.

**'ఏక్ తేరా సుందర్ ముఖ్డా- ఏక్ తేరా ప్యార్ సే భరా దిల్ - మిల్ నా ముశ్కిల్ '** (భాయి భాయి)

ఇన్ని భావాలు, అనుభూతులు అద్భుతంగా పలికే స్వరం రఫీది. మరో రహస్యముంది, రఫీ సౌందర్య వర్ణనలో ఆపాట వినే ప్రతి ఆడపిల్లా అది తన గురించేనన్న భావన కలిగేంత సాన్నిహిత్యం తన గొంతులో పలికించగలడు.

**'ఆప్ కీ హసీన్ రుఖ్ పే ఆజ్ నయా నూర్ హై**

**మేరా దిల్ మచల్ గయా తో మేరా క్యా కుసూర్ హై..'** (బహారే ఫిర్ భీ ఆయేగి) వింటూంటే, అతను 'ఝుకీ ఝుకీ పల్ కే' అంటే ఆ, శ్రోతల కనురెప్పలు వాలిపోతే అది వారి తప్పుకాదు. ఈ కంఠంలోని దగ్గరి తనం అది.

**'చౌదవీకా చాంద్ హో యా ఆఫ్ తాబ్ హో-**

**'జోభీ హో తుమ్ ఖుదా కీ కసమ్, లాజవాబ్ హో'** (చౌదవీకా చాంద్) ఈ పాట తన గురించే పాడుతున్నాడనీ, పాడాలనీ అనుకోని స్త్రీ ఉండదు. పాడే విధానంలో, ఆ స్వరంలో పలికే అనుభూతిలో అంత గొప్ప మార్దవాన్నీ ,సామీప్యాన్ని ధ్వనింపజేయగలడు. 'శర్మానా' అన్నపదం రొమాంటిక్ పాటల్లో రఫీ పలుకుతుంటే, వింటున్న యువతులు తమకు తెలీకుండానే సిగ్గుపడతారు. ఉదా: **పావ్ చూలేనేదో ఫూలోంకో ఇనాయత్ హోగీ** (తాజ్‌మహల్)లో **'శర్మ్ గైరోంసే కియా కర్ తేహై అప్‌నోంసే నహీ, శర్మ హమ్ సే భీ కరోగీతో యుసీబత్ హోగీ'** అని రఫీ పాడే చరణం వింటే అమ్మాయిలు చిరునవ్వుల సిగ్గులు ఒలక బోయాల్సిందే.

మళ్ళీ మన ప్రణయ కవిత్వపు సిద్ధాంతాలలోకొస్తే ప్రేయసి సౌందర్యాన్ని ప్రియుడు ఎన్ని రకాలుగా వర్ణించగలడో అన్ని రకాలు గానూ వర్ణించాడు. ముఖ్యంగా కనులు, కేశాలు అతన్ని కట్టిపడేసాయి.

ఆమె కేశ సౌందర్యం ఎంత గొప్పదంటే, అందులో బందిని కావాలని ఉందంటాడు. **'తేరీ జుల్ఫోంసే జుదాయి తొ నహీ మాంగీ థీ ఖైద్ మాంగీ థీ రిహాయి తో నహీ మాంగీ థీ'** (అస్లీ నక్లీ) మరోసారి ఇలా అంటాడు. నల్లటి మబ్బులా కప్పేసిన జుత్తును తొలగించు, కాస్తంత వెలుతురు వస్తుంది. **'జుల్ఫోంకో హటాదో చెహరే సే - థోడాసా ఉజాలా హోనేదో - సూరజ్ కో జరా శరమిందాకర్ - మూరాత్ కా కాలా హోనేదో'** (సావన్‌కీ ఘటా) ఆమె ముఖం లోని వెలుగు సూర్యుణ్ణి సిగ్గుపడేలా చేస్తే, ఆమె నల్లటి శిరోజాలు రాత్రి ముఖాన్ని నల్లగా మాడ్చేస్తాయిట అవమానంతో. తనలో తను నవ్వుకుంటూ పాడే ఈ పాటల్లాంటివి రఫీ నాటకీయ గానానికి గొప్ప నిదర్శనాలు.

**'చూ లేనే దో నాజుక్ హోటోంకో - కుచ్ ఔర్ నహీ హై జామ్ హై యే'** (కాజల్) కూడా ఇంత ప్రభావాన్నీ శ్రోతపై చూపేదే.

ప్రేయసి సౌందర్యం ఒక ఎత్తు. అది తనపై చూపే ప్రభావం మరో ఎత్తు.

**'మైతో తేరే హసీన్ ఖయాలోమె ఖోగయా దునియా యే కహ రహీ హైకి దీవానా హోగయా'**

అని తను ఆమె జ్ఞాపకాల సౌందర్యంతో పిచ్చివాణ్ణయి పోయానంటాడు.

**'దిల్ బేకరార్ సా హై - హమ్ కో ఖుమార్ సా హై - జబ్ సే తుమ్హే దేఖా సనమ్ '** (ఇశారా) ఆమెను చూసినప్పట్నుంచి మనసు వ్యాకుల పడిపోతోంది, వివశమవుతోందట.

ఆమె తనను చూస్తే, భూమ్యాకాశాలు స్తంభించిపోయాయిట.

**'తుమ్ నే ముఝే దేఖా - హోకర్ మెహరుబా రుక్ గయా యే జమీ -థమ్ గయా ఆసమా - జానే మన్ జానే జా '** (తీస్రీ మంజిల్). ఆమెను తను చూసి, ఆమె తనను చూస్తేనే ఇలా అయిపోయాడు. ఇక తన ప్రేమను ప్రకటించుకునేటప్పుడు ఎలా అయిపోయాడు? ఆ భావప్రకటన రఫీ స్వరంలో ఎలా పలికింది? వచ్చే సంచికలో చూద్దాం.

**- మృణాళిని**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



చిత్రం
ఆనంద్

గీత రచయిత
గుల్జార్

సంగీతం
సలిల్ చౌధురి

గానం
లతా మంగేష్కర్

అభినయం
సుమిత్రా సన్యాల్

రాజేశ్‌ఖన్నా పాత్రకు, నటనకు విశేష ప్రాచుర్యం, ప్రఖ్యాతి లభించిన 'ఆనంద్' చిత్రంలో అమితాబ్‌బచ్చన్‌కు కీలకమైనపాత్ర ఉంది. అమితాబ్ నటనా కౌశాలాన్ని అందరి దృష్టికీ తీసుకువచ్చిన చిత్రం కూడా ఇదే. ఈ సినిమాలో ప్రణయానికి చోటులేకపోయినా, అమితాబ్‌ను ప్రేమించిన సుమిత్రా సన్యాల్ అతని కోసం ఎదురు చూస్తూ పాడే ఈ పాట చాలా హిట్టయింది. అసలు సలిల్‌చౌధురి సంగీతం ఈ సినిమాలో ఆద్యంతం హిట్టే. ఎక్కువ ప్రజాదరణ పొందినవి ముఖేష్ పాడిన 'మై నె తేరే లియే హీ... ', 'కహీఁ దూర్ జబ్ దిన్ ఢల్ జాయే', 'మన్నాడే పాడిన ' జిందగీ కై సీ హై పహే లీ హాయె' ఈ నాటికీ హిట్ పాటలే. వాటి స్థాయిలో కాకున్నా, సలిల్ సంగీతంలోని మాధుర్యం, లతా కంఠంలోని ఆర్ద్రత లతా పాడిన పాటల్లో మేటి పాటగా నిలబెడతాయి.

సలిల్ చౌధురి స్వరరచలోని వైశిష్ట్యం. అతను తీసుకువచ్చే వేరియేషన్‌లో ఉంటుంది. ఒకే బాణీని అనేక రకాలుగా సంయోజనం చేయడంలో అతను గొప్ప నేర్పరి. అందులోనూ తీగెలాంటి లతా స్వరం నుంచి ఆ వైవిధ్యం జాలువారినపుడు అది గొప్ప అనుభూతిని కలిగిస్తుంది. ఈపాటలో 'తేరే బినా మేరా కహీ జియా లాగేనా' అంటూ 'లాగేనా' ని లతా ఎన్ని రకాలుగా ఎలా పాడిందో ఓసారి గుర్తు తెచ్చుకుంటే ఒకసారి ఆ మాధుర్యంలో మనం తలమునకలౌతాం.

ఈగీత రచయిత గుల్జార్. అతి సున్నితమైన భావాలను అంతకంటే సరళమైన పదాల్లో వ్యక్తం చేసే కవి. అలంకారాలకంటే, నిరాడంబరంగా భావాలను వ్యక్త పరిచే శైలిని అనుసరించే చక్కని గీత రచయిత. ఈ సన్నివేశాల్లో ప్రేయసి (సుమిత్రా సన్యాల్) ప్రియుడి (అమితాబ్) కోసం ఎదురు చూస్తోంది. అతని సామీప్యాన్ని కోరుకుంటున్న మనసు, అతనెంతకీ రాకపోవడంతో వ్యాకులం చెందింది. ఆ వ్యాకులతను, తపనను నిరీక్షణను అద్భుతంగా అక్షరబద్ధం చేసిన గీతమిది.

ప: నా జియా లాగేనా
తేరే బినా మేరా కహీ జియా లాగేనా ॥నా॥
చ: జీనా భూలే థే కహా యాద్ నహీ
తుఝ్‌కో పాయా హై జహా - సాథ్ ఫిర్ ఆయే నహీ ॥జీనా॥
జిందగీ ...జిందగీ తేరే సివా హోయె భాయేనా... ॥నా॥
చ: నా జియా లాగేనా... నా - జియా లాగేనా...
పియా తేరీ బావరీసే రహో జాయేనా ... ॥నా॥
చ: తుమ్ అగర్ జావో కభీ జావో కహీ
వక్త్ సే కెహనా జరా - వో ఠహర్ జాయే వహీ ॥తుమ్॥
వో ఘడీ... వోఘడీ వహీ రహీ నా జాయేనా ॥నా॥

జియా లాగేనా అంటే మనసు నిలవడం లేదు. తేరే బినా అంటే నీవు లేక.

పల్లవి : లేదు నా మనసు నిలవడం లేదు.
నీవు లేక ఎక్కడా నా మనసు నిలవడం లేదు.

చరణం : జీనా -జీవించడం. భూలే - మరిచిపోవడం. పాయా హై -పొందడం. తేరే సివా- నీవు లేక భాయేనా -మసస్కరించడంలేదు.



జీవించడం ఎక్కడ మరిచానో గుర్తులేదు.
నిన్ను పొందిన చోటే- మళ్ళీ అది నాతో వచ్చింది.
నీవు లేని ఈ జీవితం మనస్కరించడంలేదు

ఇక్కడ మళ్ళీ పల్లవిలోని మొదటి పాదం 'నా' జియా లాగేనా' పునరుక్తమవుతుంది. అయితే రెండో పాదంలో సాహిత్యం మారుతుంది.

పియా- అంటే ప్రియా, బావరే అంటే ప్రియురాలు, రహా జాయేనా -ఉండలేకపోవడం, మనలేకపోవడం.

లేదు... మనసు నిలవడం లేదు.

ప్రియా... నీ ప్రియురాలు నిలవలేకపోతోంది.

**చరణం :** వక్త్ అంటే - కాలం, ఠహర్ అంటే నిలిచిపోవడం, ఘడీ అంటే సమయం /క్షణం.

నువ్వు ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్ళాల్సివస్తే అక్కడ ఆగిపొమ్మని కాలానికి చెప్పవూ

ఆ క్షణం అక్కడే నిలిచి పోవాలి ముందుకు వెళ్ళకూడదు.

ఈపాటలో అర్థసౌందర్యంతోపాటు గొప్ప శబ్ద చమత్కారం





ఉంది. 'నా' అనే వ్యతిరేక పదం పదేపదే పునరావృతం చేయడం ద్వారా అర్థ, శబ్ద సౌందర్యాలు రెండింటినీ కవి సాధించాడు. నా, లాగేనా, జాయేనా, భాయేనా, యాద్ నహీ, కెహనా..... ఇలాంటి ప్రయోగాలు పాటకు ఒక వినూత్న సౌందర్యాన్ని సారళ్యాన్ని కల్పించాయి. అతను లేని ప్రపంచం, జీవితం అర్థరహితంగా ఉన్నదన్న ఆమె తపన, వేదన ఆ వ్యతిరేక పదాలవల్ల అద్భుతంగా ఆవిష్కృతమైంది. అసలు 'నా' తో పాట ఆరంభం కావడమే గుల్జార్ ఉక్తి వైచిత్రికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

సలిల్ చౌధురి, లతా మంగేష్కర్ కాంబినేషన్‌లో వచ్చిన అపురూపమైన పాటల్లో ఇది ఒకటి. మధుమతి, మాయా, రజనీగంధ,ఛోటీ సీ బాత్ సినిమాల్లోని లతా పాటలలో మేటికీ తీసిపోని పాట... లతా కంఠంలోని మార్దవం, విరహం విని తీరాల్సిందే. మాటల్లో చెప్పలేనిది.

**- మృణాళిని**

(గతసంచిక తరువాయి)

ఈ పుస్తకంలో రాంభట్ల నృసింహాశర్మగారు కనబరచిన వాక్చమత్కృతికి కొన్ని ఉదాహరణలు-



**120 పేజీలు,**
**వెల రూ॥ 50/-**
**ప్రతులకు**
**రచయిత**
**ఫోన్:0891-2717164/ 2715434/ 2560280**

* బయట అంబులెన్సూ.. యింట్లో కండోలెన్సూ..
* యీవిడగారే ఓ పేద్ద గంగాళంలాటి అనవసర అతిథిపాత్ర!
* ఇలా గడపలోనే గడగడలాడించేస్తావనుకోలేదు
* 'మూట కొంచెం, ఘాటు ఘనం' అన్నట్టు ఒకటే వాసన. అంతకన్నా హుసేన్‌సాగర్‌లో వెయ్యిసార్లు సచేలస్నానం చెయ్యొచ్చు
* పేరుకే సుకుమారి..పేట్రేగితే మహమ్మారి
* (భార్యతో) మావాళ్లు 'చంద్రశేఖరం' అని ఆ శివుడిపేరు పెట్టి శ్రీరస్తు అన్నారు. నువ్విలా శివాలెత్తి పోతున్నావ్.
* 'మండబెట్టేముందు ఎండబెట్టు' అన్నాడు బాణసంచా విలాస కావ్యకర్త
* నువ్వీ బాణసంచాముందు తుంపర్లు తుళ్లుతూ మాట్లాడితే పటాస్ అంతా మటాష్ అయిపోతుంది
* 'నోటితో చెప్తే పోయేదానికి నోటీసుబోర్డు దాకా ఎందుకు?'

ఇక పాత్రోచిత సంభాషణలకు ఉదాహరణలు కోకొల్లలు.

ఓ టీచరు సంగతే తీసుకుంటే -

'అది కాదు మాస్టారూ' అని చెప్పబోతే 'మా 'స్టారు' బావుంటే, నీలాంటి స్టూడెంట్లెందుకు తగలడతారూ!' అని విసుక్కుంటాడు. 'చెయ్యిచేసుకున్నారా?' అని అడిగితే 'ఊహూ, కళ్లు చేసుకున్నాను' అంటాడు. 'సుద్దముక్కలో రాయిపిక్కలా అడ్డుతగలకు' అని విసుక్కుంటాడు, 'అక్కడే మీరు డస్టర్ దెబ్బతిన్నారు' అని ఎదుటివాణ్ని ఎద్దేవా చేస్తాడు. 'బోధగురువులా ప్రవర్తించు, బాధగురువులా కాదు' అని హితవు చెప్తాడు.




పాత్రల మధ్య సంభాషణలు సాగిన తీరు -

* 'పీతల నాలిక పిడచకట్టుకు పోయేలా ఆ అరుపేమిటి?'
'అరుపుకాదు బాబూ! అలుపు..అలుపు..ఈ కొబ్బరికి పీచులా, ఆ నీటికి నాచులా మిమ్మల్నే అంటిపెట్టుకున్నందుకు ఫలితం ఇదా! అని బాధతో కలిగిన అలుపు బాబూ..'
* ఇంటాయన : (చందాకు వచ్చినవాడితో) మధ్యలో నీ సొద ఏమిటయ్యా
చందావాడు : సొద కాదు సార్ - చవితి చందా!
ఇంటాయన : ఇంద రూపాయ్ - ఏదీ డొక్కు?
చందావాడు : డొక్కురోజులు పోయాయి - ఇప్పుడంతా చెక్కులే!
* 'వెలిగించింది కొవ్వొత్తయితే అంత మెరుపు ఇంత అరుపు ఏమిటి?
'ఆ క్షణాన నీ చేతిలో ఉన్నది కొవ్వొత్తికాదు, బాంబు. మెరుపు దానిది, అరుపు నీది..'
* 'రెడీగా ఉన్నారన్నమాట'
'ఓ 'ఆల్-వేస్ రెడీ'.. అనగా పారిపోవడానికి అన్ని మార్గాలూ సిద్ధంగా వున్నాయి'
* 'మందుగుండు కొనడానికి వెళ్లారా? అక్కడ పేలుళ్లేవన్నా జరిగాయా'
'ఆ పేలాయి, నా రెండు దవడలూ..'
* ఇంటావిడ(తమ్ముడితో) : ఈయనగారి గీకుడుబేరానికి ఎవడో అంటగట్టిన నాన్సుడు బాణసంచా అది!
తమ్ముడు : గీచిగీచి బేరమాడ్డంలో బావ గొప్ప 'గీకువీరుడ'న్నమాట!
* పనిమనిషి : నాను 'అయిస్పర్యారాయిషకి అప్పగార్లా లేనేటి?
ఇంటావిడ :'ఆ వున్నావ్ లే ఆ రాయికి రప్పలాగ!'

జంధ్యాలకు కితకితల అంకితమాలగా అమరిన ఈ పుస్తకం అట్ట అందంగా ఉండివుంటే ఎంతో బాగుండేది!

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# ఆ ఇంటర్వ్యూ ద్వారా శారదాదేవి ఒక శుభ శకునం సూచించిందేమో !?

- జాతీయ అవార్డు గ్రహీత

**సుద్దాల అశోక్‌తేజ**

పదహారు మే 2004 'హాసం'లో నా ఇంటర్వ్యూ ఎడిటర్ రాజాగారు అచ్చొత్తించారు - రాజాగారు నాకు పెద్దన్న లాంటివాడు. అనేక సమయాలలో నాకు ఆయన తన అమూల్యమైన సలహాలు ఇచ్చారు.

ఠాగూర్ సినిమాకు నేను వ్రాసిన క్లయిమాక్స్ సాంగ్ మెగాస్టార్ చిరంజీవి గారికి నేను వినిపించగానే ఆయన అన్నమాటనే ఆ వ్యాసానికి హెడ్డింగ్‌గా రాజాగారు పెట్టారు. ఇంత పెద్ద హెడ్డింగ్ అరుదుగా కనపడుతుంది. సాహిత్యం-సంగీతంలో సమరసజ్ఞత కలిగిన రాజాగారిలోని సరస్వతి ఆ ఇంటర్వ్యూ ద్వారా ఆ పాటకు రాబోతున్న జాతీయ స్థాయిని సూచామాత్రంగా అలా పలికించిందా అనిపించింది - నాకు జాతీయ ఉత్తమ సినీగేయ అవార్డు ప్రకటించిన విషయం తెలియగానే !!

అంతేకాదు ఆ వ్యాసం మధ్యలో ఆ పాటలోని మొదటి చరణం మొత్తం ప్రచురించారు. ఆ శారదా దేవి తన అక్షరాలలోంచి ఒక శుభ శకునం ద్వారా సూచించినా చిరుజోస్యం పలికించినా గ్రహించలేరు కదా - ఎవరైనా - నేనూ అంతే -

నా జీవితం అద్భుత మలుపులు తిరిగిన ప్రాంతం మెట్‌పల్లి కరీంనగర్ జిల్లా. నేను గతంలో పనిచేసిన బండలందాపురంలో నా స్నేహితుల ఇంట్లో భోంచేస్తుండగా ఆంధ్రజ్యోతి విలేకరి ఓం ప్రకాష్‌గారు ఫోన్ చేసి "మీకు జాతీయ అవార్డు వచ్చింది ఠాగూర్ గీతానికి" అనగానే

ఒకక్షణం-మస్తిష్కంలో నిశ్శబ్దం-
మరుక్షణం-మహాకవి శ్రీ శ్రీ మూర్తి మనస్సులో
సాక్షాత్కారం

ఆ పిదప వేటూరి గారి పటం మెదిలింది.
ఈ మహనీయుల - సరస్వతీపుత్రుల -
సాహితీ సముద్రుల సరసన 'నేనా'

ఆనందం - దుఃఖం - ఉద్వేగం
ఎదురుచూపు ఫలించిన ఆనందపు నిట్టూర్పులు -
ఆ తర్వాత రాజా గారి దగ్గర్నుండి ఫోన్ రాగానే
"మనకి అవార్డు వచ్చింది సార్" అన్నాన్నేను.
"మీరు మన అంటుంటే 'హాసం'కి అవార్డు వచ్చినంత ఆనందంగా ఉంది" అన్నారు రాజాగారు.
"ఆ అర్థం కూడా అన్వయిస్తుంది సార్... ఆ పాటకు సంబంధించి ఫస్ట్ ఇంటర్వ్యూ వేసింది మీరే కదా" అన్నాను.
ఆ పిదప ఫోన్ల వరద ప్రారంభం -

యావద్దేశం 58 వ స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకుంటున్న సందర్భాన తెలుగు పాటకు ఇస్తున్న గౌరవ పురస్కారంగా కూడా లభించిందీ అవార్డు అనిపించింది.

నేను రాశాక ఆ పాటను అంత మహత్తరంగా
మాంత్రోజ్వలంగా మలచిన మణిశర్మ గారికి
అనితర సాధ్యంగా ఆలపించిన బాలు గారికి
మహోన్నతంగా నటించిన చిరంజీవి గారికి
దర్శకుడు వినాయక్, నిర్మాత మధు గారికి
మనసు నమస్సులు తెలుపుతూ-

నా ఈ నేషనల్ అవార్డు తెలుగు సినీ రచయితలకు,
తెలుగు ప్రజలకు చెందుతుందని
వినమ్రంగా వినయంగా

మీ
అశోక్‌తేజ


ఆ చరణాలను
నేను చదువుతుంటే
'ఇటు చూడు అశోక్'
అంటూ
చిరంజీవి గారు
రోమాంచితమైన
తన చేతిని
చూపించారు
- సుద్దాల అశోక్‌తేజ

16-31 మే 2004

రచన: వేటూరి సుందరరామమూర్తి (1) గానం: హరిహరన్, చిత్ర

ప: యమునా తీరం సంధ్యారాగం
యమునా తీరం సంధ్యారాగం
నిజమైనాయి కలలు నీలా రెండు కనులలో
నిలువగనే
తేనెల్లో పూదారి ఎన్నెల్లో గోదారి మెరుపులతో ॥యమునా॥
చ: ప్రాప్తమనుకో ఈ క్షణమే బ్రతుకులాగా
పండెననుకో ఈ బ్రతుకే మనసుతీరా
శిథిలంగా విధినైనా చేసేదే ప్రేమ
హృదయంగా తననైనా మలిచేదే ప్రేమ
మరువకుమా
ఆనందమానందమానందమాయేటి మనసు కథ
ఆనందమానందమానందమాయేటి మనసు కథ
యమునా తీరం సంధ్యారాగం
చ: ఒక్క చిరునవ్వే పిలుపు విధికి సైతం
చిన్న నిట్టూర్పే గెలుపు మనకు సైతం
శిశిరంలో చలిమంటై రగిలేదే ప్రేమ
చిగురించే ఋతువల్లే విరబూసే ప్రేమ
మరువకుమా
ఆనందమానందమానందమాయేటి మధురకథ
మరువకుమా
ఆనందమానందమానందమాయేటి మధురకథ
యమునా తీరం సంధ్యారాగం
యమునా తీరం సంధ్యారాగం



రచన: వేటూరి సుందరరామమూర్తి (2) గానం : శ్రేయగోషాల్

అ: వచ్చే వచ్చే నల్ల మబ్బుల్లారా
గిచ్చే గిచ్చే పిల్ల గాలుల్లారా ॥వచ్చే వచ్చే॥
కళ్లలోన పొంగుతున్న బాధలెన్నో మాకున్నాయి
గుండెలోన దాచుకున్న గాధలెన్నో మాకున్నాయి
తీరుస్తారా బాధ తీరుస్తారా
గాలివాన లాలి పాడేస్తారా
పిల్లపాపలా వాన బుల్లిపడవలా వాన
చదువు బాధలే తీర్చి సెలవలిచ్చిన వాన
గాలివాన కబాడ్డీ
వేడి వేడి పకోడి
ఈడు జోడు ఢీ ఢీ ఢీ ఢీ
తోడుండాలి ఓ లేడి
ఇంద్ర ధనస్సులో తళుకుమనే ఎన్నిరంగులో
ఇంతి సొగసులే తడిసినవి నీటి కొంగులో
శ్రావణమాసాలా జలతరంగం
జీవన రాగాలకిది ఓ మృదంగం
కళ్లలోన పొంగుతున్న బాధలెన్నో మాకున్నాయి
గుండెలోన దాచుకున్న గాధలెన్నో మాకున్నాయి ॥వచ్చే వచ్చే॥
చ: కోరివచ్చినా ఈ వాన
గోరు వెచ్చనై నాలోన
ముగ్గులా సిగ్గు ముసిరేస్తే
ముద్దులాటిదే మురిపాల
మెరిసే మెరిసే అందాలు
తడిసే తడిసే పరువాలు
గాలివానల పందిళ్లు
కౌగిలింతల పెళ్లిళ్లు
నెమలి ఈకలో ఉలికిపడే ఎవరికన్నులో
చినుకు చాటునా చిటికెలతో ఎదురుచూపులో
నల్లని మేఘాలా మెరుపులందం
తీరని దాహాలా వలపు పందెం
కళ్లలోన పొంగుతున్న బాధలెన్నో మాకున్నాయి
గుండెలోన దాచుకున్న గాధలెన్నో మాకున్నాయి
తీరుస్తారా బాధ తీరుస్తారా
గాలివాన లాలి పాడేస్తారా ॥వచ్చే వచ్చే॥

రచన: వేటూరి సుందరరామమూర్తి (3) గానం: శ్రేయగోషాల్, కె.ఎం. రాధాకృష్ణన్

ప: నువ్వేనా నా నువ్వేనా
నువ్వేనా నాకు నువ్వేనా
సూర్యుడల్లే సూదిగుచ్చి సుప్రభాతమేనా
మాటలాడే చూపులన్నీ మౌనరాగమేనా
చేరువైనా దూరమైనా
ఆనందమేనా
చేరువైనా దూరమైనా
ఆనందమేనా
ఆనందమేనా... ఆనందమేనా ॥నువ్వేనా॥
చ: మేఘమల్లే సాగివచ్చి
దాహమేదో పెంచుతావు
నీరు గుండెలోన దాచి
మెరిసి మాయమౌతావు
కలలేనా కన్నీరేనా
తేనెటీగ లాగ కుట్టి
తీపిమంట రేపుతావు
పువ్వులాంటి గుండెలోన
దారమల్లే దాగుతావు
నేనేనా నీ రూపేనా
చేరువైనా దూరమైనా
ఆనందమేనా
చేరువైనా దూరమైనా
ఆనందమేనా
ఆనందమేనా... ఆనందమేనా ॥నువ్వేనా॥
చ: కోయిలల్లే వచ్చి ఏదో
కొత్తపాట నేర్పుతావు
కొమ్మగొంతులోన గుండె
కొట్టుకుంటే నవ్వుతావు
ఏ రాగం ఇది ఏ తాళం
మసక ఎన్నెలల్లే నీవు
ఇసక తిన్నె చేరుతావు
గుసగుసాల కౌగిలింత
గుసగుసల్లె మారుతావు ప్రేమంటే నీ ప్రేమేనా
చేరువైనా దూరమైనా ఆనందమేనా
చేరువైనా దూరమైనా ఆనందమేనా
ఆనందమేనా... ఆనందమేనా ॥నువ్వేనా॥

రచన: వేటూరి సుందరరామమూర్తి (4) గానం : లక్కీఅలీ

అ: చారుమతీ I Love you
చంద్రముఖీ I Love you ॥చారుమతీ॥
రూపవతీ I Love you
నేను నీకే ఏకలవ్యా
a e i o u అన్నీ I Love you
Love you
Love you ॥చారుమతీ॥

చ: ఎదనే నీవు నిదరే లేపి ఎదురైనావు తొలి ప్రేమల్లే
కునుకే రాని ఉలుకై తీపి కలపై నావు ఎద నీడల్లే
అడిగా నిన్ను వరమిస్తావా
విడిగా నన్ను వదిలేస్తావా
Yes ఆర్ No వా Yes ఆర్ No వా ॥చారుమతీ॥

చ: ఫ్లవరై విచ్చి కలరే ఇచ్చి వికసించావు తొలి ఊహల్లో
చెలిమైవచ్చి చెలిగా నచ్చి ఉసిగొల్పావు నడిజాముల్లో
క్షణమే నేను యుగమౌతావా
సఖివై నాకు సగమౌతావా
Yes ఆర్ No వా Yes ఆర్ No వా ॥చారుమతీ॥

రచన: వేటూరి సుందరరామమూర్తి (5) గానం: శ్రేయ గోషాల్, బృందం

అ: తెలిసీ తెలిసీ వలలో పడెనే వయసు
తలచీ వలచీ కలలే కనెనే మనసు
తనువున ఎన్నో తపనలు రేగే
తహ తహలోనే తకదిమి సాగే ॥తెలిసీ॥

చ: పొద్దసలే పోక నిద్దర పోనీక
ఎవ్వరిదో కేక ఎద లోతుల దాక
భారమాయె యవ్వనం బోరు కొట్టే జీవితం
రగిలేటి విరహాన రాధల్లె నేనున్నా
నీ గాలి సోకేనా నా ఊపిరాడేనా ॥తెలిసీ॥

అది ఒక ఇదిలే ఇదిలే ఏదోలే
అది ఒక ఇదిలే ఇదిలే ఏదోలే

చ: నాకొద్దీ దూరం వెన్నెల జాగారం
బాత్‌రూం సంగీతం లేత ఈడు ఏకాంతం
కోపమొచ్చె నామీద తాపమాయె నీ మీద
దేహాలు రెండైన ప్రాణాలు నీవేగా
విసిగించు పరువాన విధిలేక పడివున్న ॥తెలిసీ॥





రచన: వేటూరి సుందరరామమూర్తి (6) గానం: హరిహరన్, చిత్ర

అ: ఎదలో గానం పెదవే మౌనం
సెలవన్నాయి కలలు సెలయేరైన కనులలో
మెరిసెనిలా శ్రీరంగ కావేరి సారంగ వర్ణాలలో అలజడిలో ॥ఎదలో॥

చ: కట్టుకథలా ఈ మమతే కలవరింత
కాలమొకటే కలలకైనా పులకరింత
శిలకూడా చిగురించే విధి రామాయణం
విధికైనా విధిమార్చే కథ ప్రేమాయణం
మరవకుమా వేసంగి ఎండల్లో
పూసేటి మల్లెల్లో మనసు కథ ॥మరవకుమా॥ ॥ఎదలో॥

చ: శ్రీగౌరి చిగురించే సిగ్గులెన్నో ॥2॥
పూచే సొగసులు ఎగసిన ఊసులు
మూగే మనసులు అవి మూగవై
తడి తడి వయ్యారాలెన్నో
ప్రియా ప్రియా అన్న వేళ .... శ్రీగౌరి ॥ఎదలో॥

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

**తారాగణం**

రాజా, కమలినీ ముఖర్జీ
అనీష్ కురువిల్ల, మీనాక్షి, గోపి, పృథ్వి, సత్యాకృష్ణన్, చందన,
అనుజ్ గురువర, గురురాజ్, అభిజిత్, బకిత, అరుంధతీ దేవి


శేఖర్ కమ్ముల


కె.ఎం. రాధాకృష్ణన్


వేటూరి



# ఆనంద్

మంచి coffee లాంటి సినిమా

హాలీవుడ్ హేవర్డ్ యూనివర్శిటీ (వాషింగ్టన్)లో మాస్టర్స్ డిగ్రీ ఇన్ ఫిలిం మేకింగ్‌కి థీసిస్‌గా 8 సంవత్సరాల క్రితం తయారు చేసుకున్న కథతో శేఖర్ కమ్ముల తీసిన చిత్రమిది.



**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| పాటలు | : వేటూరి |
| సంగీతం | : కె.ఎం.రాధాకృష్ణన్ |
| కెమెరా | : విజయ్ సి.కుమార్ |
| ఆర్ట్ డైరెక్టర్ | : కిషోర్ చౌక్సీ |
| ఎడిటర్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| డ్యాన్స్ | : నిక్సన్ (చారుమతి, వచ్చె వచ్చె పాటలకు) |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : అనిష్ కురువిల్ల |
| కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, నిర్మాత, దర్శకత్వం | : శేఖర్ కమ్ముల |

**డైరెక్షన్ & ప్రొడక్షన్ టీమ్**

ప్రవీణరావు, సాయి కిరణ్
అడివి, బైరన్ పాంటానీ, కిరణ్



'ఖుషీ'లోని 'ఆడువారి మాటలకు అర్థాలే వేరులే' పాట విన్నవారికి మురళీధర్ గురించి వేరే చెప్పనవసరం లేదు. అయితే - ఆయన ఏ.యం.రాజా గారి అబ్బాయా, లేక ఆయన ఫ్యామిలీ బ్యాగ్రౌండ్ ఏమిటి, ఆయన పాడిన పాటలు వేరే ఉన్నాయా, ఆయన ఫిలిం ఇండస్ట్రీకి ఎప్పుడొచ్చారు? ఇత్యాది ప్రశ్నలు ఇంకా చాలా మంది శ్రోతల హృదయాలలో ఇప్పటికీ ఉన్నాయి. ఇటీవల విడుదలైన 'గుడుంబాశంకర్' ఆడియోలోని 'కిళ్ళీకిళ్ళీ' పాట ద్వారా మళ్ళీ వెలుగులోకొచ్చిన 'మురళీధర్'తో 'హాసం' ప్రత్యేకంగా జరిపిన ఈ ఇంటర్వ్యూ పాఠక శ్రోతల సందేహాలన్నిటినీ తీరుస్తుందనే నమ్మకం....

# మా అక్క మరణమే నన్ను గాయకుణ్ణి చేసింది

## - మురళీధర్

**★ పాటపై మీకు ఇంట్రెస్ట్ ఎలా కలిగింది ?**

మా ఫ్యామిలీలో అందరూ మంచి సింగర్స్! మా తాతగారు అద్భుతంగా పాడతారు. మా నాన్నగారు జానపదశైలిలో చాలా చక్కగా పాడతారు. అలా పాడి సంపాదించిన ప్రైజులు మా ఇంటి నిండా చాలా ఉన్నాయి. వాటిని చూసి, నాకు కూడా వాటిని సాధించాలనే తపనతో పాడటం మొదలెట్టాను. నా చిన్నతనంలోనే మా నాన్నగారితో కలిసి స్టేజ్ షోలలో పాల్గొన్నారు. 5వ క్లాసులో ఉండగా ఓ హిందీపాట దర్గా వద్ద పాడటంతో నా కెరీర్ స్టార్ట్ అయ్యింది.

**★ శాస్త్రీయ సంగీతంలో ప్రవేశం ఉందా?**

బ్యాచిలర్ ఆఫ్ మ్యూజిక్‌లో పట్టా తీసుకున్నాను. నోటేషన్స్ రాయటం వచ్చు. అంతకన్న శాస్త్రీయత నాకు తెలియదు.

**★ పాట పాడటం మొదలు పెట్టిన తర్వాత మ్యూజిక్ డిగ్రీకోసం ప్రయత్నించారా ?**

లేదు. నేను మ్యూజిక్ నేర్చుకోవడానికి ఓ కారణం ఉంది. మా అక్క కౌసల్య చాలా మంచి గాయని. ఆవిడ పాడుతూంటే సుశీలగారే వచ్చి పాడుతున్నట్టుగా ఉండేది. అంత అద్భుతంగా పాడేదామె. దురదృష్టవశాత్తు ఆమె తన సెకండ్ డెలివరీ టైంలో కన్నుమూసింది. అప్పుడే మా అక్కలా నేను కూడా పాడాలని నిర్ణయించుకున్నాను. అంత వరకూ పాడుతున్నా గాని సీరియస్‌గా పాటపై శ్రద్ధ పెట్టింది అప్పట్నుంచే. ఓ ప్రక్క బి.కాం చదువుతూనే, మరోపక్క శ్రీసంగీత నృత్య కళాశాల, తిరుపతిలో బ్యాచిలర్ ఆఫ్ మ్యూజిక్ కోర్సులో జాయినయ్యాను.

**★ మరి సినిమా రంగంలో మీ ప్రవేశం ఎలా జరిగింది?**

మా బంధువు శ్రీకాంత్‌గారికి ఫిలిం ఇండస్ట్రీతో మంచి పరిచయం ఉంది. ఆయన 'సోవియట్ మ్యాగజైన్'లో పనిచేస్తుండేవారు. ఆయన నన్ను సంగీతదర్శకుడు కీ॥శే॥ టి.చలపతిరావు గారికి పరిచయం చేశారు. ఆయన నా గొంతువిని చాలా బాగుందని మెచ్చుకోవటమే కాక, ఇంకా బాగా రావటానికి, ఎక్కువ కాలం అది నిలబడటానికి ఏం చేయాలనేది చాలా చక్కగా చెప్పారు. ఆయన సలహా మేరకు నొటేషన్స్ రాయటం నేర్చుకున్నాను. 'మామా-అల్లుడు' చిత్రం ద్వారా దాసరి నారాయణరావు, సాలూరి వాసురావు గార్లు తొలి సినిమా పాట పాడే అవకాశం ఇచ్చారు. అంతకుముందు రాజశ్రీ గారి డైరెక్షన్‌లో 'సిరిమల్లె పువ్వు' అని ఓ డబ్బింగ్ చిత్రంలో కూడా పాడాను.

**★ ఇప్పటి వరకూ ఎన్ని పాటలు పాడి ఉంటారు?**

ప్రైవేట్ సాంగ్స్ వెయ్యి వరకూ పాడితే, తెలుగు, తమిళ, కన్నడ భాషలలో పాడిన సినిమా పాటలు 300పైన ఉంటాయి. తమిళంలో 'నరసింహ' కోసం పాడితే కన్నడంలో 'ప్రేమకేసై' కోసం పాడాను.

**★ మీరు మీ మొదటి సినిమాపాట పాడటం మొదలుపెట్టి సుమారు 13సం॥లు దాటింది. అయినా మీరు 300 పాటలు మాత్రమే పాడటానికి కారణం ఏమై ఉంటుంది?**

నేను ఇండస్ట్రీకి రావడమే అసిస్టెంట్‌గా వచ్చాను. మొదట వాసురావు గారి వద్ద 4సం॥లు చేశాను. తర్వాత రాజేశ్వరరావుగారికి చేసాను. తర్వాత కోటిగారికి 5సం॥లు, మణిశర్మగార్లవద్ద చేశాను. వీళ్ళ దగ్గర ఉన్నప్పుడే నేను కొన్ని పాటలు పాడటం జరిగింది. అసిస్టెంట్‌గా ఉండటమే నాకు సరైన అవకాశం రాకపోవటానికి కారణం అయ్యింటుందని నాభావన. అదే కాకుండా ఇప్పుడు మంచి టాలెంట్ ఉన్న సింగర్స్ ఎంతో మంది వస్తున్నారు. అవకాశం ఇస్తే అందరూ దానిని సద్వినియోగం చేసుకోవటానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. అదేగాక నేను చెన్నైలో ఉండటం కూడా ఓ కారణం అయి ఉండొచ్చు, అయినా నన్ను గుర్తుపెట్టుకుని నాతో పాడించినందుకు వారందరికీ నేను ఎంతో ఋణపడి ఉంటాను.

**★ ఎస్.రాజేశ్వరావుగారి వద్ద చేశానన్నారు.... ఏయే సినిమాలకు చేశారు ?**



నేను చేరేసరికి అయన సినిమాలకు మ్యూజిక్ చేయటం మానేశారు. కేవలం ప్రయివేట్ ఆల్బమ్స్ మాత్రమే చేస్తున్నారు. ఆటైంలో నన్నుచూసి 'నాకు మురళీ ఒక్కడు చాలు. నొటేషన్స్ చాలా బాగా రాస్తున్నాడు' అన్నారు. ఆయన దగ్గర చేయటం నా అదృష్టం. సాధారణంగా ఆయనకు ఎప్పుడూ ఇద్దరు అసిస్టెంట్‌లు ఉండేవారు.

**★ 'ఖుషి' లో 'ఆడువారి మాటలకు అర్థాలే వేరులే...' పాట పాడే అవకాశం ఎలా వచ్చింది ?**

ఆ పాట హిట్ క్రెడిట్ పవన్‌కళ్యాణ్, మణిశర్మగార్లదే, ముందుగా వాళ్ళిద్దరికీ థాంక్స్ చెప్పాలి. 'ఖుషి' సినిమా టైంలో నేను మణిగారికి అసిస్టెంట్‌గా చేస్తున్నాను. యాక్చువల్‌గా ఆ సిట్యుయేషన్‌కి తమిళ సినిమాలో పాటలేదు. పవన్‌కళ్యాణ్‌గారు పట్టుబట్టి ఈపాట పాడించారు. మణిశర్మ గారు కూడా చాలా అద్భుతంగా ట్యూన్ చేశారు. పాత పాట ఇమేజ్ చెడకుండా కొత్తపాట రీమిక్స్ చేయటం నిజంగా కత్తి మీద సాము. హేట్సాఫ్ టు మణిగారు.

**★ ఇటీవల మీరు పాడిన 'కిళ్ళీ కిళ్ళీ'...పాట బాగా వినబడుతున్నట్టుంది?**

ఈ పాట పాడటానికి కూడా పవన్‌కళ్యాణ్ గారే కారణం. ముందుగా ఈ పాట నాచేత పాడించాలనుకున్నారు. అయితే నేను కోటి గారితో కలిసి అమెరికా వెళ్ళటం, అక్కడ 10రోజులు స్టేజిషోలలో బిజీగా ఉండటం జరిగింది. ఇక్కడ షెడ్యూల్ బిజీ వల్ల మణిగారు వేరే సింగర్ చేత ఆపాట ట్రాక్ పాడించేశారు. అయితే పవన్‌కళ్యాణ్ గారికి నేను పాడితే బాగుంటుందనిపించి నన్ను కాంటాక్ట్ చేయమనటం అదే రోజు నేను ఇక్కడకు రావటం, ఆపాట పాడటం జరిగింది. పవన్‌కళ్యాణ్, మణిశర్మ గార్లకు ఏమిచ్చి ఋణం తీర్చుకోగలం? 'ఆడువారి మాటలకు' పాట ఎంత స్లోగా ఉంటుందో.. ఈ 'కిళ్ళీ కిళ్ళీ' పాట అంత ఫాస్ట్‌గా ఉంటుంది. అయితే ఇన్‌లే కవర్ మీద తప్పుగా ప్రింట్ అయ్యింది. అది నాగబాబుగారు కూడా ఓ ఇంటర్వ్యూలో క్లారిఫై చేశారు. నెక్స్ట్ బ్యాచ్ క్యాసెట్‌లలో నాపేరుతోనే ఆపాట వస్తుంది.

**★ పవన్ కళ్యాణ్ గారితో మీ పరిచయం ఎలా జరిగింది?**

నేను మొట్ట మొదటి సారిగా 'గోకులంలో సీత' కోసం 'ఊ అంది పిల్ల అల్లో....' పాట పాడాను . అప్పటినుంచి ఆయనతో నాకు మంచి పరిచయం ఉంది. నా గొంతు కూడా అయనకు నచ్చి ఉండవచ్చు. అయనే నన్ను బాగా ఎంకరేజ్ చేస్తున్నారు.

**★ మీకు బాగా గుర్తింపు తెచ్చిన పాటలు ఏవి?**

అందరికీ తెల్సిందే..! 'ఆడువారి మాటలకు అర్థాలే వేరులే', ఇప్పుడు 'కిళ్ళీ కిళ్ళీ' అంతకుముందు 'తవన్సు' సినిమాలో 'ముద్దులలో తొలి ముచ్చటలో' పాట కోటిగారి మ్యూజిక్ డైరెక్షన్‌లో పాడాను. అయితే ఆ సినిమా యావరేజ్‌గా వెళ్ళటంతో ఆ పాట కూడా మరుగున పడిపోయింది. 'ఆది'లో 'సున్నంద' పాట, 'జూన్-జులై'లో 'చందమామా చందమామా చెంతచేరమ్మ' పాటలతోపాటు ఈటీవీలో వచ్చే జయం, కలికాలం సీరియల్స్ టైటిల్ సాంగ్స్, Hansa vission సీరియల్‌కు సంబంధించిన సీరియల్స్ టైటిల్స్ సాంగ్స్ నాకు మంచి గుర్తింపును తెచ్చాయి.

**★ మీరు పాట పాడే ముందు ఆర్టిస్ట్‌ను దృష్టిలో పెట్టుకుని పాడతారా లేక మ్యూజిక్ డైరెక్టర్ చెప్పినట్టు పాడతారా?**

తప్పనిసరిగా మ్యూజిక్ డైరెక్టర్ చెప్పినట్టే పాడాలి, అయితే ఆర్టిస్ట్‌ను కూడా దృష్టిలో పెట్టుకుంటే పాట ఇంకా బాగా పాడవచ్చు. అలానే నేను 'లేడీస్ స్పెషల్' సినిమాలో సుత్తివేలు గారికోసం స్వర్ణలత గారితో కలిసి 'ఇంటికాడ నిలవలేని ఒంటిదాన్నిరో' పాట,'కౌరవుడు'లో నాగబాబు గారి కోసం 'అంతా నాఇష్టం...' పాటలు పాడాను. ఆ రెండు కూడా చక్కటి గుర్తింపునే తీసుకువచ్చాయి.

**★ అవార్డ్‌లు ఏయే పాటలకు వచ్చాయి ?**

'ఖుషి' లో పాటకు సినీగోయర్స్ అవార్డ్, 'అలుమగలు' సీరియల్ కోసం పాడిన 'పాలూ నీళ్ళ సాంగత్యం...' పాటలను అలాపన అవార్డ్ వచ్చాయి.

**★ మీ పర్సనల్.....?**

నా పుట్టినరోజు ఫిబ్రవరి 3, మానాన్నగారు త్రిపుర సందర్, అమ్మ జయమ్మ.

**★ టీవీ, సినిమా... వీటిలో మీ ప్రిఫరెన్స్ దేనికి?**

డెఫినేట్‌గా సినిమాకే... ఇకపై సినిమా పాటను మరింత శ్రద్ధగా పాడాలని నిర్ణయించుకున్నాను. అందుకే హైదరాబాద్‌కు షిఫ్ట్ అయ్యాను. ■

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తెలుగు | | తమిళం |
|---|---|---|
| చిత్రం | : ఇందిర | ఇందిరా (ప్రియాంకా) |
| రచన | : సీతారామశాస్త్రి | వైరముత్తు |
| సంగీతం | : ఏ.ఆర్.రెహమాన్ | ఏ.ఆర్.రెహమాన్ |
| గానం | : హరిణి, హరిహరన్ | హరిణి, హరిహరన్ |







ఇప్పటి చలన చిత్రాలలోని పాటలను ఎలా అంచనా వేయాలి? "ముందు తరాల రచయితల పాటలతో ఇప్పటి పాటలను పోల్చి ఎక్కువో తక్కువో చేసి మాట్లాడకూడదు. కాలం రీత్యా, కథా వస్తువుల దృష్ట్యా మారిపోతున్న జీవితపు విలువలను బట్టీ సాంకేతిక పరిజ్ఞానంగా పరిణమించిన కళారూపాన్ని పురస్కరించుకొనీ ఇప్పటి పాటలు వేరైనవి. వేదిక ఒకటే అయినా కాలాలు వేరు కావడం వల్ల కత్తినీ తుపాకినీ పోల్చడం పొసగదు" అంటారు తమిళ చిత్రగీత రచయితలలో తనదంటూ ప్రత్యేక స్థానం గడించిన వైరముత్తు. తన గీతాలతో జాతీయ బహుమతులు గెలుచుకొన్న వైరముత్తు "సినిమా అనే కృత్రిమమైన నందనవనంలో చిత్రగీతాలు మాత్రం ఇంకా సజీవ పుష్పాలుగా నవ్వులు చిందిస్తున్నాయి" అంటారు. "ఏ పాత్ర కోసం పాట రాసినా ఆ పాటకు సంబంధించిన భావం నా గుండెలో పడి నా నుండి వెలువడుతుంది" అనే వైరముత్తు చిత్రగీతాల గురించి ఎన్నెన్నో కొత్త అభిప్రాయాలు చెబుతుంటారు. ఎన్నో అనుభవాల గురించీ అనుభూతుల గురించీ పాటలు రాసినా - తన కలలన్నీ కలం ద్వారా జాలువారి గీతాల రూపాలు ధరించలేదంటారాయన.

1996లో ప్రముఖనటి సుహాసిని దర్శకత్వంలో వెలువడిన 'ఇందిరా' (ప్రియాంకా) అనే తమిళ చిత్రం కోసం వైరముత్తు ఆరు పాటలు రాశారు. ఏ.ఆర్.రెహమాన్ సంగీత దర్శకత్వంలో వెలువడిన ఆ చిత్రంలో వైరముత్తు ఒక పల్లవితో రెండు పాటలు రాశారు. ఆ రెండు పాటలూ రెండు రకాల అనుభూతులను చెప్పేవి.

జీవితంలోని ఆనందాలను వివరించే పాట ఒకటయితే, జీవితంలోని నిరాశను తెలిపే పాట రెండవది. రెండు పాటల వరసలు ఒకటే. అయితే తొలి పాటలో ఆనందాన్ని పలికించడానికి స్వర ప్రస్తారాలను బృందం ద్వారా వినిపించిన రెహమాన్ రెండవ పాటలోని విషాదాన్ని వేణువు ద్వారా పలికించారు.

సుహాసిని చిన్నాన్న కుమార్తె అయిన అనూరాధ నాయికగా, అరవింద్‌స్వామి నాయకుడుగా నిర్మించిన 'ఇందిరా' చిత్రానికి చిత్రకథను రూపొందించిన వారు - మణిరత్నం. ఈ తమిళ చిత్రం 'ఇందిర' పేరిట తెలుగులో అనువాద చిత్రంగా వచ్చింది. రెండు చిత్రాలలోనూ నాయిక పరంగా సాగిన పాటను హరిణి బృందం ఆలపించగా నాయకుడి పాటను హరిహరన్ పాడారు.

తెలుగు పాటలను సీతారామశాస్త్రి రాశారు.

ముందుగా నాయిక కోసం పాడించిన తమిళగీతం:

ఆమె: ఆ... ఆ...
నిలా కాయ్గిఅదు నేరం తేయ్గిరదు
యారుం రసిక్కవిల్లైయే
ఇంద కణ్‌గళ్ మట్టుం ఉన్నైకాణుం
తెండ్రల్ పోగింద్రదు
శోలై సిరిక్కింద్రదు
యారుం సుగిక్కవిల్లైయే
చిన్న కైగళ్ మట్టుం ఉన్నై తీండుం
కాట్రు వీసుం వెయిల్ కాయుం కాయుం
అదిల్ మాట్రం ఏదుమిల్లైయే... ఆ...

వానుం మణ్ణుం నమ్మైవాళ్‌చ్చొల్లుం
అందవాళ్ళు ఓయవిల్లై
ఎం(డ్రెండుం వానిల్ ॥నిలా కాయ్గిఉదు॥
అదో పోగిం(డ్రదు ఆశైమేగం
మళై కేట్టుక్కొళ్ళుంగళ్
ఇదో కేట్కిం(డ్రదు కుయిలిన్ పాడల్
ఇశై కేట్టుక్కొళ్ళుంగళ్
ఇంద బూమియే పూవనం
ఉంగళ్ పూక్కళై తేడుంగళ్
ఇంద వాళ్కైయే సీదనం
ఉంగళ్ తేవైయై కేళుంగళ్

ఈ పాటకు భావానువాదం:

వెన్నెల కాస్తున్నది వేళ (కాలం) తరుగుతున్నది
ఎవరూ ఆస్వాదించడం లేదే
ఈ కన్నులు మాత్రం నిన్ను చూస్తాయి
తుమ్మెద సాగుతున్నది
తోట నవ్వుతున్నది
ఎవరూ సుఖించడం లేదే
ఈ చిన్న చేతులు మాత్రం నిన్ను తాకుతాయి
గాలి వీస్తుంటుంది ఎండ కాస్తుంటుంది కాస్తుంటుంది
అందులో ఏ మార్పూ లేదు...
నింగీ నేలా మనలను జీవించమంటాయి
ఆ దీవెన ఆగిపోలేదు
ఎప్పటికీ (శాశ్వతంగా) ॥వెన్నెల కాస్తున్నది॥
అదో వెళుతున్నది ఆశల మేఘం
వానను కోరుకోండి
(వాన కావాలని అడగండి)
ఇదో వినిపిస్తున్నది కోయిల పాట
గానం కోరుకోండి (గానం వినండి)
ఈ భూమియే పువ్వులతోట
మీ పువ్వులను అన్వేషించండి
ఈ జీవితం ఒక కానుక
మీ అవసరాలేమిటో అడగండి ॥వెన్నెల కాస్తున్నది॥
('కేట్టుక్కోళ్ళుంగళ్' అంటే 'వినండి' అనీ 'అడగండి' అనీ అర్థాలు)

నాయకుడి పరంగా సాగిన తమిళగీతం ఇది:

అతను: నిలా కాయ్గిఉదు నేరం తేయ్గిఉదు
యారుం రసిక్కవిల్లైయే
ఇంద కణ్‌గళ్ మట్టుం ఉన్నై కాణుం
తెం(డ్రల్ పోగిం(డ్రదు
శోలై సిరిక్కిం(డ్రదు
యారుం సుగిక్కవిల్లైయే
ఇంద కైగళ్ మట్టుం ఉన్నై తీండుం
కాట్రు వీసుం వెయిల్ కాయుం కాయుం
అదిల్ మాట్రం ఏదుమిల్లైయే... ఆ...
వానుం మణ్ణుం నమ్మై వాళచ్చొల్లుం
అందవాళ్ళు ఓయవిల్లై
ఎం(డెం(డ్రుం వానిల్ ॥నిలా తేయ్గిఉదు॥
అదు పోగిం(డ్రదు కానల్ మేగం
మళైయై కాణవిల్లైయే
ఇదో కేట్కిం(డ్రదు కుయిలిన్ శోగం
ఇశైయుం కేట్కవిల్లైయే
ఇంద బూమియే పూవనం
ఎందన్ పూవిదళ్ సరుగుదే
ఇందవాళ్కైయే సీదనం
అదిల్ జీవనే పోనదే

నాయిక పరంగా సాగిన పాట పల్లవికీ నాయకుడి పరంగా సాగిన పాట పల్లవికీ పెద్దగా తేడా లేదు. అయితే చరణంలో మాత్రం మార్పులు కనిపిస్తాయి.

ఆ నాయకుడి మనోభావాలు తెలుసుకుందామా?

వెన్నెల కాస్తున్నది కాలం తరుగుతున్నది
ఎవరూ ఆస్వాదించడం లేదే
ఈ కన్నులు మాత్రం నిన్ను చూస్తాయి
తెమ్మెర సాగుతున్నది
తోట నవ్వుతున్నది
ఎవరూ సుఖించడం లేదే
ఈ చేతులు మాత్రం నిన్ను స్పృశిస్తాయి
గాలి వీస్తుంటుంది ఎండ కాస్తుంటుంది కాస్తుంటుంది
అందులో ఏ మార్పూ లేదు
నింగీనేలా మనను జీవించమంటాయి
ఆ దీవెన ఆగిపోలేదు
ఎప్పటికీ (శాశ్వతంగా) ॥వెన్నెల కాస్తున్నది॥
అదిగో సాగుతున్నది ఎండమావిలా మేఘం
వాన కానరాదే
ఇదిగో వినిపిస్తున్నది కోయిల శోకం
పాట వినిపించదే
ఈ భూమియే పువ్వుల తోట
నా పూలరేకు వాడిందే
ఈ జీవితమే ఒక కానుక
అందులో నా జీవమే పోయిందే
(నా జీవం తరలిపోయిందే) ॥వెన్నెల కాస్తున్నది॥

నాయికకు వర్షించే వెండి మబ్బు కనిపించగా నాయకుడికి ఎండిన మబ్బు కనిపించింది. వర్షం కురుస్తుందన్న ఆశలేదు. ఒకప్పుడు తన పాటతో తోటను మురిపించిన కోయిల శోకగీతం ఆలపిస్తున్నదట. నందనవనం వంటి జీవితంలో తనది అనుకొన్న పూలరేకు వాడి పోతున్నదనీ తన జీవితం తరిగిపోతున్నదనీ నాయకుడు బాధపడుతున్నాడు. 'సీదనం' అనే మాటకు 'కట్నం' అన్నది వాఖ్యార్థం. పాట సందర్భాన్ని బట్టి 'సంపద' అని ఆ మాటకు అర్థం చెప్పుకోవాలి.

హరిణి గళంలోని మార్దవం, ఆనందాన్ని సూచించడానికి వాడిన స్వరప్రస్తారం మత్తును కలిగిస్తుంటే హరిహరన్ పాడిన పాట గుండెను పిండేస్తున్నట్టు ఉంటుంది.

'వెన్నెల, తెమ్మెర, గాలి, ఎండ, నింగి, నేల, మబ్బు, కోయిలపాట, పువ్వులు - వీటన్నిటితో మనిషికి సంబంధం లేదా' అనిపిస్తుంది ఈ పాటలు వింటుంటే.

'ఇందిర' తెలుగు చిత్రం కోసం సీతారామశాస్త్రి రాసిన పాటలు చూద్దామా! ముందుగా నాయిక కోసం రాసిన పాట:

ఆమె: లాలీ లాలీ అను రాగం సాగుతుంటే
ఎవరూ నిదురపోరే
చిన్నపోదా మరీ చిన్ని(ప్రాణం..
కాసే వెన్నెలకు వీచే గాలులకు
హృదయం కుదుట పడదే
అంత చేదా మరి వేణుగానం
కళ్ళు మేలుకుంటే కాలమాగుతుందా

భారమైన మనసా... ఆ... ఆ...
పగటి బాధలన్నీ మరచిపోవుటకు
ఉంది కాద ఈ ఏకాంత వేళ ॥లాలీ॥
ఎటో పోయేటి నీలి మేఘం
వర్షం చినికి వెళ్లదా
ఏదో అంటోంది కోయల పాట
రాగం ఆలకించదా
అన్ని వైపులా మధువనం
పూలు పూయదా అనుక్షణం
అణువణువునా జీవితం
అందచేయదా అమృతం ॥లాలీ॥

తమిళ గీతాలలో ఉన్నట్టే తెలుగులోనూ స్త్రీ, పురుష గీతాలు రెండింటిలోనూ పల్లవి ఒకటే. చరణంలోని అభిప్రాయాలలో తేడాలు కనిపిస్తాయి.

పురుష పాత్ర కోసం రాసిన పాట చూస్తే ఆ తేడాలేమిటో తెలుస్తాయి.

అతను: లాలీ లాలీ అను రాగం సాగుతుంటే
ఎవరూ నిదురపోరే
చిన్నపోదా మరీ చిన్ని ప్రాణం
కాసే వెన్నెలకు వీచే గాలులకు
హృదయం కుదుటపడదే
అంత చేదా మరి వేణుగానం
కళ్లు మేలుకుంటే కాలమాగుతుందా
భారమైన మనసా... ఆ... ఆ...
పగటి బాధలన్నీ మరచిపోవుటకు
ఉంది కాద ఈ ఏకాంతవేళ ॥లాలీ॥
ఎటో పోతుంది నీలిమేఘం
వర్షం వెలిసిపోగా
ఏదో అంటుంది కోయల శోకం
రాగం మూగపోగా
అన్నివైపులా మధువనం
ఎండిపోయెనే ఈ క్షణం
అణువణువునా జీవితం
అడియాశకే అంకితం ॥లాలీ॥

తమిళగీతాలు వెన్నెల ప్రస్తావనతో మొదలయితే తెలుగు పాటలలో వెన్నెల కొంత ఆలస్యంగా కనిపిస్తుంది. తమిళగీతాలలో లాలి ప్రస్తావన లేదు. అలాగే వేణుగానం ప్రస్తావనా లేదూ. చిన్నపోవడమూ, చేదు కావడమూ లేవు. తమిళ గీతాలలోని భావాల సారాంశాన్ని తీసుకొని - రెండు స్వతంత్ర గీతాలు రాశారు సీతారామశాస్త్రి.

నాయిక పరంగా వర్షం చినికే నీలిమేఘం, నాయకుడి పరంగా వర్షం వెలిసిపోగా ఎటో పోతుంది. కోయిల రాగం మూగపోగా మధువనం ఎండిపోయింది. అణువణువునా అమృతాన్ని అందించిన జీవితం అడియాశకు అంకితమై పోయింది.

నాయిక మోదానికీ నాయకుడి ఖేదానికీ తగినట్టు - రెండు పాటలూ రాశారు సీతారామశాస్త్రి. తెలుగు పాటల్లో 'కోయిల' అనే మాట 'కోయల'గా ఎందుకు 'వినిపిస్తుందో' తెలియదు.

మలయాళం మాతృభాషగా గల కొందరు 'ఐ' అనే అక్షరం నూటికి నూరుపాళ్లూ సరిగా ఉచ్ఛరించడానికి ఇబ్బంది పడతారు. హరిణికి ఆ ఇబ్బంది తెలుగు పాటలో ఎదురైనట్టు అనిపిస్తుంది. అలాగే హరిహరన్ 'హృదయం' అనే పదంలో 'హృ' పలికిన తీరు కొంత వేరుగా అనిపిస్తుంది. హరిహరన్ పాడిన తెలుగు పాట తమిళగీతం కన్నా బాగుందనిపిస్తుంది. చరణం చివర 'అడియాశే అంకితం' అనే పంక్తిలో 'అంకితం' అనే మాటను ఎంతో ఆర్ద్రంగా వినిపించారు హరిహరన్.

తమిళ, తెలుగు చిత్రాలు రెండింటిలోని ఈ నాలుగు పాటలూ ఒకసారి వింటే చాలు. మరీ మరీ వినాలనిపిస్తాయి. వెంటాడుతాయి. వేధిస్తాయి. ఈ పాటలకు రెహమాన్ సమకూర్చిన సంగీతం అనితరసాధ్యం!

- పి.ఎస్.గోపాలకృష్ణ






## నటుడిగానూ రాణిస్తున్న పాప్ సింగర్

# వికాస్ భల్లా

'నేనీరోజు ఈ స్థాయికి రావడానికి నా తల్లిదండ్రులే కారణం' అంటాడు వినయంగా వికాశ్‌భల్లా. 1972 అక్టోబర్ 24న ఢిల్లీలో జన్మించిన వికాశ్ ఇవాళ నటుడిగా, గాయకుడిగా రాణిస్తున్నాడు. 'మా అమ్మ నీలు, నాన్న విజయ్‌భల్లా నాలోని గాయకుడిని చిన్నతనంలోనే కనిపెట్టారు. అందువల్లే నేను బాల్యంలోనే సంగీతం నేర్చుకోగలిగాను' అంటాడతను. తండ్రి ఢిల్లీ నుండి ముంబైకి మకాం మార్చాక, స్కాటిష్ స్కూల్‌లో చేరాడు వికాశ్. స్కూల్ స్థాయిలోనే అనేక సంగీత పోటీలలో పాల్గొని, బోలెడన్ని బహుమతుల్ని పొందాడు. అతనిలోని సంగీత జిజ్ఞాసను గుర్తించి, తొమ్మిది సంవత్సరాల వయసులో పండిత్ జియాలాల్ వసంత్ దగ్గర శాస్త్రీయ సంగీతాన్ని నేర్పించారు తల్లిదండ్రులు. దాదాపు ఐదేళ్ళు ఆయన దగ్గరే సంగీతాన్ని అభ్యసించాడు. శాస్త్రీయ సంగీత సాధనే తనకు గట్టి పునాదిని ఏర్పరచిందని చెబుతుంటాడు వికాస్. ఆ తర్వాత ఇక్బల్ గిల్ దగ్గర 1985 నుండి 95 వరకూ లలిత సంగీతాన్ని, గజల్స్‌నూ అభ్యసించాడు. అలానే అలహాబాద్ యూనివర్శిటీ నుండి సంగీతంలో డిప్లొమాను తీసుకున్నాడు. గాత్రం, తబలాలో శిక్షణ తీసుకుంటూ నాలుగేళ్ళ కోర్సును కేవలం మూడేళ్ళలోనే పూర్తి చేశాడు. తన కెరీర్ ప్రారంభంలో మర్చిపోలేని సంగతిని గురించి చెబుతూ, "ఎన్.ఎమ్.కాలేజిలో 1993లో కామర్స్ డిగ్రీ చేస్తుండగా మూవీ మేగజైన్ 'డిస్కవరీ ఆఫ్ ది ఇయర్' అవార్డును ఇచ్చి ప్రోత్సహించింది. దాంతో సినిమా రంగం దృష్టి నా మీద పడింది. గాయకుడిగా నాకంటూ ఓ గుర్తింపును తెచ్చుకోవాలని అప్పట్లో బాగా ఉండేది. అయితే నటుడిగా అవకాశాలు రావడం మొదలు పెట్టాయి. నటుడిగా కూడా కొంత శిక్షణ తీసుకోవాలనే ఆలోచనతో కిశోర్ నమిత్‌కుమార్, రోషన్ తనేజా సంస్థలో నటనకు సంబంధించి ఓనమాలు దిద్దుకున్నాను. ఆ తర్వాత 'తాకత్', 'దిల్ కె జరోఖే మే' 'దివానా హూ పాగల్ నహీ', 'జియో షాన్ సే', 'సాజీష్', 'షికార్', 'ఏక్ ఫూల్ తీన్ కాంటే', 'సౌదా' తదితర చిత్రాలలో ప్రాధాన్యం ఉన్న పాత్రల్నే పోషించాను. నటన నాకు పూర్తి స్థాయి తృప్తిని ఇవ్వకపోవడంతో గాయకుడిగానూ నాకంటూ ఓ గుర్తింపు తెచ్చుకోవాలని పాప్ ఆల్బమ్ చేశాను.

### తొలి ఆల్బమ్ 'ఆవారా'

1997లో నా మొట్టమొదటి పాప్ ఆల్బమ్ 'ఆవారా' విడుదలైంది. బిఎమ్‌జి దాని సంస్థ దానిని విడుదల చేసింది. అందులో మొత్తం ఆరు అద్భుతమైన పాటలున్నాయి. అందులోని పాటల వీడియోను న్యూయార్క్‌లో చిత్రీకరించాం. మొట్టమొదటి సారి రెండు పెద్ద కార్పొరేట్ సంస్థలు పెప్సీ, ఇంటర్ కార్డ్ ఈ ఆల్బమ్ ప్రమోషన్ కోసం మాకు సహకరించాయి. తొలి ఆల్బమ్‌తో నాకు వచ్చిన పేరు ఇంతా అంతా కాదు. దేశంలోని ప్రధాన నగరాలలో భారీ హోర్డింగ్స్ మీద పెప్సీతో పాటుగా నా బొమ్మల్ని పెట్టారు. నా మొట్టమొదటి ఆల్బమ్ ఇండియాలోనే ఐదు లక్షలకు పైగా అమ్ముడుపోయింది. ఆ ఆల్బమ్ యేడాదికి పైగా మ్యూజిక్‌ఛార్ట్సులో టాప్‌ప్లేస్‌లో ఉంది. ఆ విజయోత్సాహంతోనే నేను వరుసగా స్టేజ్‌షోలు చేయడం మొదలు పెట్టాను" అని అన్నాడు వికాశ్ భల్లా, భారత దేశంలోని ఇరవై నగరాలలో అతను ప్రదర్శనలిచ్చాడు. ఔరంగాబాద్‌లో యాభై వేల మంది సమక్షంలో ఇచ్చిన ప్రదర్శన, కెనడాలో ఐదువేల జంట మధ్య ఇచ్చిన షో తాను జీవితంలో మర్చిపోలేనని వికాస్ చెబుతున్నాడు. తొలి ఆల్బమ్ విజయం ఇచ్చిన స్ఫూర్తితో రెండో ఆల్బమ్‌గా 'వో పల్'ను విడుదల చేశాడు. దీనినీ బిఎంజి సంస్థే విడుదల చేసింది. తొలి ఆల్బమ్‌లో ఉన్న ఫీల్‌ను మిస్ కాకుండా తొలి ప్రేమలోని అనుభూతుల్ని ఆ రెండో ఆల్బమ్‌లో పొందుపరిచానని వికాస్‌చెబుతూ, "ఒక్కో గాయకుడికీ ఒక్కో ఇమేజ్ ఉంటుంది, శ్రోతలు ఏ తరహా పాటలనైతే మననుండి ఆశిస్తున్నారో, ఏ పాటలు పాడితే ఆదరిస్తున్నారో ముందు తెలుసుకోవాలి. వాళ్ళకి కావాల్సింది అందించడం ఇక్కడ ప్రధానం, మొదటి ఆల్బమ్‌కు పూర్తి భిన్నంగా నేను వెళ్ళకపోవడానికి కారణం ఇదే. 2001 జూలైలో నా రెండో అల్బమ్ విడుదలైంది. ఓ అబ్బాయి అందమైన ఓ టెర్రరిస్ట్ ప్రేమలో పడటం ఇందులోని ప్రధానాంశం. దీనికీ మంచి స్పందన వచ్చింది" అని చెప్పాడు.

అయితే ఇటీవల రీమిక్స్‌లపై శ్రోతలు ఎక్కువ ఆసక్తి కనబరచడంతో వికాస్ తన ట్రాక్‌ను మార్చుకున్నాడు. ఆ మధ్య అతను 'విక్టరీ మిక్స్' పేరుతో మూడో ఆల్బమ్‌ను విడుదల చేశాడు. 'కిశోర్‌కుమార్. ఆర్.డి.బర్మన్‌లకు నేనిచ్చిన



నివాళిగా దీనిని చెప్పుకోవచ్చు. ఇందులోని ఓ పాటను మారిషస్‌లో మాజీ మిస్ ఇండియా దియా అబ్రహంపై చిత్రీకరించాం. విజయ్ రవీంద్రనాథన్ డైరెక్షన్‌లో సాజియా గోవిత్రికర్ నృత్యదర్శకత్వంలో తీశాం. ఈ పాటలన్నింటినీ సంతోష్ నాయర్ రీమిక్స్ చేశారు' అని చెప్పారు.

సినిమాల కంటే టీవీ మీడియాకు ఎక్కువ పాపులారిటీ ఉండటంతో వికాస్ తన దృష్టిని టీవీ సీరియల్స్‌వైపు మళ్ళించాడు. అరుణా ఇరానీ రూపొందించిన 'తుమ్ బిన్ జావూ కహా' సీరియల్‌లోనూ, 'కరిష్మా- ద మిరకిల్ ఆఫ్ డెస్టినీ'లోనూ, 'కుసుమ్', 'కోయీ అప్నాసా', ఆప్నే పరాయే' తదితర సీరియల్స్‌లోనూ వికాశ్ ప్రాధాన్యం ఉన్న పాత్రల్ని పోషించాడు. నటుడిగా బిజీ అయినా సంగీత సాధన వదిలిపెట్టనని చెబుతూ, 'ఇప్పటికీ రోజుకు రెండు గంటలు సాధన చేస్తాను. ఆశాభోంస్లేతోనూ, జెన్నిఫర్ లోపెజ్‌తోనూ కలిసి పాటలు పాడాలన్నది నా కల. ఇక గాయకుల విషయానికి వస్తే నుస్రత్ ఫతే అలీఖాన్ సాహబ్, మహ్మద్ రఫీ నాకిష్టమైన గాయకులు. మనసు ఏమాత్రం బాగోకపోయినా వాళ్ళపాటల్నే విని నిద్రలోకి జారిపోతుంటాను' అంటున్నాడీ పాప్ స్టార్.

గాయకుడిగా తనకు లభించిన పురస్కారాల గురించి చెబుతూ, "1997లో బెస్ట్ పాప్‌స్టార్‌గా 27వ ఫిల్మ్‌గోయర్స్ అవార్డ్ కాంపిటీషన్ సక్సెస్ రివ్యూ పత్రిక తరపున వచ్చాయి. అవార్డులను అందుకోవడం కంటే ఆహూతుల ముందు గొంతెత్తి పాటపాడటమే నాకు ఎక్కువ ఇష్టం" అని చెబుతున్నాడు వికాస్. తన గురువు చెప్పిన ఓ మంచి మాటను తానెప్పుడూ మర్చిపోనని చెబుతూ, "అక్బర్ ఆస్థానంకు ఓ వ్యక్తి వచ్చి, 'భగవంతుడు ఉన్నాడా? ఉంటే ఎక్కడ ఉన్నాడు?" అని ప్రశ్నించాడట. వెంటనే అక్బర్ తన పక్కనే ఉన్న తాన్‌సేన్ గొంతును చూపించి... 'ఇదిగో భగవంతుడు ఇక్కడ ఉన్నాడు' అని సమాధానమిచ్చాడట. ఈ పోటీ ప్రపంచంలో సంగీతం నాకిచ్చే తృప్తి మరేదీ ఇవ్వదు. నేను సాధన చేస్తున్నప్పుడు ఓ అలౌకికమైన ఆనందాన్ని పొందుతాను. సంగీత సాధన నాకు భగవదారాధనతో సమానం" అంటున్నాడు వికాస్ భల్లా.

**- వి.అరుణ సత్యవతి**

## హాసం క్లబ్ కార్యక్రమాలకు ఆహ్వానం...

హాసం క్లబ్

ఈ ఉగాది నుండి వివిధ ప్రాంతాలలో ఏర్పాటైన 'హాసం క్లబ్'ల తదుపరి కార్యక్రమ వివరాలివిగో !

ఈ కార్యక్రమాలలో పాల్గొనటానికి మీరు 'హాసం' పాఠకులు కానవసరం లేదు. క్లబ్‌కు చందా కట్టనవసరం లేదు. హాస్య, సంగీత ప్రియులై ఉండి, సకుటుంబంగా రెండు గంటలపాటు ఆహ్లాదకర వాతావరణంలో కాలక్షేపం చేయటానికి రెడీగా ఉంటే చాలు. వచ్చి హాయిగా జోకులు, పాటలూ వినవచ్చు, మీరూ చెప్పవచ్చు, పాడవచ్చు. పాడలేకపోయినా పాటల గురించి మీ పరిశీలనలు పదిమందితో పంచుకోవచ్చు.

| ఊరు | తేదీ | సమయం | స్థలం | వివరాలకు సంప్రదించవలసినవారు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం (ప్రారంభం) | 12-09-04<br>2వ<br>ఆదివారం | సాయంత్రం<br>6.00 - 8.00 | గాయత్రి కాలేజి ఆఫ్ సైన్స్ & మేనేజ్‌మెంట్, మునసబ్ పేట, శ్రీకాకుళం | శ్రీ బి. శ్రీనివాస రావు<br>☎ 08942-240404 |
| రాజమండ్రి | 19-09-04<br>3వ<br>ఆదివారం | సాయంత్రం<br>6.00 - 8.00 | 16-4-2, శ్రీరామనగర్, సాయిబాబా గుడి దగ్గర, పేపర్‌మిల్లు వద్ద, రాజమండ్రి-5 | శ్రీ ఎం.వి.అప్పారావు,<br>☎ 2438085, 98852 15155<br>శ్రీ డి.వి.హనుమంతరావు,<br>☎ 2430945 |
| వైజాగ్ | 19-09-04<br>3వ<br>ఆదివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | ప్రేమ సమాజం, విశాఖపట్టణం | శ్రీ టి.ఎల్.ప్రసాద్<br>☎98850 56449<br>శ్రీ మస్తాన్‌రెడ్డి<br>☎ 2720219/2713554 |
| ఏలూరు | 19-09-04<br>3వ<br>ఆదివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | జిల్లా కేంద్ర గ్రంథాలయం ఏలూరు | శ్రీ మోతే నారాయణరావు<br>☎ 958812-221989<br>శ్రీ డి.రామకృష్ణారావు<br>☎958812-222318/9848141100 |
| హైదరాబాదు | 25-09-04<br>ఆఖరి<br>శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | ఆంధ్రబాలానంద సంఘం నారాయణగూడ హైదరాబాద్ | శ్రీ గిరి 55570215<br>శ్రీ ఎస్.వి.రామారావు<br>☎ 24160279/98491 39030 |
| పలాస (శ్రీకాకుళం జిల్లా) | 25-09-04<br>ఆఖరి<br>శనివారం | సాయంత్రం<br>6.35 - 8.35 | డా॥ వై.రామినాయుడు నర్సింగ్‌హోమ్, వివేకానంద కాలనీ, పలాస | శ్రీ డా॥ వై.రామినాయుడు<br>☎ 08945-241268,<br>☎ 98486 51615 |
| జగ్గంపేట | 03-10-04<br>1వ ఆదివారం | సాయంత్రం<br>4.35 - 6.35 | ఆర్యవైశ్య కళ్యాణ మంటపం ఎదురుగా జగ్గంపేట | శ్రీ నూజిళ్ళ సూర్యనారాయణ<br>☎ 08852-234185, 533435<br>శ్రీ పి.వి.ఆర్.శాస్త్రి<br>☎ 233209, 234414 |

'హాసం' అభిమానులు తమ వీలుమేరకు ఈ కార్యక్రమాలలో పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాం.

ఇతర ప్రాంతాలలో 'హాసం క్లబ్బు'లు ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసిన చిరునామా -

**శ్రీ ఎస్.వి.రామారావు, కన్వీనర్, హాసం క్లబ్స్, జి3, ఉమా అపార్ట్‌మెంట్, లలితానగర్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ -500 060, ఫోన్ - 040-2416 0279/98491 39030**

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 20

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహా వచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు. కానీ అశ్విని ఆత్మహత్యకు ప్రయత్నించడంతో మనసు మార్చుకుంటాడు. గోపాలం జైల్లో తనకు పరిచయమైన బాషా అనే రౌడీ ద్వారా శ్రీరామ్‌ను చంపించడానికి ప్లాను వేస్తాడు.

- ఇక చదవండి

"ఏంట్రా? ..సినీమా హీరోలాగా చొక్కాచేతులు మడుస్తున్నావ్?... నీ చేతిలో దెబ్బలు తిని పారిపోవడానికి ఇది సిన్మాకాదు...! నీ అంతు చూసీ మరీ వెడతాం!" -వాళ్ల నలుగురిలో- నల్లగా, లావుగావున్న ఓ రౌడీ -తన 'టీషర్టు' వెనకనించి ఓ కత్తిని బయటకు లాగుతూ చెప్పాడు. అప్పటికి 'స్టీరింగు' వదిలిపెట్టి కిందకు దిగివచ్చిన డ్రైవర్ - ఆ రౌడీ ముందుకు వచ్చి నమస్కారం పెట్టి చెప్పాడు-"బాబూ!...అర్నేం చెయ్యకండి!... మా అయ్యగారికి ఆ అబ్బాయి గోరు కాబోయే అల్లుడు....ఇంక పదిరోజుల్లో ఆరికి పెళ్ళవుతోంది!"

ఆ'పెళ్లి'కాదురా!వీడి'పెళ్లి' మేం ఇప్పుడే చేస్తాం! నువ్వడ్డొస్తే- నిన్నుకూడా ఏసేస్తాం..లే!" -'చూయింగ్‌గమ్' నములుతున్న మెల్లకన్ను రౌడీ, డ్రైవర్ని పట్టుకుని భయంగా చెప్పాడు-

"బాబుగారూ!...ఈళ్ళ జోలికెళ్ళద్దు..... మీరు కొన్నవన్నీ ఆళ్ల మొకాన కొట్టేయండి... నగలు పోయినా-పేణాల్తో బయటపడచ్చు!"

"నోర్ముయ్‌రా! మాక్కావల్సింది ఆళ్లుకొన్న నగలు కాదు...ఈడి ప్రాణాలు!" అంటూ మొదటి రౌడీ -డ్రైవర్ని బయటకు లాగి పారేసి- శ్రీరామ్‌ని కత్తితో పొడవబోయాడు.

తాయెత్తున్న తన ఎడం చేత్తో- వాడి చేతిని బలంగా పట్టుకుని -వెనక్కి విరిచాడు శ్రీరామ్ ..వాడి చేతిలో కత్తికింద పడిపోయింది...ఇంతలో రెండోవాడు శ్రీరామ్ మీదకు రాబోయాడు...వాడు అల్లంత దూరంలో వుండగానే-ఒక్కసారి పైకి ఎగిరి, తన ఎడంకాలి బూటుతో 'ఫోర్సు'గా వాడి




ముఖం మీద తన్నేడు శ్రీరామ్...

ఆ దెబ్బకు తట్టుకోలేక 'అబ్బా' అంటూ ముల్గి-ఓ మూల కెళ్లిపడ్డాడువాడు. శ్రీరామ్‌లోని హీరోయిజాన్ని చూసేసరికి డ్రైవర్‌కి కూడా ఉత్సాహం ఉబికి వచ్చింది. ..గబగబా కారుడిక్కీ తెరచిఅందులోంచి'ఇనపరాడ్' తీసుకు వచ్చాడు?. దాన్ని అటూ ఇటూ తిప్పుతూ - తమ దగ్గరికి వచ్చిన వాళ్ళనల్లా చావుదెబ్బలు కొట్టాడు...ఆ దెబ్బలకు తట్టుకోలేక -వాళ్ళల్లో ముగ్గురు కాళ్ళకు బుద్ధి చెప్పారు....శ్రీరామ్ బూటికాలి దెబ్బతో మూలపడ్డ రౌడీ మాత్రం లేవ లేక తంటాలు పడుతుంటే -వాడి జుట్టు పట్టుకుని పైకి లేవతీశాడు శ్రీరామ్.

"దున్నపోతుల్లా వున్నారు..ఇలా దారికాసి దొంగతనాలు చేసుకోకపోతే ఎక్కడైన కూలిపని చూసుకుని బతకవచ్చుగా!" -అంటూ వాడి దవడ మీద మళ్ళీ కొట్టాడు.

వాడు ఉక్రోషంగా చూశాడు.

"వేం దొంగలం కాదు...బాషా మనుషులం! ... ఇవాళ కాకపోతే రైపైనా నీ అంతు చూస్తాడు బాషా!" అన్నాడు.

"బాషా ఎవర్రా బాషా"-అంటూ వాణ్ణి అటూ ఇటూ ఊపి-మరో చెంప పగలకొట్టాడు శ్రీరామ్.

"బాషా తెలీదా?..హైదరాబాద్ పాతబస్తీ కొచ్చి అడుగు....పసిబిడ్డ కూడా చెప్తుంది?" -పొగరుగా బదులు చెప్పాడు వాడు.

అంతోలోనే అక్కడకు పోలీసు జీపొచ్చి ఆగింది.

అందులోంచి పోలీసు బలగంతో పాటు-విష్ణుమూర్తి కూడా క్రిందకు దిగేడు.

కార్లోంచి అశ్విని క్రిందకు దిగి-ఒక్క పరుగున వచ్చి తండ్రిని చేరుకుంది.

"వాట్ బేబీ...వాట్ హేపెండ్?"- అడిగేడు విష్ణుమూర్తి ఆమెను దగ్గరకు తీసుకుంటూ

"ఎవరో రౌడీలు మా వెంట పడ్డారు డాడీ!... శ్రీరామ్ వాళ్లకు బలే బుద్ధిచెప్పేడులే...చావు దెబ్బలు తిని పారిపోయారు..అడుగో...ఆ గ్యాంగ్‌లో వాడొక్కడు మాత్రం మిగిలిపోయాడు!- -అంటూ ఆ రౌడిని చూపించింది అశ్విని'.

అప్పటికే పోలీసులు-వాడి చేతుల్ని వెనక్కి విరచి పట్టుకుని జీపులో ఎక్కిస్తున్నారు.

విష్ణుమూర్తి గబగబా శ్రీరామ్ దగ్గరకు వచ్చాడు.

"నీకేం దెబ్బతగల్లేదు కదా మిస్టర్ శ్రీరామ్?"-అడిగేడు ఆందోళనగా.

"ఏం కాలేదంకుల్! డోంట్‌వర్రీ! పదండి వెడదాం!" -అంటూ కారువైపు నడిచాడు.

"ఆళ్ళు నలుగురొచ్చారు బాబూ ! సేతుల్లో



కత్తులు కూడా పట్టుకొచ్చారు.. అల్లుడుగారు ఒక్కరే అయినా-సినీమాలో సిన్న ఎన్టీఆర్‌లాగా-ఆళ్ళతో ఓ ఆట ఆడేరు.."- చెప్పాడు డ్రైవర్ ఉత్సాహంగా.

విష్ణుమూర్తి శ్రీరామ్ వైపు గర్వంగా చూశాడు..

"సార్!..రేపొద్దున్నే మీరు ఓ రిపోర్టు రాసివ్వాలి!...స్టేషన్‌కి రండి!" వాళ్ళకు దగ్గరగా వచ్చి చెప్పాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్....

"పదిరోజుల్లో పెళ్లి పీటల మీద కూర్చోవలసిన మా అల్లుడుగారు-పోలీస్ స్టేషన్‌కి రావటమా?... ఇంపాసిబుల్. ..!కావాలంటే - మాడ్రైవర్ని పంపిస్తాను..ఏం కావాలో రాయించు కోండి!"అంటూ కారెక్కి కూచ్చున్నాడు విష్ణుమూర్తి.

"ఒకే సార్ !"-అంటూ సెల్యూట్ చేశాడు ఇన్‌స్పెక్టరు.

అటు పోలీసు జీపూ-ఇటు విష్ణుమూర్తి కారూ ఒకేసారి స్టార్టయ్యాయి...

సరిగ్గా అదే సమయంలో-

రాజుపాలెంలో, వీరభద్రం ఇంట్లో-

ఉయ్యాలబల్లమీద -తాంబూలం నములుతూ కూచున్న వీరభద్రానికి-ఒళ్లు పడుతున్న నారాయణ అంటున్నాడు-

"బాబుగోరూ....! అబ్బాయిగోరి పెళ్లి ఇంక పదిరోజుల్లోనే కదా!...మరి ఏడాది తిరగేసరికి తమరు తాతగారై పోతారేమో?"

"ఔను !...మారావుబహద్దర్ల వంశమును ప్రకాశింప చేయుటకు -మరో వారసుడు ఉదయిస్తాడు!"-అంటూ ఉత్సాహంగా మీసం మెలివేశాడు వీరభద్రం...

"అట్టా -తమరింక మీసాలు మెలేసే రోజులు సెల్లిపోతాయి లెండి బాబూ.... మనవడు గారు పుట్టారంటే-తమరి ఈపెక్కి -ఆ మీసాలు పట్టుకుని ఆడిస్తారు...అప్పుడీ తాతగారు-




'తధికిణితోం'-అంటూ డేన్సాడాల్సిందే!"- అంటూ గలగలా నవ్వేశాడు నారాయణ...

వంటపని ముగించుకుని-గదిలోంచి బయటకు వచ్చిన పార్వతమ్మ ఆ మాటలు విని ముసిముసిగా నవ్వుకుంది.

* * *

ఎంతో అట్టహాసంగా, అత్యంత ఆర్భాటంగా పెళ్లి జరిగిపోయింది. అశ్వినీ, శ్రీరామ్‌లు దంపతులైపోయారు.... తన కూతురు చేతిని, శ్రీరామ్ చేతిలోపెట్టి అప్పగిస్తూ విష్ణుమూర్తి పసిపిల్లాడిలా ఏడ్చేశాడు...

"నా బిడ్డను నేను ఏనాడు కష్టపెట్టలేదయ్యా! రేపెప్పుడైనా అమ్మాయి కలతపడినట్టు తెలిస్తే -నా కాలు చెయ్యీ ఆడదు... కన్నీరు పెట్టుకోవటం చూస్తే నా గుండె ఆగిపోతుంది... దీన్ని నువ్వు -భర్తగా కాకుండా, బిడ్డగా చూసుకోవాలి !" అన్నాడు గాద్గదిక స్వరంతో....

"బావగారూ బాగా శలవిచ్చారు! భర్త అనగా భరించు వాడగును కనుక-భార్యను బిడ్డగా భావించుట తప్పుకాదు... అయినా,తమరిలా విచారించుట తగదు... మీ కుమార్తె ఇకనించీ మా కునూ కుమార్తెతో సమానమే! పైగా ఈనాటి ఆడపిల్లలు ఎందరో అమెరికా అబ్బాయిలు కోసం అర్రులు చాస్తూ-ఫోనుపలకరింపులకే తప్ప కంటిచూపులకు అందనంత దూరతీరాలకు వెళ్లిపోతున్నారు..... మీరునూ ఒకనాడు, అమ్మాయికి అమెరికా సంబంధ వేం చేయుటకు సిద్ధపడినారు....కానీ భగవంతుడు -మీకు మేలు చేసినాడు... మీ అమ్మాయి కేవలం ఇండియాలోనే -అదియునూ, రెండు మూడు గంటల వ్యవధి ప్రయాణానికి అందేటంతటి చేరువలో వుంటున్నది!... కనుక, మీరెప్పుడు కావలసినా రావచ్చును.... అట్లే, మీ అమ్మాయికి మీపై ఎప్పుడు బెంగపుట్టినా మాసుపుత్రుడు వెంట పెట్టుకుని వస్తాడు... మీరు నిశ్చింతంగా వుండండి" - అంటూ విష్ణుమూర్తి భుజం తట్టి ధైర్యం చెప్పాడు వీరభద్రం...

మావగారి భాషావేష విశేషాల్ని గమనిస్తూ అశ్విని తన మనోవేదన కొంతవరకు మర్చిపోయింది.

విష్ణుమూర్తి మాత్రం 'కంట్రోల్' చేసుకోలేకపోయాడు....శ్రీరామ్‌తోపాటు కారెక్కుతున్న అశ్వినిని మరోసారి దగ్గరకు తీసుకుని - నుదుటి మీద ముద్దుపెట్టుకున్నాడు. ఆ తర్వాత శ్రీరామ్ చేయిపట్టుకుని -కన్నీటి పొరలమధ్యనించి అతన్ని చూస్తూచెప్పాడు....

"ప్రేమించి పెళ్లిచేసుకున్నారు..'ఇక పెళ్లయిపోయిందికదా'అని ప్రేమించు కోవటం మానేయకండి. జీవితాంతం ఇలాగే ప్రేమించుకుంటూ హాయిగా వుండండి" అంటూ ఆశీర్వదించాడు.

"ఇట్టాగే వుండిపోతే ఎట్టాబాబూ...? వచ్చేఏడు ఈపాటికి ఈళ్ళిద్దరూ ముగ్గురైపోవాల!... అప్పుడు తమరూ, మా అయ్యగారూ తాతలైపోవాల!... మీ మీసాలట్టుకుని- 'తధికిణతోం' అంటూ మనవడుగారు మిమ్మల్ని ఆటపట్టించాల!" - కారు డిక్కీలో సామన్లు సర్దుతున్న నారాయణ అక్కడివాతావారణాన్ని ఆహ్లాదపరచటానికి ప్రయత్నిస్తూ చెప్పాడు...

"ఆఘోరించారు!తమరిపని తమరు చెయ్యండి!" చురుక్కున చూస్తూ మండిపడ్డాడు



వీరభద్రం...

''వాడేం తప్పుడుమాటన్లేదు..మీరు కాక్కేకండి!'' అంటూ భర్తను మందలించింది పార్వతమ్మ.

అప్పటికే- పూలతో అందంగా అలంకరించబడిన ఓ కారులో శ్రీరామ్ ,అశ్వినీ ఎక్కికూర్చున్నారు.

''రేపు మాఇంట్లో వ్రతానికి మీరు తప్పక విచ్చేయాలి!''అంటూ విష్ణుమూర్తిని ఆహ్వానించి, మరో కార్లో ఎక్కికూర్చున్నాడు వీరభద్రం..రెండు కార్లూ బరువుగా కదిలి- సాగిపోయాయి.....

గేటు దగ్గరే నిలబడి- అప్పగింతలు కార్యక్రమాన్ని -విధిలేక చూస్తూ నిలబడిన హనుమంతు -విష్ణుమూర్తిని సమీపించి అతని భుజం మీద చేయివేసి లోపలకు తీసుకెళ్లాడు....

''అమ్మాయి ఈ గడపదాటివెళ్లి పోయేసరికి - నిన్నటిదాక పొంగిపొర్లిన ఈ 'పాలసముద్రం' ఎలా వెలవెలా పోతోందో చూశావా బావమరిదీ?'' - అన్నాడు దిగులు నిండిన స్వరంతో విష్ణుమూర్తి...

''ఊరుకో బావా!....ఆడపిల్లను కన్న తల్లితండ్రులందరికీ -ఏదో ఒకనాడు ఇలాంటి ఆవేదన తప్పదు.... వాళ్ళ కాపురం పదికాలాల పాటు - పిల్లపాపలతో చల్లగా సాగిపోవాలని కోరుకోవాలే తప్ప- ఇలాంటి సమయంలో కన్నీరు పెట్టుకోకూడదు.....మీ వియ్యంకుడు చెప్పినట్టు, అమ్మాయి ఏమంత దూరాభారంలో వుందనీ? .....ఇంటిముందు కారెక్కి కూచుంటే-గంటలో నిన్నక్కడ దింపుతాడు డ్రైవరు...వారంవారం వెళ్లి అమ్మాయిని చూసివస్తూండచ్చు'' అంటూ ఓదార్చాడు హనుమంతు.

కళ్లుతుడుచుకుని- నెమ్మదిగా తనగదిలోకి వచ్చిన విష్ణుమూర్తి -గోడకు అలంకరించివున్న భార్య ఫొటో దగ్గరకునడిచాడు....

''సావిత్రీ... అమ్మాయిని అత్తవారింటికి పంపించేశాను..ఇపుడు నామనసంతా వెలితిగా మారిపోయింది..నువ్వే బ్రతికుంటే నా గుండె బరువుని నువ్వూ కొంత పంచుకునేదానివి.. అత్తవారింట్లో మన బేబిని-అదృశ్య రూపంలో నువ్వే గమనిస్తుండాలి. అది ఎలాంటి కష్టాలు పడకుండా-నువ్వే కాపాడుకోవాలి!'' -భార్యఫోటోలోకి చూస్తూ చెప్పాడు.

అవతనున్న మరోగదిలో -గోపాలం అప్పటికే విస్కీ బాటిల్ ఓపెన్ చేసి-రెండుగ్లాసుల్లో మందుపోసి -తండ్రిరాక కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. అంతలోనే హనుమంతు లోపలకు వచ్చి తలుపులు మూశాడు....

''హమ్మయ్య! ఆ మహాతల్లి వెళ్లిపోయింది.. మనకింక 'లైను' క్లియరైపోయినట్టే!'' అన్నాడు ఉత్సాహంగా...

తండ్రికి ఒక గ్లాసు అందించాడు గోపాలం.

''మావయ్య కూడా వెళ్లాడా?'' అడిగాడు.

''లేదు..కన్నీళ్లు తుడుచుకుని తన బెడ్ రూమ్‌లోకి పోయాడు...ఇక ఈరాత్రికి బయటకు రాడులే!.. అంతేకాదు ..కూతురు, దగ్గరలేని బెంగతో కొంతకాలంపాటు కంపెనీ విషయాల్ని పట్టించుకోవటం కూడా మానేస్తాడు...అప్పుడు అధికారమంతా నీదే అవుతుంది.. ఆయనకి ఎలాంటి అనుమానం రాకుండా వ్యవహారాల్ని చక్కబెట్టుకోవాలి.. సీటులో వుంటూనే మూటలు కట్టుకోవాలి!'' -అంటూ గ్లాసెత్తి -కొడుక్కి 'ఛీర్స్' చెప్పాడు హనుమంతు.

* * *

రాజుపాలెంలో వీరభద్రం ఇల్లు మహా సందడిగా వుంది.... గుమ్మాలన్నింటికీ మామిడి తోరణాలు వ్రేలాడుతున్నాయి.. ఇంటిముందు -వీధికి ఆపొడుగునించి ఈ పొడుగుదాకా వేసిన తాటాకు పందిరికింద- ఊరిపెద్దలూ,స్కూలు మాస్టర్లూ కూర్చుని- విందు భోజనం తాలూకు భుక్తాయాసం తీర్చుకుంటూ - కబుర్లు చెప్పుకుంటూన్నరు.

''మన వీరభద్రం మేష్టారు- 'సత్యనారాయణవ్రతాన్ని' కూడా పెళ్లిలాగా జరిపించారు..'' అన్నారు రంగారావు మాస్టారు..

''నిజమే అప్పుడెప్పుడో జరిగిన అమ్మాయి పెళ్లికంటే .. ఇప్పుడీ వ్రతానికి బోలెడంత ఖర్చుపెట్టి వుంటారు....'' శరభయ్య మేస్టారు చెప్పారు.

''సరేలెండి!...ఆడపిల్ల పెళ్ళంటే ఎలాగైనా ఖర్చుతోకూడిన వ్యవహారమే..తప్పదు!... కానీ ఇప్పుడు జరిగింది అబ్బాయి పెళ్లికదా!... రాబడి బాగానే వుంటుంది...

కనీసం రెండు మూడు లక్షలు కట్నం తీసుకుని వుంటాడు!'' డ్రిల్లు మేస్టరు కామెంట్ చేశాడు.

''భలేవారే!... మీకుతెలీదా?... వియ్యంకుడు లక్షల్లో కట్నం ఇవ్వటానికి సిద్ధపడ్డా- వీరభద్రంగారు 'ససేమిరా' అన్నార్ట!..మావల సంఘానికి అధ్యక్షుడు కదా?... కట్నకానుకలు ఇవ్వటం.... పుచ్చుకోవటం, కంప్లీటుగా నిషేధం!'' -ఇంగ్లీషు మాస్టారు చెప్పాడు..

రంగారావు మాస్టారు ముక్కుపొడుం ఓ పట్టుపట్టి... తుమ్మింతర్వాత - చెప్పాడు- ''అయితే ఏం లెండి!... ఆ వియ్యంకుడి గారికి ఒక్కగానొక్క కూతురు కదా!.... కోట్లకు వారసురాలు..! మనం పెళ్లికి వెళ్ళలేదుగానీ- అటెండరు గురవయ్య వెళ్లొచ్చాడుగా....! నిన్నరాత్రి అతనే చెప్పాడు... ! దేవలోకంలో పెళ్ళిళ్లు కూడా అంత వైభవంగా జరగవేమో అనిపించిందట!... భోజనంలో మొత్తం ఇరవై ఆరు వంటకాల్ని సిద్ధం చేశారట... కేటరింగువాళ్ళంతా హైద్రాబాదులోని అదేదో స్టార్ హోటల్నించి వచ్చారట!... ఇక పెళ్లికొచ్చిన మగవాళ్ళందరికీ మైసూరు నించి తెప్పించిన సిల్కు శాలువాలూ, ఆడవాళ్ళకి వెండిగ్లాసులూ పంచిపెట్టారట..''

''మంచి 'ఛాన్సే' మిస్సయి పోయామన్నమాట. ముహూర్తం ఏ శలవురోజునో అయ్యుంటే మనమూ పెళ్లికి వెళ్లే వాళ్లం'' నిరాశగా నిట్టూరుస్తూ అన్నాడు డ్రిల్లుమేస్టారు.

అదే క్షణంలో ఓ గంభీర స్వరం వినిపించింది.

''స్వామీ! వీరభద్రుడు ఎక్కడ?''

అందరూ ఉలిక్కిపడ్డట్టుగా - ఆ గొంతు వినవచ్చిన వైపు చూశారు...

వాళ్లకు ఎదురుగా ఆరడుగుల ఆజానుబాహువు నిలబడి వున్నాడు....తెల్లటి దేహచ్ఛాయ.... పొడవైనగడ్డం.... కాషాయరంగు దుస్తులు ..మెడలో అయిదారు రకాల రుద్రాక్షమాలలు...కుడిముంజేతికి బంగారు కడియం...నుదుటి విభూతి రేఖలు....చూడగానే చేతులు జోడించి నమస్కరింపచేసే పవిత్రమైన వర్చస్సు ఆయన ముఖంలో తాండవిస్తోంది.

-(ఇంకావుంది)





# లలిత సంగీతం

ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## వందనం అభివందనం అందుకొను మీ కృష్ణవేణి

ప॥ వందనం అభివందనం
అందుకొను మీ కృష్ణవేణి ॥వందనం॥

చ॥ సాగరేశ్వర మనోహారిణి
ఆగమోన్నత పథ విహారిణి
గౌతమీ ప్రియ సోదరి - నవ
జాతి రత్నమయోదరి ॥వందనం॥

చ॥ పావనీ సకలాంధ్ర జన -సం
సేవితోత్తమ వాహినీ
కనకదుర్గ కటాక్ష కరుణా
ఘనరసాంచిత జీవని ॥వందనం॥

**రచన** : కీ॥శే॥ వింజమూరి శివరామారావు
**సంగీతం** : డా॥ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ
**గానం** : కీ॥ శే॥ శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి బృందం
**రాగం** : ఖమాస్, 28వ మేళకర్త హరి కాంభోజి జన్యం - రాగ్ ఖమాజ్ (హిందుస్తాని॥)
**తాళం** : మిశ్రగతి (కర్ణాటక సం॥) - రూపక్ తాల్ (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : స మ గ మ ప ద ని స
**అవరోహణ** : స ని ద ప మ గ రి స

- షడ్జము, చతుశ్శతిరిషభం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశ్శతి దైవతం, కైశికినిషాదం స్వరాలు ఆరోహణ, అవరోహణల యందు పైన సూచించ బడిన సంచార క్రమాన్ని బట్టి వినియోగించబడతాయి యీ రాగంలో. కాకలి నిషాదం కూడా యీ రాగంలో వాడబడుతుంది. అన్యస్వరమైన సాధారణ గాంధారాన్ని కూడా యీ పాటలో వాడుకున్నారు స్వరకర్త.

ఖమాస్ రాగం కర్ణాటక సంగీతంలో చాలా ప్రసిద్ధి చెందిన రాగం. త్యాగరాజస్వామి విరచితమైన "సీతాపతే నా మనసున", మైసూర్ వాసుదేవాచార్ రచించిన "బ్రోచేవారెవరు రా నినువినా" వంటి యీ రాగంలోని కీర్తనలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. ఈ రాగం భక్తికి, శృంగారానికి కూడా ఎంతో అనువైనది. కనుకనే ఎన్నో జావళీలు "మరు బారి తాళలేనురా", "అపదూరుకు లోనైతినే","కొమ్మరో వాని కెంత బిగువే" మొదలైనవి యీ రాగంలోని మధుర శృంగార రసభావాలకు ప్రతీకలై నిలిచినవి. హిందుస్తాని సంగీతంలో ఖమాజ్ అనే పేరుతో పిలువబడుతుందీ రాగం. లలిత సంగీతంలో కూడా యిది బాగా ప్రచారంలో వున్నది. భక్తి, ప్రణయగీతాలకు స్వరకర్తలు ఖమాస్‌ను ఉపయోగించి నురుచిరమైన బాణీలు కూర్చారు. తెలుగు చలన చిత్రాలలో యీ రాగంలో ఎన్నో జావళీలు, విరహగీతాలు కూడా వెలువడినాయి.



దేశాన్ని తల్లిగా భావించి గౌరవించే సంప్రదాయం మనది. ఈ దేశంలో ప్రవహించే నదులనన్నిటినీ పుణ్య నదులుగా భావించి పూజించి, ఆ నదుల్లో స్నానం చేస్తాం. పుణ్య నదీస్నానం పాపాలను హరిస్తుందని మన ప్రగాఢ విశ్వాసం. పవిత్ర దేవాలయం నెలకొని వున్న ప్రదేశాన్ని "క్షేత్రము" అని, నది ప్రవహించే ప్రదేశాన్ని "తీర్థము" అని చెప్పుకుంటాం. విజయవాడ నగరం కనకదుర్గ అమ్మవారు, మల్లిఖార్జున స్వామి వారల ఆలయాల వల్ల పవిత్ర క్షేత్రం గాను, కృష్ణానదివల్ల తీర్థముగాను అల రారుతున్నది. కృష్ణనది మహరాష్ట్ర లోని సహ్యాద్రి పర్వత శ్రేణులలో మహాబలేశ్వరం వద్ద జన్మించి, కర్ణాటక, ఆంధ్రరాష్ట్రాలను సస్య శ్యామలం చేస్తూ హంసలదీవి వద్ద సాగరంలో సంగమిస్తున్నది.

పూర్వం బ్రహ్మదేవుడు యజ్ఞం చేస్తున్న సమయంలో సావిత్రీదేవి కోపించి దేవతలందరినీ నదులు కమ్మని శపించిందనీ ఆ కారణంగా ప్రళయానంతరం శివకేశవులు వేణి, కృష్ణ అనే నదులుగా జన్మించి కలసి ప్రవహించారనీ పురాణాల్లో ఒక కథ వున్నది. ఆ కారణంగానే యీ నదిని 'కృష్ణవేణి' అనిపిలుస్తారు. ఈ నదిలో తుంగభద్ర, మూసి, పాలేరు మొదలైన ఎన్నో ఉపనదులు ఆయాస్థలాల్లో సంగమిస్తున్నాయి. ఆయా ప్రాంతాలలో అమరేశ్వరుడు, శ్రీశైల మల్లికార్జునుడు, కనకదుర్గ మున్నగు దేవతామూర్తులు కొలువై ఉన్నారు.

తుందిలుడనే రాక్షసుడు తపస్సుచేసి శివుని వరంవల్ల పుష్కరుడనే పేరుతో శివుని రూపాల్లో ఒకటైన 'జలరూపం' ధరించాడు. ఆ పుష్కరుని పరమశివుడు బ్రహ్మదేవునికీయగా బ్రహ్మ బృహస్పతికిచ్చాడు. బృహస్పతి (గురుడు) ఒక్కో సంవత్సరం ఒక్కో నదిలో వుంటాడు. పుష్కరుడు

కూడా ఆ సంవత్సరం గురునితో ఆ నదిలో వసిస్తాడు. పుష్కరునికి వరము శివుడిచ్చిన వరం కారణంగా పుష్కరునితో పాటు సకల దేవతలు, సమస్త తీర్థాలూ కూడా ఆ నదిలో ప్రవేశించటం జరుగుతుంది. అందువల్ల ఆ నదీ స్నానం అఖండ పుణ్యఫలదం అని, అఖిల సౌభాగ్య ప్రదం అని మన అచంచల విశ్వాసం. కన్యారాశిలో గురుడు పుష్కరునితో సహా కృష్ణానది లో ప్రవేశించగా ఆ నదీ పుష్కరాలు యీ ఏడాది ఆగష్టు 27 నుండి సెప్టెంబరు 7 వరకు 12 రోజుల పాటు జరుగుతున్నవి. కీ॥శే॥వింజమూరి శివరామారావుగారు రచించిన కృష్ణవేణీ స్తుతి గీతాన్ని యీ సందర్భానికై ఎంపిక చేసుకోవడం జరిగింది. కృష్ణవేణి ప్రాశస్త్యాన్ని సుమధురంగా వర్ణించిన యీ గీతానికి మనోహరమైన బాణీని ఖమాస్ రాగం ఆధారంగా డా॥బాలమురళీగారు కూర్చగా శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి మున్నగువారు హృద్యంగా గానం చేయగా ఆకాశవాణి విజయవాడ కేంద్రం 1950వ దశకంలో ప్రసారం చేసింది.



## ఖమాస్ రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | ఎందుకే నీకింత తొందర | మల్లీశ్వరి | పి. భానుమతి | యస్. రాజేశ్వరరావు |
| 2. | ననువిడనాడకురా | విప్రనారాయణ | పి. భానుమతి | యస్. రాజేశ్వరరావు |
| 3. | పాడమని నన్నడగవలెనా | డా॥ చక్రవర్తి | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 4. | ప్రేమించే మనసాకటుంటే | మనమహాత్ముడు | కె.బి.కె.మోహన్ రాజు | యం. చిత్తరంజన్ |
| 5. | మామా చందమామా | సంబరాల రాంబాబు | యస్.పి. బాలు | వి.కుమార్ |
| 6. | మల్లెతీగె వంటిది మగువ జీవితం | మీనా | సుశీల | రమేష్‌నాయుడు |
| 7. | మధుమాస వేళలో మరుమల్లె తోటలో | అందమె ఆనందం | యస్.పి. బాలు | సత్యం |
| 8. | నీవేరా నా మదిలో దేవా తిరుమల వాసా | మట్టిలో మాణిక్యం | పి. భానుమతి | సత్యం |
| | **హిందీ** | | | |
| 1. | బన్సీ క్యూం గాయే | పరఖ్ (1960) | లతా | సలిల్ చౌధురి |
| 2. | కర్‌గయారే | బసంత్ బహార్(1956) | లతా,ఆశా | శంకర్ - జైకిషన్ |
| 3. | కట్ తే హై దుఖ్ మే యే దిన్ | పర్‌ఛాయీ(1952) | లతా | సి. రామచంద్ర |
| 4. | కభీ ఖుద్ పే కభీ హాలత్ పే రోనా ఆయా | హమ్ దోనో (1961) | రఫీ | జయదేవ్ |
| 5. | తేరే మేరే మిలన్ కీ యే రైనా | అభిమాన్ (1973) | కిషోర్ కుమార్, లత | యస్.డి. బర్మన్ |

# డిటెక్టివ్ 007 శూన్య...సున్న...సెవెన్

- నిశాంత్





"పేరు వింటేనే దొంగల గుండెల్లో దడల్... హంతకుల హృదయాల్లో హడల్... మోసగాళ్ళ మెదడుల్లో మడల్"

మడల్ అనే పదానికి అర్థం లేకపోయినా ప్రాస బాగుంటుందని అలా కంటిన్యూ అయిపోయాడు డిటెక్టివ్ సింహస్వప్నం. ఇంతకీ ఇదంతా జనం అతని గురించి అనుకుంటారు అనుకుంటే పొరపాటే. ఇదంతా అతను తన గురించి జనానికి చెప్పుకునేది.

పేరుకి సింహమే అయినా చూడ్డానికి మాత్రం సన్నగా, పొట్టిగా వుంటాడు. బాగా ప్రక్కకి దువ్విన క్రాపులో అమాయకంగా కనిపిస్తాడు. సింహానికి చిన్నప్పటినుంచీ 'జేమ్స్‌బాండ్ 007' సినిమాలు అంటే చాలా సరదా. ఎప్పటికైనా తనూ అంతటివాడు కావాలని కలలుకనేవాడు. పైగా అతని బామ్మ "నీకు బుర్రకాస్త లేటుగా వెలిగినా బాగానే వెలుగుతుందిరా" అని పొగిడిన ప్రతిసారి ఈ కోరిక మరింత ఎక్కువ అయ్యేది.

"సింహస్వప్నం 007" అంటే మరీ కాపీ కొట్టినట్టు వుంటుందని "సింహస్వప్నం శూన్య సున్న సెవెన్"గా రంగంలోకి వచ్చాడు.

పట్నంలో అయితే దొంగతనాలు, హత్యలు లాంటి నేరాలు ఎక్కువగా జరుగుతాయనీ, తనలాంటి వాళ్ళ ప్రతిభ చూపటానికి బోలెడు అవకాశాలు వస్తాయనీ ఎవరో ఇచ్చిన సలహాపుచ్చుకుని బామ్మతోసహా పట్నానికి మకాం మార్చాడు. హత్యలు, దొంగతనాలు

పట్నంలో ఎక్కువో, కాదో తెలీదుకానీ- అదేంటో సింహం దగ్గరికి మాత్రం"మా కుక్కపిల్ల రాత్రిళ్ళు వీధికుక్కలతో తిరుగుతోందనుకుంటా మీరు రెండు రాత్రిళ్ళు కాపలాకాసి ఏ కుక్కతో తిరుగుతుందో కనుక్కోండీ" అనో "మా చంటాడి బలపాలు రోజూ స్కూల్లో ఎవరు కాజేస్తున్నారో తెలుసుకోండి" అనో "డాబామీద ఆరబోసిన వడియాలు కాజేస్తున్నది మా పనిమనిషేనా కనిపెట్టండి"అనో కేసులు వస్తుండేవి. జేమ్స్ బాండ్ వూహల్లో తేలే 'సింహం' వాస్తవానికి వచ్చి వచ్చే ఏడుపు ఆపుకుంటూ పొట్టకూటికోసం అడ్డమైన కేసులూ టేకప్ చేసేవాడు.

అలాంటిది, ఒకసారి అనసూయ అనే ముప్ఫై ఏళ్ళ ఆవిడ వచ్చి 'డిటెక్టివ్ హింస స్వప్నం అంటే మీరేనాండీ', అని అడిగింది. "ఇక్కడ అలాంటి పేరు గలవారు ఎవరూలేరు - బైదిబై నాపేరు డిటెక్టివ్ సింహస్వప్నం" అంటూ విశదంగా చెప్పాడు.

"అయ్యో సారీ అండీ...కంగారులో బయట బోర్డుమీద మీ పేరు సరిగా చదవలేదు"

"పర్వాలేదులెండి" అని పైకి అన్నా "పర్వాలేదేంటి నాబొంద బామ్మ పెట్టిన బంగారంలాంటి పేరుని ఛండాలం చేసి సారీ ఒకటా" అని మనసులో అనుకుని నవ్వు పులుముకొని "కూర్చోండి, ఏమిటీ ప్రాబ్లమ్?" అన్నాడు.

"ఎవరో మా ఆయన్ని బుట్టలో వేసుకుందని అనుమానంగా ఉందండి" అనేసరికి పెద్దకేసు వచ్చిందన్న ఉత్సాహాన్ని, సంతోషాన్ని కంట్రోలు చేసుకోలేక "వావ్! వెరీగుడ్" అని బిగ్గరగా అనేసి నాలుక కరుచుకున్నాడు.

"మా ఆయన నన్ను మోసం చేస్తే మీకు వెరీగుడ్‌గా వుందాండీ?" అంటూ ఆశ్చర్యపోయింది అనసూయ.

"అంటే..అబ్బే..అలాకాదు..మీకు ఎలా చెప్పాలో అర్థం కావటంలేదు".

"చూడండి మీరు ఎంత అందంగా వున్నా, నేను మహాపత్రివతను అన్న విషయం తెలుసుకోండి!"

ఈసారి ఆశ్చర్యపోవటం సింహస్వప్నం వంతయ్యింది.

"సో..మీ ఆయన ఎవరి వెంటో తిరుగుతున్నారు అంటారు"చేతితో తిప్పుతున్న పేపర్ వెయిట్ వైపు చూస్తూ అడిగాడు.

"లేదండీ. ఎవరో మా ఆయన్ని వెంట తిప్పుకుంటోంది" కాస్త కోపంగానే అంది అనసూయ. రెండింటి మధ్య పెద్ద తేడా వుంది తెలుసుకోండన్నట్లుగా!

"ఓకె. ఇంతకీ మీకు ఈ అనుమానం ఎందుకు వచ్చింది?"

"ఈ మధ్య నాతో ప్రేమగా ఉండటం లేదండీ. అసలు అర్థరాత్రిదాకా ఇంటికే రావటంలేదు" కళ్ళలో నీళ్ళు తెచ్చుకుంది.

దానితో అనసూయ మీద విపరీతమైన జాలి, ఆవిడ భర్తమీద కోపం తెచ్చేసుకుని "మీరు ఏడవకండి! ఈ సింహస్వప్నం వున్నంతవరకూ మీకే కంగారు లేదు. అసలు నాపేరు వింటేనే దొంగల గుండెల్లో ధడల్, హంతకుల హృదయాల్లో హడల్, మోసగాళ్ళ మెదడులో మడల్"... కాస్త గర్వంగా గంభీరంగా అన్నాడు.

"ఐతే కంగారుపడవలసింది నేను కాదు మీరే.."

"ఎందుకు"?

"ఎందుకంటే మీకు భయపడేందుకు ఆయన మోసగాడు కాదు, దొంగకాడు, హంతకుడు అంతకంటే కాదు"

"మరి"

"పెద్దరౌడీ"

నిజంగానే కంగారుపుట్టింది సింహానికి. ఏదో డైలాగ్ బాగుందని అంటాడేకానీ నిజానికి ఆ టైపు మనుషులను కనీసం కలిసిన పాపానికి పోలేదు తను.

"ఐనా ఫరవాలేదు. రౌడీలకు కూడా నేనంటే భయమే"- అబద్ధం చెప్పటం చేత యినట్టు లేదు. అనసూయకు అసలు విషయం అర్థం అయిందో ఏమోకానీ కాసేపు మౌనంగా ఉండిపోయింది.

"మీకు మీ ఆయన మీద అనుమానం రావటానికి ఆధారాలు ఏమైనా వున్నాయా?" అసలు ఈ రౌడీగారి కేసు డీల్ చేయటం అవసరమా అని ఆలోచిస్తూనే- అనాలోచితంగా అడిగేశాడు.

"అంటే ఆధారాలు అంటూ పెద్దగా లేవుగానీ.. మొన్న ఒకరోజు తలుపు తీద్దాం అని వెళుతుంటే ఫోన్‌మ్రోగిందండీ... తీరా ఫోను దగ్గరకు వచ్చేసరికి రింగ్ ఆగిపోయిందండీ" సింహస్వప్నం బుర్ర వడునుగా ఆలోచించటం ప్రారంభమయింది.

"ఫోన్ మోగితే ఫోను తీయాలిగానీ మీరు తలుపు తీయటానికి ఎందుకు వెళ్ళారు?" పెద్ద లా పాయింట్ దొరికి, బోనులో ముద్దాయిని అడిగినట్టు అడిగాడు. ప్రశ్నలు వేయటంలో తనకున్న సమయస్ఫూర్తిని తనే మెచ్చుకుంటూ

"ఫోన్ మ్రోగే ముందే తలుపు ఎవరో తట్టారు కాబట్టి" చటుక్కున అంది అనసూయ.

తుస్సుమన్నాడు సింహం.

"సరే ..ఇంతకీ ఆ ఫోను ఎవరు చేసారు?" మరో ప్రశ్న సంధించాడు సింహం.

"ఎత్తందే.. ఎలా తెలుస్తుందండీ"

మళ్ళీ తుస్సుమన్నాడు సింహం.

"సరే..సరే మరయితే ఆ ఫోను ఎవరు చేసి ఉంటారు?"

"ఆ మాత్రం కనుక్కోలేరా. మీరేం డిటెక్టివ్ అండీ?ఇంకెవరూ? ఆ పిల్లే చేసి ఉంటుంది."

"ఎలా కనుక్కున్నారు?" ఠక్కున అడిగాడు.

"ఇందులో కనుక్కోకపోవటానికి ఏముంది. నేను ఎత్తుతున్నానని తెలియ గానే ఆ పిల్ల ఫోను పెట్టేసి ఉంటుంది" చాలా మామూలుగా అంది అనసూయ.

ఈ సారి సింహానికి శోష వచ్చినంత పనయ్యింది 'ఏమిటీ? ఈవిడ ఎత్తుతుందని తెలిసి, ఆవిడ పెట్టేసిందా? వీళ్ళ ఇళ్ళలో టెలిఫోన్లకి కెమెరాలు ఏమయినా వున్నాయా, ముందుగానే తెలియటానికి - పైగా మీరేం డిటెక్టివ్ అంటుందా'?

"ఇంకేమయినా ఆధారాలున్నాయా?" ప్రశాంతంగా అడిగాడు.

"నిన్నరాత్రి నిద్రలో అనూ....అనూ.. .అంటూ కలవరించాడు".

"ఏమి అనమని?"

కాసేపు నిశ్శబ్దం అలుముకోవటంతోనూ, ఆమె వెర్రి చూపులను బట్టి తన ప్రశ్న అర్థం కాలేదని పసిగట్టి, మళ్ళీ తనే "ఏమి అనమని కలవరించారు?" అని అడిగాడు. ఈ సారియినా ఏమైనా క్లూ దొరుకుతుందేమోనని కుతూహలంగా ఆమె వైపే చూస్తూ ఉండిపోయాడు.

"మీకు సరిగా అర్థం అయినట్టులేదు "అనూ" అంటే ఒక అమ్మాయి పేరు" అంది అనసూయ నెమ్మదిగా.

ఒక్కసారిగా దగ్గు రావటంతో దగ్గేసి, గ్లాసులో మంచినీళ్ళు తాగి.. "ఆ....ఆ... నేను ఆదే అనుకున్నా. మంచిదేగా ...అను.. అంటే మీపేరే



కదా! .... అనసూయ.." అన్నాడు..

"అనూ.. అంటే నేనుకాదు... ప్రక్కవీధిలో టైలరింగ్ షాపులో కొత్తగా చేరిన అమ్మాయి పేరు." పళ్ళుకొరుకుతూ అంది.

ఇంకాసేపు ప్రశ్నలడిగితే తన తెలివి బయటపడి కేసు వాపసు తీసుకుంటుందనే అనుమానం వచ్చి

"సరేనండీ... మీ వారు రౌడీ అయినా సరే.. .ఏ మాత్రం భయపడకుండా మీ కేసు టేకప్ చేస్తున్నాను". అన్నాడు. ఆవిడ ముఖంలో సంతృప్తి కనిపిస్తుందేమోనని చూసాడు.

ఆవిడ ఎటువంటి ఎక్స్‌ప్రెషన్ ఇవ్వకపోయేసరికి కాస్త దిగులేసినా, సిసలైన డిటెక్టివ్ స్టైల్లో "అయితే మనం చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. నేను మీ కోసం పనిచేస్తున్నానని ఎవరికైనా తెలిస్తే తరువాత నా పని చాలాకష్టం అయిపోతుంది. పైగా మీ ఆయన జాగ్రత్తపడి అలాంటి పాడు పనులు మానేసినా మానేయవచ్చు..."బెదిరింపుగా అన్నాడు.

"అయితే వెంటనే ఆయనకి ఈ విషయం తెలియాలండీ" చాలా ఉత్సాహంగా అంది.

ఒక నిముషం ఏమిచేయాలో అర్థంకాలేదు సింహానికి. ఎలాగో తేరుకుని "మీరు ఇప్పుడు వెళ్ళిరండి. నేను మీకు ఫోను చేస్తాను. ఐతే మీరు నన్ను పేరు పెట్టిపిలవకండి. నేను మీకు ఒక కోడ్ ఇస్తాను. ఆ కోడ్ తోనే నన్ను పిలవాలి మీరు. ఇక నుంచీ నేను శూన్య సున్న సెవెన్ని"

ఫక్కున నవ్వింది అనసూయ. అర్థంకాక 'ఏమిటి'? అన్నట్టు చూశాడు.

"ఏమిలేదు లెండి".

"ఫర్వాలేదు చెప్పండి".

"మీకు కోపం రాదుకదూ?"

"రాదులెండి"

"మీరు చెప్పిన కోడ్ అర్థం తెలీదుకాని వినటానికి మాత్రం "సూడు సన్యాసెదవని"అని వినిపించిందండీ".

సింహానికి సిగ్గుతో వెుహం ఎక్కడ దాచుకోవాలో తెలీలేదు, కానీ ఆవిడ మాటలు పట్టించుకోనట్లుగా

"శూన్య, సున్నా, సెవెన్, ఇది నా కోడ్ నేమ్. నేను ఎప్పుడు ఫోను చేసినా ఈ పేరుతోనే పిలవాలి. దీన్ని మనం సీక్రెట్‌గా ఉంచాలి సరేనా?" అన్నాడు సీరియస్‌గా.

అనసూయ వచ్చే నవ్వునాపుకుంటూ సరేనని వెళ్ళిపోయింది. మర్నాడు అనసూయకు ఫోను చేస్తే 'హలో' అంటూ ఓ గంభీరమైన మగగొంతు పలకరించింది.

టక్కున ఫోను పెట్టేశాడు. "ఎవరుమీరు?" అంటే జవాబేమి ఇవ్వాలో తెలీక...కాసేపు ఆలోచించి మళ్ళీ ఫోను చేశాడు. ఈసారి అనసూయే ఎత్తింది. 'హలో' అంటూ

'హలో నేనండి... శూన్య,సున్నా సెవెన్ని'

కాసేపు అవతలినుంచి ఏమీ వినపడలేదు. ఆ తర్వాత వో వెర్రినవ్వు చప్పుడుతో "ఓ! మీరా డిటెక్టివ్ సింహస్వప్నంగారూ!" అంది అనసూయ.

"అయ్యో -మీరు నన్ను అలా పిలవ కూడదండీ" ఉసూరుమంటూ అన్నాడు సింహం.

"అరెరె! మరిచిపోయానండీ!" అంటూ మళ్ళీ ఓ వెర్రినవ్వు. సింహానికి నామోషిగా అనిపించినా చేసేదిలేక

'మీరు నిన్న 'అనూ' గురించి చెప్పారు కదండీ! ఆమె ఎక్కడ వుంటోందన్నారు?"

"మా ప్రక్క వీధిలో టైలర్ అండీ.. ఎందుకూ?"

"నేను ఆమెని కలవాలనుకుంటున్నా"

"అయితే మీరు వచ్చేసాటికి ఆమెని పిలిపించి రెడీగా ఉంచమంటరా?"

చివ్వున కోపం వచ్చింది సింహానికి. తను రహస్యంగా ఆమెని పరిశోధించి వద్దామనుకుంటే - ఈవిడేంటి- పెళ్ళిచూపులకు పిలిచినట్లుగా రెడీగా వుంచుతాననంటోంది?

"వద్దు...వద్దు...నేనే ఆమె దగ్గరకు వెళ్ళి అన్ని విషయాలు కనుక్కుంటాను." లేని ప్రశాంతతను గొంతులోకి తెచ్చుకుంటూ అన్నాడు సింహం.

"అయితే మనిషిని పంపించి మీరు వచ్చేసరికి కుట్టుపనులన్నీ పూర్తి చేసుకుని ఖాళీగా కూర్చోమనేదా.?"

వచ్చే కోపాన్ని అణుచుకోవటం అనవసరమనిపించి అరిచేసాడు

"వద్దు...అడ్రస్ ఇస్తే చాలు".

* * *

'పాపులర్ టైలరింగ్ షాపు' ముందు నుంచొని ఉన్నాడు డిటెక్టివ్ సింహం.

'ప్రేమించటం తెలిసినవాడు ఎన్నిసార్లైనా ప్రేమలో పడగలడు' అని ఎక్కడో విన్నదానిని.. కొంచెం మోడిఫై చేసి "తిరగటం తెలిసింది ఎంతమందితోనైనా తిరగగలదు" అని తనే డిసైడ్ అయిపోయి, అసలు ఈ 'అను' అనబడే టైలర్ తిరుగుబోతో కాదో తెలుసుకోవాలి' అనుకుంటూ లోపలికి వెళ్ళాడు.

లోపల వయసులో వున్న ఆకారం కనిపించింది ఒక్కతే ఉంది. నల్లగా.. బొద్దుగా ఉంది. జడను చూసి అమ్మాయి అనుకొన్నాడు గానీ, అదే ఏ అడవిలోనే చూసి వుంటే 'ఎలుగుబంటి' అని పారిపోయేవాడు.

'ఏం కావాలండీ!' ఆకారం ఎలావున్నా గొంతు బాగానే వుంది ఖచ్చితంగా మనిషే!

'మీ పేరు?' అడిగాడు

'అను'

'మీరు చాలా అందంగా ఉన్నారు' టక్కున అనేసి ఆమె ముఖంలో భావాల కోసం వెతకటం ప్రారంభించాడు సింహం. ముందు కాస్త ఆశ్చర్యపోయి ..తర్వాత కొంచెం సిగ్గుపడుతూ "థ్యాంక్యూ.. ఇంతకూ ఏం పని?" అడిగిందామె.

భావాలు వెతకటంలోనే ఉండిపోయిన సింహం కాస్త ఆలస్యంగా తేరుకుని "ఈ చొక్కాని చించి ..నాలుగు చేతి రుమాళ్ళుగా కుట్టాలి" అన్నాడు....మరి ఈవిడ కోసం కొత్తబట్టలు ఎక్కడ కుట్టించుకునేది..అసలే నెలాఖరు రోజులు..తను తెచ్చిన ఓ పాత చొక్కాని బల్లమీద పెట్టాడు.

వింతగా...ఆశ్చర్యంగా..అతనివైపే చూస్తూ.

"ఇదివరకు ఎప్పుడూ చేయలేదు..ఇదే ఫస్ట్‌టైమ్ ..కానీ ట్రై చేస్తాను" అంది అను.

"నాకూ ఇదే ఫస్ట్ టైమ్"

"ఏంటీ?"

"మీ అంత అందమయినవారితో మాట్లాడటం" మళ్ళీ ముఖంలో భావాల కోసం వెతుకులాట.

పోయినసారి చూసిన ఆశ్చర్యం, సిగ్గులాంటివి కాక ఈసారి 'అసహ్యించుకుంటున్న భావం' కనిపించింది. అయినా ఫర్వాలేదు..

"మూడురోజులు ఆగిరండి. నాలుగు రుమాళ్ళు తీసుకుందురుగాని"

"రేపు కుదరదా?"

"కుదరదు"

"పోని ఎల్లుండి?"

"కావాలంటే రెండు ఇవ్వగలను"

"పోనీ ఓ పనిచేస్తా! రోజుకొకటి చొప్పున నాలుగు రోజులూ వచ్చి తీసుకుంటా!"

"అలా ఎందుకు?"

"అప్పుడయితే నిన్ను నాలుగుసార్లు చూడటం అవుతుంది కదా!" చాలా ఉషారుగా అన్నాడు సింహం.



రొమాన్సు అంటే ఏంటో అనుకున్నా ..ఇంత సులభమా...

"ఏమిటి....." ఆవిడ ముఖంలో భావాలు ..ఇలా ..ఎలా మారుతున్నాయి.

"మావయ్యా...వీడు ఎవడో అల్లరి చేస్తున్నాడు ఒకసారి త్వరగా రండి..."అరిచింది 'అను'

అంతే ....చొక్కా మాటదేవుడెరుగు... అక్కడ మొదలెట్టిన పరుగు ఆఫీసులోనే ఆపాడు సింహం.

* * *

కేసుని కొత్తకోణం నుంచీ పరిశోధించాలని అనిపించి ఈసారి రౌడీగారి మీద దృష్టిసారించాడు సింహం. ఆలోచించగా...చించగా... ఓ ఉపాయం తట్టి వెంటనే అనసూయకి ఫోన్ చేసి..'హలో' అన్నాడు. షరా మామూలే. అవతలి నుంచీ 'హలో' అని గంభీరంగా మగగొంతు వినపడగానే టక్కున ఫోనుపెట్టేశాడు.

కాసేపాగి మళ్ళీచేస్తే అనసూయ పలికింది.

"హల్లో..నేను శూన్య.... సున్నా... సెవెన్‌ని" రహస్యంగా చెబుతున్నట్టు గొణిగాడు.

"ఓ! మీరా! చెప్పండి. చూసారా? ఈసారి మిమ్మల్ని డిటెక్టివ్ సింహస్వప్నం గారా? అని పిలవలేదు".

నోటమాట రాలేదు సింహానికి. అసలు తనలాంటి డిటెక్టివ్‌లు ఫెయిల్ అవటానికి సగం కారణం ఏమిటో ఇప్పుడే అర్థమయినట్లు అనిపించింది అతనికి. వివరించి చెప్పటం వ్యర్థం అనుకొని వచ్చిన కోపాన్ని ఉత్సాహంగా మార్చుకుంటూ "పేరు పెట్టి పిలవకూడదని భలే గుర్తుపెట్టు కున్నారే!" అని ఓ వెకిలి నవ్వు నవ్వి

"నేను మీ వారిని టెస్ట్ చేద్దామనుకుంటున్నా" అన్నాడు

"ఎలా?"

"మీరు ఓ రెండు రోజులు పుట్టింటికి వెళ్ళిరండి. ఆ రెండు రోజులూ నేను మీ ఆయనకి తెలీయకుండా ఆయన చేసే పనులన్నీ గమనిస్తాను. మీరు లేరని ఆయన ఏదైనా పాడువని చేస్తే నేను మీకు వెంటనే తెలియజేస్తాను".

"మీరు ఎంత తెలివైనవారండీ"

అలా గాలిలో తేలిపోయినట్టు అనిపించింది సింహానికి. ఇంతలోనే ఏడుపు వినిపించడంతో కంగారుగా "ఏమయ్యిందండీ ఏడుస్తున్నారు?" అన్నాడు .

"నేను పుట్టింటికి వెళ్ళడానికి వీలుపడదండీ!" అన్నది వెక్కుతూ,

"ఎందుకని?"

"నాలుగేళ్ళ క్రితం మావారు నన్ను లేవదీసుకుని వచ్చి పెళ్ళిచేసుకున్నారు. ఇప్పుడు ఇంక ఆయన తప్ప నాకు ఎవరూ లేరు." సింహానికి చాలాకోపం వచ్చేసింది.

"నో! ఈ సింహస్వప్నం ఈ విషయాన్ని తీవ్రంగా ఖండిస్తున్నాడు. ఒక తెలుగింటి ఆడపడుచును ...అందునా లేవదీసుకు వచ్చిన ఆడపడుచును నిర్లక్ష్యం చేసి ప్రక్కవీధి పిల్లతో తిరుగుతాడా నీ భర్త! ఊరికే చూస్తూ ..ఊరుకునేదిలేదు. మీకు తెలుసుగా.. నేనంటే... హడల్.. ధడల్... మడల్." కోపంలో ఏం వాగుతున్నాడో తెలీటం లేదు సింహానికి.

"మీకు ఎవరూ లేరని బాధపడకండి. మీకు నేనున్నాను. నాకు బామ్మవుంది. ఈ రెండు రోజులు మీరు మా ఇంట్లో ఉండండి". డైలాగ్ పూర్తి చేసేసరికి ఆయాసం వచ్చింది.

"అబ్బే, మీ బామ్మకెందుకులెండి శ్రమ?" అర్థంకాలేదు సింహానికి.

"మా బామ్మకెందుకండీ శ్రమ?"

"నేను మీ ఇంట్లో వుంటే ఆవిడకి శ్రమ కాదా మరి?'

'ఈవిడ మా ఇంట్లో ఎందుకు ఉంటుందబ్బా?' అని బుర్రగోకుతుంటే అప్పుడు అర్థమయ్యింది. 'తనుకొట్టిన డైలాగ్ ఏంటి?... ఆవేశంలో ఆమెని తన ఇంట్లో ఉండమని ఆహ్వానించాడా?... ఆవేశం అనర్థానికి దారితీస్తుందంటారు... బహుశా ఇదేనేమో!'

"అబ్బే ఇందులో ఏముందండీ... నా క్లయింట్స్ కోసం నా ప్రాణాలే అప్పుడప్పుడూ ఇస్తూ ఉంటాను. మీకు నా ఇంట్లో రెండు రోజులు నీడ నివ్వలేనా?" తెలియకుండానే గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఏం జరుగుతోంది! తనకు తెలీకుండానే వెధవ నోరు ఇలా మాట్లేడేస్తోందేంటి?

"అయితే ఎప్పుడు రమ్మంటారు?"

ఈ సారి గుండె చప్పుళ్ళు ధడేల్ ధడేల్ మంటూ విన్పిస్తున్నాయి.

"రే..రే...రేపు....రండి"

* * *

సింహస్వప్నం నిద్రాహారాలు మాని యమాబిజీ అయిపోయాడు. మొదటిసారి రౌడీగారి గుబురుమీసాలు, మీసాలకి తగ్గ భారీ ఆకారం,కనిపించీ కనిపించకుండా బొడ్డులో దోపు కున్న కత్తి..ఇవన్నీ చూసి వెన్నుల్లో వొణుకు పుట్టినా అనసూయను త్వరగా ఇంట్లో నుంచి పంపించేయాలన్న సంకల్పం వల్ల ధైర్యంగా ఉండగలిగాడు.

ఆ రెండు రోజులూ రౌడీగారి కంట పడకుండా రకరకాల మారువేషాలు వేశాడు. రౌడీగారు బారుకువెళ్తే తను పెప్సీ తాగుతూ ఫుల్‌గా తాగేసిన వాడిలాగ యాక్షన్ చేశాడు. రౌడీగారు క్లబ్బుకి వెళ్తే పక్కటేబిల్ మీద తన జేబులు ఖాళీ అయ్యేదాక పేకాట ఆడాడు. రౌడీగారు వీధి చివర మీటింగ్ పెడితే తను ఆ వీధిలో అడుక్కుతినే వాడిలాగ ఫాలో అయ్యాడు. ఒకసారి ఫాలో అవుతుండగా రౌడీగారికి అనుమానం వచ్చి వెనక్కితిరిగి చూసేంతలో తను చటుక్కున పక్కనే ఉన్న చెత్త కుండీలోకి దూకి చెత్తఏరుకునే వాడిమొఖం పెట్టాడు.

ఇంతచేసినా ఆధారాలు ఏమీ దొరకలేదు. అసలు రౌడీగారు ఆడవారివైపు కన్నెత్తికూడా చూడలేదు. మూడో రోజు సాయంత్రం ఉసూరుమంటూ ఇంటికి చేరి జరిగిందంతా అనసూయకి చెప్పి ఆమె భర్తకు "క్లీన్ చిట్" ఇచ్చాడు. అనసూయ ఇంటికి వెళ్ళిపోయింది. వెళ్ళిన గంటకే ఫోను చేసింది.

"హలో! శూన్య...సున్నా...సెవెన్ గారా!" కంగారుగా పలుకుతోంది ఆడగొంతు.

"అవును ..ఎ..వరు అనసూయగారేనా?"

"అవునండీ అనసూయనే...కొంప మునిగిందండీ సున్నాగారు... ఇంటికి చేరేసరికి అసలు విషయం బయటపడింది-నాకు తెలీకుండా ..నా మీద మావారు ఒక డిటెక్టివ్‌ను పెట్టారంట. ఆ డిటెక్టివ్ గాడు 'మీరు నాకు తరచూ ఫోను చేస్తున్నారనీ, నేను మీ ఇంట్లోరెండు రోజులు పైగానే గడిపా'నని రిపోర్టు ఇచ్చాడంట..'ఎవడే వాడు ! వాడి అంతు తేలుస్తా'నంటూ మావారు మీ ఆఫీసువైపు బయలుదేరారు. నన్ను క్షమించి..."

అంతే ఇల్లూ...ఆఫీసు వొదిలేసి బామ్మతో సహా పల్లెకు పోయే బస్సు కోసం పరుగు తీస్తున్నాడు డిటెక్టివ్ సింహస్వప్నం.



తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 11

- ఇంద్రగంటి జానకీబాల



పందిట్లో
పెళ్ళవుతున్నాది -
కను - విందవుతున్నాది
నటనమే ఆడెదనూ
నటనమే ఆడెదనూ...

అంటూ ప్రతీ పెళ్ళి పందిట్లోనూ మారుమోగిన గళం, ఆంధ్రులందరికీ సుపరిచితమే. మధురమైన ఆ కంఠం జిక్కీది. పి.జి.కృష్ణవేణిగా మొదట్లో కొన్ని సినిమాల టైటిల్స్‌లో కనిపించినా జిక్కిగానే ఆమె సుస్థిర కీర్తినార్జించారు. ఆమెను మొదటి నుంచీ ఎరుగున్నవారు 'అంత అమాయకురాలు మరొకరుండరు' అని చెప్తారు. ఎంతో ప్రతిభావంతురాలైన జిక్కి, చాలా అమాయకంగా, లోకం పోకడ తెలియకుండా వుంటారంటే ఆశ్చర్యమే కలుగుతుంది.

జిక్కితన ఏడో ఏట నుంచీ పాడటం మొదలు పెట్టారు. అంటే ఆమె చైల్డ్ ప్రాడిజీ అని చెప్పాలి. సంగీత సంప్రదాయం గల కుటుంబమేమీ కాదు. ఆమె తండ్రి స్టూడియోలో చాలా చిన్నతరహా పనులు చేస్తూ వుండేవారట. అయితే జిక్కిలో వున్న సంగీతాన్ని, అద్భుతమైన గ్రహణశక్తిని గుర్తించిన గూడవల్లి రామబ్రహ్మంగారు తాను తీస్తున్న పంతులమ్మ(1943)సినిమాలో చిన్న వేషం యిచ్చి ఒకపాట కూడా పాడించారు. అంటే జిక్కి పాడుతూ నటించారన్నమాట. ఆ మొదటి పాట 'ఈ తీరున నిన్నెరిగి పలుకగా తరమా' దానికి సంగీతం వహించినది గాలి పెంచల నరసింహరావు. అందులో పంతులమ్మగా లక్ష్మీరాజ్యం నటించగా శిష్యురాలిగా జిక్కి నటించారు. అదే విధంగా 'మంగళసూత్రం' (1946)లో నటించారు, పాడారు. ఆ పాట విజాపురం నాగేశ్వరరావుతో కలిసి 'మా మామయ్యొచ్చాడే' దీనికి పాశ్చాత్య ధోరణి సంగీతం : పి. మునుస్వామి. నాగయ్య నటించిన 'త్యాగయ్య'లో (1946)'రారే రారే పిల్లల్లారా' అని పిల్లల బొమ్మల పెళ్ళి సన్నివేశంలో పాడుతూ నటించారు. గొల్లభామ(1947)లో కోయపిల్లగా నటించారు.



## చుక్కలనందుకునే గళవిన్యాసం గల జిక్కి

ఆవిధంగా బాగా చిన్నవయసు నుంచీ నటిస్తూ, పాటలు పాడినా క్రమంగా ప్లేబ్యాక్ పాడటానికే ఆమె నిర్ణయించుకుని, నటనని వదిలేశారు. గళసంపద మీదే ఆధారపడ్డారు.

'శ్రీ లక్ష్మమ్మ కథ'లో సి. ఆర్. సుబ్బురామన్ సంగీత దర్శకత్వంలో పాడారు. బొంబాయి సంగీత దర్శకులు శంకర్- జైకిషన్ల సంగీత దర్శకత్వంలో 'ప్రేమలేఖలు'(1953)లో పాడారు. అనార్కలి(1955) నాటికి జిక్కి తిరుగులేని నేపథ్య గాయనిగా స్థిరపడిపోయారు. అప్పటికే 'రాజు-పేద', 'వద్దంటే డబ్బు' లాంటి సినిమాల్లో పాటలు పాడి పేరు సంపాదించుకున్నారు.

'అనార్కలీ'లో 'జీవితమే సఫలము' - 'తాగి తూలేనని తలచేను లోకము', అర్ధాంగి'లో 'వద్దురా కన్నయ్యా', 'రాకరాక వచ్చావు చందమామా', 'దొంగరాముడు'లో 'అంద చందాల సొగసరివాడు', 'రోజులు మారాయి'లో 'ఏరువాక సాగారో రన్నో చిన్నన్న', 'ప్రేమలేఖలు'లో 'ఏకాంతము సాయంత్రము', 'నీ పేరువిన్నా' పాటలతో అత్యంత వున్నత స్థాయికి చేరుకున్నారు. సినిమా పరిశ్రమలో నేపథ్య గాయనులు పి.లీల, జిక్కి రాజ్యమేలిన రోజులవి.

'భలేరాముడు', 'భలే అమ్మాయిలు', 'సువర్ణసుందరి', 'చెంచులక్ష్మి', 'జల్సారాయుడు', 'మాయింటి మహాలక్ష్మి', 'వద్దంటే డబ్బు', 'వీరకంకణం', ఇలా ఎక్కడ చూసినా జిక్కీ పాటలు మారుమోగాయి. అప్పట్లో కథానాయికకు జిక్కీలేకుంటే లీల పాడటం రివాజుగా వుండేది.

మొదట్లో సంగీతం, ప్లేబ్యాక్ పాడటం, పాట నేర్చుకోవడం, రికార్డింగ్‌కి వెళ్ళడం, పాడటం, రావడం ఇదే తప్ప మరో ధ్యాసలేదు జిక్కీకి. ఇంట్లోగానీ, ఆమెకి గానీ ఆమె పెళ్ళి గురించి ఆలోచన లేదు. అయితే ఒకటి రెండుసార్లు ఆప్రసక్తి వచ్చినా, డబ్బు సంపాదించే ఆమె పెళ్ళి చేసుకోదు అనే నిర్ణయానికి కుటుంబమంతా వచ్చారు. అప్పటికే ఆమె వేలకు వేలు సంపాదిస్తున్నారు.

ఆమె ఏ.ఎం.రాజాతో చాలా డ్యూయెట్లు పాడారు. అవన్నీ ఎంతో పాప్యులరై ఇద్దరికీ ఎంతో

పేరొచ్చింది. అలాంటి ఒక రికార్డింగ్ సందర్భంలో ఏ.ఎమ్.రాజా చిన్న కాగితం మీద 'మీకు యిష్టమైతే మిమ్మల్ని వివాహం చేసుకుంటాను' అని రాసి ఇచ్చార్ట. ఆమెకేం అర్థం కాలేదు. ఇంటికెళ్ళి ఆ విషయం ఆమె తండ్రికి, కుటుంబ సభ్యులకి చెప్పినప్పుడు-

"పెళ్ళి వద్దు అనుకున్నాం కదా! మళ్ళీ ఇప్పుడు పెళ్ళి అంటూ వచ్చావేమిటి? ఒకవేళ నువ్వు పెళ్ళి చేసుకోదల్చుకుంటే, ఇంతవరకు వున్న డబ్బు, ఆస్తి ఏమీ తీసుకోడానికి వీల్లేదు. అంతా మాకు రాసిచ్చేసి వెళ్ళి పెళ్ళి చేసుకుంటే చేసుకో" అని మొత్తం కుటుంబం చెప్పేసరికి ఆమెకేం చెయ్యాలో తోచలేదు. ఆమె మరింక చేసేది లేక -అదేమాట రాజాతో చెప్పారట. "నువ్వు కట్టు బట్టలతో వచ్చినా నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను" అని రాజా చెప్పారుట- సరేనని ఆమె పెళ్ళికి సిద్ధపడ్డారు. జిక్కీ ఏ.ఎమ్.రాజాల పెళ్ళి సినీ ప్రముఖుల సమక్షంలో ఘనంగా జరిగింది.

కట్టుబట్టలతో వచ్చినా స్వీకరించి పెళ్ళిచేసుకుంటానని పలికిన భర్త ఏ.ఎమ్.రాజా, ఆ తర్వాత ఆమెలోని గానానికి, ఆమె పాటకీ, ఆమె కెరీర్‌కి ఎంతవరకు సహకరించారన్నది ప్రశ్నగానే మిగిలిపోయింది.

అప్పట్లో దావానంలా ఒక వార్త ఆంధ్ర దేశమంతటా గుప్పుమంది. అదేమంటే "జిక్కీ ఒక్క ఏ.ఎమ్. రాజాతో తప్ప, మరెవ్వరితోనూ యుగళ గీతాలు పాడరట' అని. అది వట్టి గాలి వార్త కావచ్చు కాకపోతే లోలోపల అలాంటి భావం వచ్చి వుండవచ్చు. క్రమంగా జిక్కి పాడటం చాలా వరకు తగ్గిపోయింది.

ఏ.ఎమ్.రాజాకి తెలుగు పరిశ్రమలో గాయకుడిగా ప్రథమ స్థానం లేదు. హీరోలకు పాడటంలో ఘంటసాల నెంబర్‌వన్‌గా వుంటే హీరోయిన్లకి జిక్కిగానీ, పి.లీల గానీ పాడేవారు. అత్యంత ప్రతిభావంతురాలైన పి.సుశీల అప్పుడే ప్లేబ్యాక్ రంగంలో పైకి వస్తున్నారు.

డ్యూయెట్లు పాడటంలో జిక్కీ ఏ.ఎమ్.రాజాని పెట్టుకోకుండా, జిక్కి స్థానం సుశీలకి మారడంతో జిక్కికీ అవకాశాలు చాలా తగ్గిపోయాయి. జిక్కీ ఆసరాతో తాను పైకి వద్దామని ఒకవేళ ఏ.ఎమ్.రాజా భావించి వుంటే అతని అంచనా తప్పింది. అతను పైకి రావడం మాటెలా వున్నా, జిక్కి కిందకి వెళ్ళిపోవడం జరిగింది.

క్రమంగా జిక్కీ మీద ఆంక్షలు, ఆరడులు ఎక్కువయి పోయాయని చెప్పుకునేవారు. అదీకాక ఆమె పిల్లల్ని కనడం పెంచడం తప్పించుకోలేకపోయారు. అవిధంగా జిక్కి గొంతు చాలామంచి స్థితిలో (Form ) వున్నప్పుడే సినీ సంగీత నేపథ్య గానం నుండి పక్కకి తొలగిపోయారు.

'పెళ్ళికానుక' చిత్రానికి ఏ.ఎమ్.రాజాయే సంగీత దర్శకత్వం వహించినప్పటికీ, అందులో ఒక్కపాట 'పులకించని మది పులకించు' (కృష్ణకుమారి మీద చిత్రించినది) మాత్రమే పాడారు. ఆనాటి వ్యాపార సరళిని బట్టి, కథానాయిక బి.సరోజాదేవికి అన్ని పాటలూ, పి.సుశీలయే పాడారు. అయినప్పటికీ ఆ చిత్రం లో పాటలన్నింటితో బాటుగా జిక్కీ పాడిన పాట సూపర్ హిట్ అయింది. ఆ పాట దానికదే సాటి అన్నంతగా ప్రజాదరణ పొందింది.

'దొంగరాముడు' లాంటి సినిమాలో హీరోయిన్‌కిపాడిన జిక్కీ, ఆతర్వాత అన్నపూర్ణా వారి చిత్రాలలో సైడ్‌హీరోయిన్లకి పాడింది. కొన్ని హాస్యం పాటలూ పాడింది. సుశీల నూటికి నూరు పాళ్ళూ తన ప్రతిభతోనే పరిశ్రమలో నిలబడినప్పటికీ, జిక్కీ పక్కకి వెళ్ళిపోవడం వల్ల, ఎప్పటిప్పుడు తన స్థానం పరిరక్షించుకోవాల్సిన బాధ లేకుండా పోయింది.

జిక్కీ 'చెంచులక్ష్మి'కి ఘంటసాలతో కలిసి డ్యూయెట్లు పాడారు. ఆ తర్వాత రాజా దర్శకత్వంలో 'శోభ' అనే సినిమాకి పూర్తిగా పాడినప్పటికీ ఆ చిత్రం బాగా పోకవడం వల్ల, పాటలు ఆదరణ పొందలేదు.

అదీకాక జిక్కి బాదర బందీలలో చిక్కుకుపోయారు. సంసారమంటేనే హింస, అవమానం, ఆరళ్ళూ అన్నీ వుంటాయి స్త్రీలకి.

"అందరూ కష్టాలు పడతారు. అలాగే నేనూ కష్టాలు పడ్డాను. అత్తగారితో, ఆడబిడ్డలతో-! నాభర్త చెప్పినట్టు విన్నాను. మనం భర్త మాట వినాలి కదా! అంతేగాని మనకంటూ సొంతమేమీ వుండదు కదా" అన్నారు జిక్కీ అమాయకంగా. "పాడమంటే పాడాను. వద్దంటే మానేశాను. ఎప్పుడైనా పాడటానికి వెళ్ళినప్పుడు ఆ సంగీతం వల్ల హాయిగా వుండేది. పాట పాడుతుంటే అన్నీ మర్చిపోయి శాంతిగా అనిపించేది. ఎంతైనా అది సంగీతం కదండీ. దానికా మహత్తు వుంటుంది" అని జిక్కీ చెప్పినప్పుడు గుండె ఝల్లుమంటుంది.

"నాకు అరుగురు పిల్లలు. ఇద్దరబ్బాయిలు. నలుగురు అమ్మాయిలు. వారంతా పెళ్ళిళ్ళయి బాగానే వున్నారు".

"ఇద్దరూ గాయకులై పెళ్ళిచేసుకున్నది మేమే. నేనూ గాయనిని, రాజాగారు గాయకులు. మాది ప్రత్యేకమైన జంట" అంటారు జిక్కీ.

"జిక్కీ ఎప్పుడూ చీర చాలా పైకి కట్టుకునేది. చాలా పైకన్నమాట. అలా బాగలేదు. కాస్త కిందకి పాదాలు కప్పేస్తూ కట్టుకో అంటే - వద్దు. అంచులు మాసిపోతాయి అనేది. అంత అమాయకంగా వుండేది జిక్కీ" అంటూ ఒక పాతతరం నేపథ్యగాయని చెప్పినప్పుడు ఆశ్చర్యం వేస్తుంది.

"అంత డబ్బూ, ఆస్తి సంపాదించినా ఎప్పుడూ సాదా చీరలో పేదరాలుగానే కనిపించేది" అంటారు అతి సన్నిహితులు.

జిక్కీ ఒకసారి రేడియో స్టేషన్‌లో రాజాగారితో వచ్చినప్పుడు అక్కడి వారంతా ఆమెని కుర్చీలో కూర్చోమని ఎన్నిసార్లు చెప్పినా కూర్చోలేదు. చివరికి దూరంగా నిలబడి మాట్లాడుతున్న రాజాని చూపించి "ఆయనక్కడ నిలబడి వుండగా కూర్చోవడమే?" అన్నారు భయంగా..

ఇది గమనించినప్పుడు హింస అంటే ఏమిటో అర్థమవుతుంది. ఇవన్నీ రాజా మరణంతో తెరపడిన సంఘటనలు. తర్వాతామె పిల్లలు ఆమెను జాగ్రత్తగా చూసుకున్నారు. తరచూ, ఆంధ్రావైపు, తమిళనాడులోను, శ్రీలంకలోను జిక్కీ సినిమా పాటల కార్యక్రమాలు చేసేవారు. అప్పుడప్పుడు అమెరికా, లండన్, మలేషియా లాంటి దేశాలు వెళ్ళి అక్కడి తెలుగువారికి పాత పాటలు విందు చేసేవారు.

"అక్కడి వారు పాత పాటలందు చూపిస్తున్న అభిమానం, మోజు నాకెంతో ఆనందాన్ని కలిగిస్తూ వుంటాయి" అంటారామె.

"మీకిప్పుడు అసంతృప్తిగా, ఇంకా పాడగలిగి కూడా పాడలేక పోయాననే అనిపిస్తుందా" అని అడిగితే-

"లేదు. నాకు భగవంతుడిచ్చిన వరం నా కంఠం. నేనెంతో వరకు చెయ్యాలో అంతా చేశాను. నాకెంత వరకు ప్రాప్తమో అంతా నాకు దక్కింది. పేరు ప్రతిష్ఠలొచ్చాయి. డబ్బు వచ్చింది. ఎప్పుడూ నేనే పాడుతూ వుండాలని నేను అనుకోను. కొత్తవారొస్తూ వుంటారు. రావాలి కూడా. వారు పాడాలి. వారికీ పేరూ, డబ్బూ రావాలి. సంతోషంగా, సుఖంగా వుండాలి" అంటారామె.

"నాకున్న పెద్ద ఇల్లు అమ్మేసి, ఆస్తి అదీ అందరి పిల్లలకీ పంచేశాను. మా ఈ రెండో అబ్బాయి ప్రోగ్రాముల్లో మా వారి పాటలు పాడతాడు" అంటూ అరమరికలు లేకుండా మాట్లాడేస్తారామె.

జీవితాన్ని జీవితంగా స్వీకరించి, కష్టాలు అనుభవించి, ఒకప్పుడు నెంబర్ వన్ నేపథ్య గాయనిగా తెలుగు సినిమా పరిశ్రమలో హోదానుఅనుభవించి, ఎంతో గౌరవాన్ని పొంది, చాలా తృప్తిగా, సంతోషంగా నిరాడంబరంగా వున్న జిక్కీని చూస్తే నిర్లిప్తంగా వున్న తపస్వినిగా అనిపిస్తుంది.

ఆనాటి పాటల మాధుర్యాన్ని ఆస్వాదించినవారు ఈనాటికీ ఆమె పాటల్నీ, ఆమెని ప్రేమిస్తూనే వుంటారు. దేవదాసు సినిమాలో సి.ఆర్. సుబ్బురామన్ దగ్గర మీరొక్క యుగళగీతం మాత్రమే పాడారు- మిగిలినవేమీ పాడలేదు. దానికి ప్రత్యేకమైన కారణమేదైనా

వుందా" అని అడిగితే-

"అవును. నేను 'ఓ....దేవదా' అనే డ్యూయెట్ మాత్రమే పాడాను. తర్వాత రాయల్టీ విషయంలో మాకు కుదరక మిగిలిన పాటలేం నేను పాడలేదు. 'ఓ దేవదా', పాటకి ముందు వచ్చే 'హమ్మింగ్' రాణి చేత పాడించి, జాయిన్ చేశారు. రికార్డు మీద నా పేరు కూడా లేదు. కె.రాణి అనే వుంటుంది" అని చెప్పారు జిక్కి.

అస్సలు శాస్త్రీయ సంగీతం నేర్చుకోని జిక్కి, కర్ణాటక శాస్త్రీయ సంగీతం సినిమాల్లో పాడే సందర్భం వస్తే, కేవలం సంగీత దర్శకులు చెప్పిందాన్ని బట్టి నేర్చుకుని పాడిన సందర్భాలు వున్నాయి.

పి.ఆదినారాయణరావుగారు నాచేత 'హాయి హాయిగా ఆమని సాగె' అనే రాగమాలికను ఘంటసాల గారితో పాడించారు. నేను క్లాసికల్ పాడలేనన్నవారు ఆపాట విని ఆశ్చర్యపోయారు. అయితే కొందరు నా చేత 'పాడలేను' అనిపించాలని ప్రయత్నించిన సందర్భాలూ వున్నాయి. కానీ నేను మరింత పట్టుదలగా నేర్చుకుని పాడి, వారి అభిప్రాయం తప్పని నిరూపించాను" అంటారు జిక్కి. "ఇప్పుడు మళ్ళీ పిల్లలతో ప్రోగ్రాములకి వెళ్తున్నాను. ఆ పాటలు పాడుతుంటే ఆ రోజులు గుర్తుకొస్తాయి. బాగానే పాడగలుగుతున్నాను. అప్పటికంటే ఒక అరకట్ట శ్రుతి తగ్గించుకుని పాడుతున్నాను. వయసుంది కదా మరి" అంటారామె -

ఆ మధ్య జిక్కి చేత 'ఆదిత్య 369'లో ఇళయరాజా ఒకపాట పాడించారు. 'జాణవులే -వీర వీణవులే' అనే పాట అందర్నీ ఎంతో ఆకర్షించింది. పాప్యులరయింది.

"ఆ తర్వాత 'ఆరోప్రాణం','నిన్నే పెళ్ళాడుతా', 'ఆహ్వానం', 'అమ్మకొడుకు' లాంటి సినిమాల్లో పాడాను"- అన్నారు జిక్కి.

ఆమె అప్పట్లోనే బొంబాయి దక్షిణాది గాయనుల ప్రతిభను, శక్తి సామర్థ్యాలను చాటి చెప్పారు. శంకర్-జైకిషన్ల సంగీత దర్శకత్వంలో రాజ్‌కపూర్ నిర్మించిన 'ప్రేమలేఖలు' చిత్రంలో నర్గిస్‌కి పాటలన్నీ పూర్తిగా జిక్కియే పాడారు. హిందీలో అవే పాటలు లతా మంగేష్కర్ పాడగా తెలుగులో ఈమె పాడారు. ఊరికే పాడటం కాదు తిరుగులేకుండా పాడారు. ఒక సమయంలో లతాను మించి జిక్కి పాడారని శంకర్ ప్రశంసించారని చెప్పుకున్నారు. ఈ మాట లతాకి తక్కువ కాదు. మన జిక్కికి కితాబుగా తీసుకోవాలి. అలాగే నౌషాద్ సంగీతం చేసిన మొగల్ -ఎ-ఆజామ్ సినిమా తమిళంలోకి డబ్బింగ్ చేసినప్పుడు అందులో కొన్ని పాటలు జిక్కీపాడారు.

జిక్కి తెలుగులోనే కాక తమిళం, కన్నడం, మలయాళం, సింహళం మొదలైన భాషలలో కూడా పాడారు.

జిక్కి గొంతు పలకడంలో శ్రుతి సమస్య లేదు. ఇంత శ్రుతి అయితే పలుకుతుందనే బాధ లేదు. సంగీత దర్శకులు ఎంత శ్రుతి పెట్టినా, ఎలా కావాలంటే అలా పాడేయగల సామర్థ్యం ఆమెకుంది.

శృంగార రస ప్రధానమైనవి - జానపద పద్ధతిలో వున్నవీ, ఎక్కువగా పాడారు. అయినా శాస్త్రీయ బాణీలు,భక్తీ కూడా అవలీలగా పాడి వొప్పించారు.

"నాకు పాడటం వచ్చింది అంటే అది భగవంతుడిచ్చిన వరం. నాదేం లేదు. ఆ దేవుడిచ్చిన కంఠంతో నేను పాడాను. దాన్నెప్పుడూ కాపాడుకుంటూ వుంటాను. ఎప్పుడూ పాడుతునే వుండాలని నా కోరిక" అనేవారు జిక్కి.

సుమారు పదిహేనేళ్ళు నేపథ్య గాయనిగా సంగీతాభిమానులను అలరించిన జిక్కి ఎన్నో గొప్ప పాటలు పాడారు. చరిత్రలో ఆమె స్థానం పదిలం. ■



# జిక్కి హిట్స్

**చిత్రం: అర్థాంగి** — రచన: ఆత్రేయ
**సంగీతం: భీమవరపు నరసింహారావు** — గానం: జిక్కి

ప: వద్దురా కన్నయ్యా
ఈ పొద్దు ఇల్లు వదిలి
పోవద్దురా అయ్యా
పశువులింటికి తిరిగి
పరుగులెత్తే వేళ
పసిపాపలను బూచి
పట్టుకెళ్ళేవేళ ॥వద్దురా॥
చ: పట్టు పీతాంబరము మట్టిపడి మాసేను
పాలుగారే మోము
గాలికే వాడేను ॥వద్దురా॥
చ: గొల్లపిల్లలు చాల అల్లరివారురా
గోలచేసి నీపై కొండెములు చెప్పేరు
ఆడుకోవలెనన్న
ఆదట నేనున్న పాడుకోవలెనన్న
అన్నిటను నీదాన ॥వద్దురా॥

**చిత్రం : పెంకి పెళ్ళాం** — గానం : జిక్కి బృందం
**సంగీతం : ప్రసాదరావు** — రచన : ఆరుద్ర

పడుచుదనం రైలు బండిపోతున్నది-
వయసువాళ్ళకందులో చోటున్నది-
విరహాల నిట్టూర్పులు రాక్షసి బొగ్గు-
ఇంజను త్రాగేనీరు తొలగని సిగ్గు -
కష్టాల స్టేషనులో బండి ఆగదు
బండిలోన విచారాన్ని లుగళబారదు
పడుచుదనం రైలు బండిపోతున్నది-
వయసువాళ్ళకందులో చోటున్నది-
కుర్రకారు పిల్లవాళ్ళు రాకూడదు
ముసలి వాళ్ళు పిసినిగొట్లు రామాడదు
ఇక్కట్టులు లేకుండుట టిక్కట్లండి
చక్కగ నవ్వే వాళ్ళే బండెక్కండి-
పడుచుదనం రైలు బండిపోతున్నది-
వయసువాళ్ళకందులో చోటున్నది-

**చిత్రం :రాజనందిని** — రచన: మల్లాది రామకృష్ణ శాస్త్రి.
**సంగీతం: టి.వి. రాజు** — గానం: జిక్కి, ఎ.ఎం. రాజా

ఆ: అందాలు చిందు సీమలో
ఉందాములే హాయిగా ॥అందాలు॥
ఆ: చూసిన చూపు నీకోసమే
నన్నేలు రాజు నీవే నీవే ॥చూసిన॥
చిన్నారి బాలుడా... ॥అందాలు॥
అ: ఆనంద సీమ ఈ లోకము
ఈ తీరుగానే నీవూ నేనూ ॥ఆనంద॥
ఏలేము హాయిగా ॥అందాలు॥
ఆ: నిలువెల్ల నిండే ఆనందము
అ: నీ మోము గోము నాదే నాదే
నిలువెల్ల నిండే ఆనందము
ఆ: ఔనోయి బాలుడా
ఇ: అందాలు చిందు సీమలో
ఉందాములే హాయిగా

**చిత్రం: అనార్‌కలి** — రచన: సీనియర్ సముద్రాల — సంగీతం: ఆదినారాయణరావు — గానం: జిక్కి

జీవితమే సఫలము ॥జీవితమే॥
ఈ జీవితమే సఫలము
రాగసుధా భరితము
ప్రేమకథా మధురము ॥జీవితమే॥
హాయిగా తీయగా ఆలపించు పాటలా ॥హాయిగా॥
వరాల సోయగాల ప్రియుల వలపు గొలుపు మాటలా॥వరాల॥
అనారు పూల తోటలా ...ఆ...ఆ...
అనారు పూల తోటలా
ఆశ దెలుపు ఆటలా ॥జీవితమే॥
వసంత మధుర సీమలా ప్రశాంత సాంధ్య వేళలా ॥వసంత॥
అంతులేని వింతలా అనంత ప్రేమలీలలా ॥అంతు॥
వరించు భాగ్యశాలులా ...ఆ...ఆ...
వరించు భాగ్యశాలులా
తరించు ప్రేమజీవులా ॥జీవితమే॥

**చిత్రం: శాంతినివాసం రచన: సముద్రాల జూనియర్**
**సంగీతం: ఘంటసాల గానం: జిక్కి**

ఆశలు తీర్చవె ఓ జననీ
ఆదరముంచవె జాలిగొనీ ॥ఆశలు॥
సవతి తల్లి దయమాలినది
తండ్రి మాట ఇటు సాగనిది ॥సవతి॥
పవలూ రేయీ వాపోవుటయే
నా వరమైనది ఈ జగతి ॥ఆశలు॥
శోకమైన నా లోకములో
గోచరించె శుభరేఖలేవో ॥శోక॥
ఈ వెలుగే నా జీవన శోభా
దీవెన సేయవె ప్రేమఖనీ ॥ఆశలు॥

**చిత్రం: అనార్కలి**
**రచన: సీనియర్ సముద్రాల**
**సంగీతం: ఆదినారాయణరావు**
**గానం: ఘంటసాల, జిక్కి**

మదన మనోహర సుందర నారీ
మధుర దర స్మిత నయన చకోరీ
మందగమన జిత రాజమరాళీ
నాట్య మయూరీ.....
అనార్కలీ...అనార్కలీ...అనార్కలీ...
వహ్వా
ఆ..........
రాజశేఖరా నీపై మోజు తీరలేదురా
రాజసాన ఏలరా ॥రాజశేఖరా॥
మనసు నిలువ నీదురా
మమత మాసి పోదురా
మధురమైన బాధరా
మరుపురాదు...ఆ... ॥రాజశేఖరా॥
కానిదాన కానురా
కనులనైన కానరా ॥కాని॥
జాగుసేయ నేలరా
వేగరావదేలరా ॥జాగు॥
చేరరార చేరరార చేరరార

**చిత్రం: చెంచులక్ష్మి రచన: ఆరుద్ర**
**సంగీతం: ఎస్.రాజేశ్వరరావు**
**గానం: ఘంటసాల, జిక్కి**

చిలకా గోరింకా కులికే పకాపకా
నేనే చిలుకైతే నీవే గోరింకా రావా నావంక
చిలకా గోరింకా కులికే పకా పకా
నీవే చిలుకైతే నేనే గోరింకా రావా నావంక
చెలియా నేటికి చెలిమీ ఫలించెనే
కలలూ కన్నట్టి కలిమీ లభించెనే
చెలియా నేటికి చెలిమీ ఫలించెనే
కలలూ కన్నట్టి కలిమీ లభించెనే
మనసే నిజమాయే తనువులు ఒకటాయె
మదిలో తలంపులే తీరె తీయగా
మారే హాయిగా ॥చిలకా॥
కలికి నీవిలా ఎదుటా నిలాబడా
పలుకే బంగారం ఒలికే వయ్యారమే
కలికి నీవిలా ఎదుటా నిలాబడా
పలుకే బంగారం ఒలికే వయ్యారమే
ఒకటే సరాగము ఒకటే పరాచికం
కలసీ విహారమే చేద్దాం హాయిగా
నీవే నేనుగా
చిలకా గోరింకా కులికే పకాపకా
నేనే చిలుకైతే నీవే గోరింకా రావా నావంక

**చిత్రం: ప్రేమలేఖలు రచన: ఆరుద్ర సంగీతం: శంకర్ - జైకిషన్ గానం: జిక్కి**

ఏకాంతము - సాయంత్రము ఎద నీకై వేచెను
చిగురాకుల సడి విన్నను ఏదో దడ రేగేనూ ॥చిగురాకుల॥ ॥ఏకాంతము॥
ఏ దారి ద్వారా - నీ రాకయో ఆ దారి జాడే కనరాదయో
పేరాశలై నా కోర్కెలే - ఈ మంచుగ కరిగేనూ ॥ఏకాంతము॥
ఇన్నాళ్ల ప్రేమ కన్నీరుగ కన్నీరు మారే మున్నీరుగ
నన్నీగతి విడనాడితే - నా హృదయము పగిలేనూ ॥ఏకాంతము॥

**చిత్రం: ఆదిత్య 369 రచన: వేటూరి**
**సంగీతం: ఇళయరాజా గానం: జిక్కి, బాలు, శైలజ**

ప: నెరజాణవులె వర వీణవులే కిలికించితాలలో అహహహో...
జాణవులె మృదుపాణివిలె మధు సంతకాలలో
కన్నులలో సరసపు వెన్నెలలే సన్నలలో గుసగుస తెమ్మెరలే
మోవిగని మొగ్గగని మోజు పడిన వేళలో ॥జాణవులె॥
చ: మోమటుదాచి మురిపెము పెంచే లాహిరిలో
అహహో హహహో... ఓహోహో హోహోహో
మూగవుగానే మురళిని ఊదే వైఖరిలో
చెలి ఒంపులలో హంపి కళ ఊగే ఉయ్యాల
చెలి పైయ్యదలో తుంగ అలా పొంగే ఈ వేళ
మరియాదకు విరిపానుపు సవరించవేమిరా ॥జాణవులె॥
అ: చీకటి కోపం చెలిమికి లాభం కాగిలిలో
అహహో హహహో... ఓహోహో హోహోహో
వెన్నెల తాపం వయసుకు ప్రాణం ఈ చలిలో
చెలి నా రతిలా హారతిలా నవ్వాలీవేళ
తొలి సోయగమే ఓ సగము ఇవ్వాలీవేళ
పరువానికి పగవానికి ఒక న్యాయమింక సాగునా ॥జాణవులే॥

**చిత్రం: శాంతినివాసం రచన: సముద్రాల జూనియర్ సంగీతం: ఘంటసాల గానం: ఘంటసాల, జిక్కి**

అతడు : కమ్ కమ్ కమ్ కంగారు నీకేలనే
నా వంక రావేలనే చెలి నీకింక సిగ్గేలనే
ఆమె : నో నో నో నీ జోరు తగ్గాలిగా
ఆ రోజు రావాలిగా ఇక ఆపైన నీదానగా నో నో నో
అతడు : కోరి ఏనాడు జతచేరి ఎగతాళిగా
చేరువైనాము అనాడే జోడైతిమే ॥కోరి॥
ఆమె : ఇంత స్నేహానికె అంత ఆరాటమా
చాలులే తమరికి ఏల ఈ తొందరా ॥కమ్॥
ఆమె : ఏల ఈ లీల పదిమందిలో పాటలా
పరువు మరియాద లేని ఈ సయ్యాటలా ॥ఏల॥
అతడు : నీవు నా దానవై నేను నీ వాడనై
నీడగా నిలిచినా చాలులే నా చెలి ॥కమ్॥

**చిత్రం: కనకదుర్గ పూజామహిమ రచన: జి.కె.మూర్తి**
**సంగీతం: రాజన్-నాగేంద్ర గానం: పి.బి.శ్రీనివాస్, జిక్కి**

అతడు : అనురాగ సీమ మనమేలుదామ ఆనందాల చవిచూదమా
ఆమె : మేఘాల తేలాడి ఓలాడుదామా మెరిసే ధరణీ మనదే సుమా ॥అనురాగ॥
అతడు : ఎగిరేటి ఎలతేటి రాగాలు మ్రోగే చిగురాకు పూబాలలూగే
ఆమె : తెరవోలె చిరుగాలి పొరాడి సాగె కెరటాలు కోనేట తూగె
అతడు : మధురానుభవమే ఈ జగాన మధుమాసమై నేడు శోభించెనా
ఆమె : ఇలనిండె వలపు ఈ దినాన కలలన్ని కనులార కాంతుమా॥అనురాగ॥
ఆమె : నెలరాజు నేడేల తన రాక మానె
అతడు : నీ మోము తిలకించి తలదించెనే
ఆమె : ఆ... పలికేటి చిలుకేల తన పాటమానె
అతడు : కలకంఠి నీ కంఠ మాలించెనే
ఆమె : ఉలికింది కళలా ఈ లోకమెల్ల
అతడు : పులకించె నిలువెల్ల గిలిగింతలా
ఆమె : మనలోని ప్రేమ
అతడు : ఎనలేని ప్రేమ
ఇద్దరు : మనసార తమితీర సేవింతుమా ॥అనురాగ॥

చిత్రం: సువర్ణసుందరి　　రచన: సముద్రాల రాఘవాచార్య
సంగీతం: ఆదినారాయణరావు　　గానం: ఘంటసాల, జిక్కి

ఆమె : ఆ ఆ ఆ
హాయి హాయిగా ఆమని సాగె ॥హాయి॥
సోయగాల గన హాయీ సఖా హాయి సఖా ॥హాయి॥
అతడు : లీలగా పువులు గాలికి ఊగ ॥3॥
సనిదమదనిస
ఆమె : గమగమదనిస
ఇద్దరూ : రిసని దని/సరిసని/సరిసని
దనిని దనినిదని　మదద మదదమగ
గరిగమదని ॥లీలగా॥
కలిగిన తలపుల వలపులు రేగ ॥కలిగిన॥
ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా ॥హాయి॥
ఆమె : ఏమో... ఏమో తటిల్లతిక మేమరుపు ॥2॥మైమరపేమో
అతడు : మొయిలు రాజు దరి మురిసినదేమో
ఆమె : మైమరపేమో
అతడు : మొయిలు రాజు దరి మురిసినదేమో
ఇద్దరు : వలపు కౌగిసుల వాలిసోలి ॥వలపు॥
ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా ॥హాయి॥
ఆమె : చూడుమా చందమామ　అటు చూడుమా చందమామ
అతడు : కనుమా వయ్యారి శారద యామిని కవ్వించె
ప్రేమా చూడుమా చందమామ
ఆమె : వగల తూలె విరహిణుల ॥వగల॥
అతడు : మనసున మోహము రేపునదవురా ॥మనసు॥
ఇద్దరూ : ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా... ఆ... ॥హాయి॥
అతడు : ఆ...
కనుగవా తనియగా ప్రియతమా కలువలు విరిసెనుగా ॥కను॥
ఆమె : చెలువము కనుగొనా ॥2॥
మనసానంద నాట్యాలు చేయునోయి
ఆనంద నాట్యాలు చేయునోయి
ఇద్దరు : నిరిగమదనిస దనిస
సనిసగరిగ సరినిసదని మదనిస నిరినిరి
దనిదని మదమద గమగమ గమదనిస గమదనిస దనిసా

చిత్రం: శ్రీ కృష్ణపాండవీయం　　రచన: సి.నారాయణ రెడ్డి
సంగీతం: టీవీ రాజు　　గానం: జిక్కి

ఛాంగురే బంగారు రాజా
ఛాంగు ఛాంగురే బంగారు రాజా
మజ్జారే మగరేడా మత్తైన వగకాడ
అయ్యారే...అయ్యారే
నీకే మనసియ్యాలని వుందిరా...ఛాంగురే... ॥ఛాంగురే॥
ముచ్చటైన మొలక మీసముంది
భళా అచ్చమైన సింగపు నడుముంది
జిగిబిగి మేనుంది
సొగసులొలుకు మోముంది
మేటి దొరవు అమ్మక చెల్లా
నీ సాటి ఎవ్వరుండుట కల్లా...ఛాంగురే... ॥ఛాంగురే॥
కైపున్న మచ్చె కంటి చూపు
అది చూపుకాదు పచ్చల పిడిబాకు
పచ్చల పిడిబాకో విచ్చిన పువు రేకో
గుచ్చుకుంటె తెలుస్తుందిరా
మనసిచ్చుకుంటె తెలుస్తుందిరా...ఛాంగురే... ॥ఛాంగురే॥
గుబులు కొన్న కోడె వయసు లెస్సా
దాని గుబాళింపు ఇంకా హైలెస్సా
పడుచుదనపు గిలిగింత
గడుసు వయసు పులకింత
ఉండనియ్యదేమి సేతురా
కైదండ లేక నిలువలేనురా...ఛాంగురే ॥ఛాంగురే॥

చిత్రం: వీరకంకణం　　రచన: ఆరుద్ర
సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి　　గానం: ఘంటసాల, జిక్కి

ఆమె : తేలి తేలి నా మనసు
తెలియకనే నావ వలె
ఊగుచున్నదే ॥తేలి॥
అతడు : అలలు లేచి ప్రేయసీ
హాయియని పాటవిని
తాళం వేయునే ॥అలలు॥
ఆమె : ప్రేమ ముందు కొండ కూడ
చిన్నదైనదో ॥ప్రేమ॥
అతడు : కొండవంటి గుండెనీవు
తెలియలేవులే ॥కొండ॥
ఆమె : తేటనీరు వంటి మంచి
ప్రేమ ఇదేనోయ్... ॥తేట॥
అతడు : నలుసులెన్ని ఉన్నవో
తెలుసుకోగదే
ఆమె : ఇంత వింత మాటలాడ
ఎవరు నేర్పిరో ॥ఇంత॥
ఆమె : నీదు ఓర చూపులోన నేర్చుకుంటినే
ఇద్దరు : సాగారాన ఆగకనే
ప్రేమయనె పెన్నిధికై సాగిపోదమా ॥సాగ॥

చిత్రం: చెంచులక్ష్మి　　రచన: ఆరుద్ర
సంగీతం: ఎస్.రాజేశ్వరరావు　　గానం: ఘంటసాల, జిక్కి

చెట్టులెక్కగలవా ఓ నరహరి
పుట్టలెక్కగలవా
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మల
చిగురు కోయగలవా
ఓ నరహరి చిగురు కోయగలవా
చెట్టులెక్కగలనే ఓ చెంచిత
పుట్టలెక్కగలనే
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మల
చిగురు కోయగలనే ఓ చెంచిత
చిగురు కోయగలనే
ఉరకలేయగలవా ఓ నరహరి
పరుగులెత్తగలవా ॥ఉరక॥
ఊడ పట్టుకుని జారుడు బండకు
ఊగి చేరగలవా ఓ నరహరి
ఊగి చేరగలవా
ఉరకలేయగలనే ఓ చెంచిత
పరుగులెత్తగలనే ॥ఉరక॥
ఊడపట్టుకుని జారుడు బండకు
ఊగి చేరగలనే ఓ చెంచిత
ఊగి చేరగలనే
గురిని చూసుకొని కనులు మూసుకొని
బాణమేయ గలవా ఓ నరహరి
బాణమేయగలవా
గురిని చూసి వెనుదిరిగి నాణెముగ
బాణమేయగలనే ఓ చెంచిత
బాణమేయగలనే ఓ చెంచిత
నిన్ను మించగలనే ॥చెట్టు॥
తగువులేల ఎగతాళికాదు
నను తాళికట్టనీవా ఓ చెంచిత
తాళి కట్టనీవా
మనసు తెలుసుకొని మరులు చూపితే
మనువునాడనిస్తా ఓ నరహరి
మనువునాడనిస్తా ఓ నరహరి
మాల తెచ్చి వేస్తా ॥చెట్టు॥

**చిత్రం: దొంగరాముడు**
**రచన: సముద్రాల రాఘవాచార్యులు**
**సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు**
**గానం: జిక్కి**

రారోయి మా ఇంటికి - మావో
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
నువ్వునించుంటె నిమ్మచెట్టు నీడున్నది
నువ్వు కూసుంటె కురిసీల సీటున్నది
నువ్వు తొంగుంటె పట్టెమంచం పరుపున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
ఆకలైతే సన్నబియ్యం కూడున్నది
నీకాకలైతే సన్నబియ్యం కూడున్నది
అందులోకి అరకోడి కూరున్నది
ఆపైన రొయ్యపొట్టు చారున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥
రంజైన మీగడ పెరుగున్నది
నంజుకోను ఆవకాయ ముక్కున్నది
నీకు రోగమొస్తే ఘాటైన మందున్నది (2)
నిన్ను సాగనంప వల్లకాటి దిబ్బున్నది
మాటున్నది - మంచి మాటున్నది ॥రారోయి॥

**చిత్రం: రోజులు మారాయి రచన: కొసరాజు సంగీతం: మాస్టర్ వేణు గానం: జిక్కి**

కల్లా కపటం కాననివాడ లోకం పోకడ తెలియనివాడ
ఏరువాక సాగారోరన్నో- చిన్నన్న
చ:1. నవధాన్యాలను గంపకెత్తుకుని
చద్ది అన్నమూ మూట గట్టుకుని (2)
ముల్లుగర్రను చేతబట్టుకుని ఇల్లాలును నీవెంటబెట్టుకుని ॥ఏరువాక॥
చ:2. పటమట దిక్కున వరద గుడేసి
ఉరుముల మెరుపుల వానలు కురిసె(2)
వాగులు వంకలు ఉరవడి జేసే ఎండిన బీళ్ళు ఇగుళ్ళు వేసే ॥ఏరువాక॥
చ:3. కోటేరును సరిజూసి ఎన్నుకో ఎలపట దాపట ఎడ్ల దోలుకో
పాలుదప్పక కొండ్ర దున్నుకో విత్తనమ్ములిసిరిసిరి చల్లుకో ॥ఏరువాక॥
చ:4. పొలాలమ్ముకుని పోయేవారు టౌనులో మేడలు కట్టేవారు
బ్యాంకులో డబ్బులు దాచేవారు నీ శక్తిని గమనించరు వారు ॥ఏరువాక॥
చ:5 పల్లెటూళ్ళలో చెల్లనివాళ్ళు పాలిటిక్సుతో బ్రతికేవాళ్ళు
ప్రజాసేవయని అరచేవాళ్ళు ॥ప్రజా॥
ఒళ్ళు వంచి చాకిరికి మళ్ళరు ॥ఏరువాక॥
పదవులు స్థిరమని భ్రమిస్తే వాళ్ళే
నీవే దిక్కని వత్తురు పదవోయ్(2)
ఓట్లు గుంజి నిను మరచేవాళ్ళే
రోజులు మారాయ్ రోజులు మారాయ్
మారాయ్ మారాయ్ మారాయ్ రోజులు మారాయ్ ॥ఏరువాక॥

**చిత్రం: ప్రేమలేఖలు రచన: ఆరుద్ర సంగీతం: శంకర్ - జైకిషన్ గానం: జిక్కి**

పందిట్లో పెళ్లవుతున్నది -
కనువిందవుతున్నదీ
నటనమే ఆడెదను...ఓ...
నటనమే ఆడెదను... ॥పందిట్లో॥
పెండ్లి కుమార్తెకు పూజాఫలము
చేతికందేను...ఆ...చేతికందేను
గోరింటాకు కోయగ బోతే -
గోళ్లు కందేను నా గోళ్లు కందేను
కోరికలు తీరుచున్నవి -
అవి పేరుచున్నవీ -
నటనమే ఆడెదను...ఓ...
నటనమే ఆడెదను ॥పందిట్లో॥
వధువూ వరుడూ పల్లకిలోన
పరదేశ మేగెదరూ...ఆ...
వధువూ వరుడూ పల్లకిలోన
పరదేశ మేగెదరూ...ఆ...
వారిని తలచి బంధువులంతా
సతతము వగచెదరూ
సతతము వగచెదరూ
కన్నీరే కురియుచున్నది -
మది తరుగుచున్నది
ఒంటరిగా ఆడెదనూ...ఓ...
ఒంటరిగా ఆడెదనూ
పందిట్లో పెళ్లవుతున్నది -
కనువిందవుతున్నదీ
ఒంటరిగా ఆడెదనూ...ఆ...
ఒంటరిగా ఆడెదనూ
పందిట్లో పెళ్లవుతున్నది -
కనువిందవుతున్నదీ
నటనమే ఆడెదను...ఓ... నటనమే ఆడెదను...

**చిత్రం: సీతారామయ్య గారి మనవరాలు రచన: వేటూరి సంగీతం: ఎం.ఎం.కీరవాణి గానం: చిత్ర, జిక్కి బృందం**

వెలుగు రేకల వారు తెలవారి వచ్చి
ఎండా ముద్దులు పెట్టంగా
చిలకా ముక్కుల వారు చీకటితోనే వచ్చి
చిగురు తోరణ కట్టంగా
మనవలనెత్తే తాత మనువాడ వచ్చాడు
మందార పువ్వంటి మా బామ్మని... అమ్మమ్మని...
నోమినమ్మన్నాలో నోమన్నలాలో సందమామా సందమామ
నోచే వారింటిలోన పూచే పున్నాలబంతి
సందమామా సందమామా....
పండంటి ముత్తైదు సందమామా...
పసుపు బొట్టంత మా తాత సందమామా... ॥నోమి॥
పూచిన చెవికే చేతి కురులపై
తుమ్మెదలాడే ఓ లాలా... తుమ్మెదలాడే ఓ లాలా
కుందిని దంచే నాతి దరువుకే
గాజులు పాడే ఓ లాలా... గాజులు పాడే ఓ లాలా
గంధం పూసే మెడలో తాళిని
కట్టేదెవరే ఇల్లాలా... కట్టేదెవరే ఇల్లాలా
మెట్టినింటిలో మట్టెల పాదం తొక్కిన ఘనుడే ఇల్లాలా
ఏ లాలో ఏ లాలా... ఏ లాలో ఏ లాలా
దివిటీల నుక్కల్లో దివినేలు మామా
సందమామా... సందమామా
గగనాల రథమెక్కి దిగివచ్చి దీవించు సందమామా సందమామా
నోమినమ్మన్నాలో నోమన్నలాలో సందమామా సందమామ
నోచే వారింటిలోన పూచే పున్నాల బంతి సందమామా సందమామా
ఆ పైన ఏముంది ఆ మూల గదిలోన
ఆరు తరముల నాటి ఓ పట్టెమంచం
తొలి రాత్రి మలి రాత్రి తొంగళ్ళ రాత్రి
ఆ మంచమే పెంచె నీ తాత వంశం
అరవై ఏళ్ళ పెళ్ళి అరుదైన పెళ్ళి
మరువరాని పెళ్ళి మరుడింటి పెళ్ళి
ఇరవై ఏళ్ళ వాడు మీ రాముడైతే
పదహారేళ్ళ పడుచు మా జానకమ్మ
నిండా నూరేళ్ళంట ముత్తైదు జన్మ
పసుపు కుంకుమ కలిపి చేశాడు బ్రహ్మ
ఆనందమానందమాయెనే
మా తాతయ్య పెళ్ళి కొడుకాయెనే
ఆనందమానంద మాయెనే
మా నానమ్మ పెళ్ళి కూతురాయెనే




'ఇల్లరికం' చిత్రాన్ని తీసి చక్కటి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారు తమ తదుపరియత్నంగా నాగేశ్వరరావు, కృష్ణకుమారి హీరో, హీరోయిన్లుగా తీసిన చిత్రం

# భార్యాభర్తలు

ఈ చిత్రం 1961లో విడుదలయింది. అతివాద కమ్యూనిస్టుగా పేరుపొంది, అండర్ గ్రౌండ్‌లో గడిపి, అక్కడే వివాహం చేసుకున్న తరువాత ఆ జీవితానికి స్వస్తి చెప్పి కొన్నాళ్ళ పాటు 'జ్వాల' పత్రికకు సంపాదక బాధ్యతలు నిర్వహించి, దర్శకుడు తాతినేని ప్రకాశరావు ఆహ్వానం మేరకు 'నిరుపేదలు' చిత్రానికి కథకుడిగా సినీరంగంలో అడుగుపెట్టిన కె.ప్రత్యగాత్మ ఈ 'భార్యాభర్తలు' చిత్రంతో దర్శకునిగా పరిచయమయ్యారు. 'నిరుపేదలు' చిత్రం తర్వాత 'మా యింటి మహాలక్ష్మి' చిత్రానికి కూడా కథను సమకూర్చిన ప్రత్యగాత్మ 'జయం మనదే', 'ఇల్లరికం' చిత్రాలకు తాతినేని ప్రకాశరావు వద్ద సహాయ, సహకార దర్శకుని హోదాలో పనిచేశారు. అప్పటికే తాతినేని ప్రకాశరావు హిందీ సినిమాలతో బిజీ అవుతుండడం, 'ఇల్లరికం' చిత్రంలో అన్ని బాధ్యతలనూ నెత్తిన వేసుకుని ప్రత్యగాత్మ పని చేసిన తీరు ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఎ.వి. సుబ్బారావుకు నచ్చటంతో తాతినేని ప్రకాశరావు సూచన మేరకు తమ తర్వాతి చిత్రానికి దర్శకునిగా ప్రత్యగాత్మను ప్రకటించారాయన. స్వతహాగా కథకుడు, సంపాదకునిగా కథలోని అయువుపట్లను గ్రహించగలినవాడు అయిన ప్రత్యగాత్మను 'హిందు' దినపత్రికలో వచ్చిన ఓ పుస్తక సమీక్ష ఆకర్షించింది. జెమినీ సంస్థ నడిపిన 'ఆనంద వికటన్' పత్రికలో డాక్టర్ కె.త్రిపురసుందరి(లక్ష్మి) రాసిన 'పెన్‌మణమ్' అనే తమిళ సీరియల్‌లో పెళ్ళయిన తొలిరోజు రాత్రి భార్యాభర్తల మధ్య జరిగిన ఓ సంఘటనను అద్భుతంగా మలచిన ఘట్టాన్ని ప్రశంసిస్తూ రాశారా రివ్యూలో.

పిఏపి ఆఫీసులో ఉండే కృష్ణస్వామిని పంపించి పుస్తకంగా వచ్చిన ఆ సీరియల్ని తమిళం, ఇంగ్లీషు రెండూ తెలిసిన గోపాలకృష్ణ అనే ఓ రైల్వే ఉద్యోగితో మొత్తం నవలను రాయించుకుని ఆ తరువాత ఆ ఇంగ్లీష్ వెర్షన్‌ని తిరిగి తెలుగులో తన బావమరిది ప్రసాద్ ద్వారా రాయించుకుని దానికి సినిమా ట్రీట్‌మెంట్‌ఇచ్చి పి.ఎ.పి.సుబ్బారావు గారి ముందుంచి ఆ తర్వాత హక్కుల్ని కొనిపించారు ప్రత్యగాత్మ. అందరూ 'కొత్త తరహాగా ఉందీ కథ' అని అనుకున్నారు. హీరోది నెగెటివ్ రోల్ అంటూ పెదవి విరిచారు. విజయా వారి చక్రపాణి వంటి అనుభవజ్ఞులు సైతం 'ఫస్ట్ పిక్చరే ఇలాంటింది పెట్టుకున్నావేంటయ్యా?'అంటూ మందలించారు కూడా.

అయినా హిట్ అవుతుందనే నమ్మకాన్ని యూనిట్‌లో అందరికీ కలిగించారు ప్రత్యగాత్మ. అనుకున్నట్టుగానే విడుదల అయిన తర్వాత సంచలనం రేపిందా చిత్రం. సుమారు 24 వారాల పాటు నడిచి జాతీయ స్థాయిలో ఉత్తమ ప్రాంతీయ చిత్రంగా వెండి పతకాన్ని పొందింది కూడా. నిరుత్సాహ పరిచిన చక్రపాణిగారే స్వయంగా అక్కినేనికి ఫోన్ చేసి అభినందిచారు. తమ పత్రికలో వచ్చిన సీరియల్‌తో ఇంత మంచి సినిమాని తియ్యొచ్చన్న ఆలోచనను ఇవ్వనందుకు తన స్టోరీ డిపార్ట్‌మెంట్‌ని జెమినీ వాసన్ మెత్తగా చివాట్లేసారు కూడా. బహుముఖ ప్రజ్ఞాశాలి భానుమతి "మా భరణి సంస్థకు ప్రత్యగాత్మ ఓ సినిమా అయినా తియ్యాలి లేదా ఆయన దర్శకత్వంలో నేను ఒక్కసినిమాలో నైనా నటించాలి" అని తెలిసిన వాళ్ళ దగ్గర అన్నారట. అంతగా అందర్నీ ఆకట్టుకున్న ఆ 'భార్యాభర్తలు' చిత్రానికి మాటలు శ్రీశ్రీ, పిచ్చేశ్వరరావు రాయగా నాలుగు పాటలను ఒక పద్యాన్ని శ్రీ శ్రీ, రెండు పాటలను కొసరాజు ఒక పాటను ఆరుద్ర రాశారు. అన్నిటినీ హిట్ చేసారు సంగీత దర్శకుడు ఎస్.రాజేశ్వరరావు. ఇప్పటికీ వసివాడని ఆ గీతాలలో ఈ సంచికలో కొన్ని...

జోరుగా హుషారుగా షికారు పోదమా
హాయి హాయిగా తీయ తీయగా..... ॥జోరుగా॥
ఓ.....బాల నీ వయారమెంచి మరులు కొంటినే
చాల ప్రేమ పాఠములను చదువుకుంటినే......ఓ ఓ ఓ
బాల నీ వయారమెంచి మరులు కొంటినే
చాల ప్రేమ పాఠములను చదువుకుంటినే
మరువనంటినే మరువనంటినే ...ఓ ఓ ఓ ॥జోరుగా॥
నీ వన్నె చిన్నెలన్ని చూసి వలచి నాడనే
వయసు సొగసు తలచి తలచి మురిసి నాడనే... ఓ ఓ ఓ
వన్నె చిన్నెలన్ని చూసి వలచి నాడనే
వయసు సొగసు తలచి తలచి మురిసి నాడనే
కలిసి రాగదే కలిసి రాగదే ఓ ఓ ఓ ॥జోరుగా॥
నా...కలల లోన చెలియ నిన్నె పిలచినాడనే
కనులు తెరిచి ఎదుట నిన్నె కాంచినాడనే ఓ ఓ ఓ
కలల లోన చెలియ నిన్నె పిలచినాడనే
కనులు తెరిచి ఎదుట నిన్నె కాంచినాడనే
వరించినాడనే వరించినాడనే ఓ ఓ ఓ ॥జోరుగా॥



ఈ పాటను శ్రీశ్రీ రాయగా ఘంటసాల ఆలపించారు. అక్కినేని నాగేశ్వరరావు ఈ పాటను గిరిజ, రాజేశ్వరి (నటి శ్రీదేవి తల్లి), జయంతి (అప్పట్లో ఆమె పేరు కమల కుమారి)తో కలిసి అభినయించారు. ఈ పాట ఎంతగా హిట్ అయిందంటే - ఎవరైనా కారులో కులాసాగా వెళుతున్నట్టు కనిపిస్తే 'జోరుగా హుషారుగా లెవల్లో ఎలా వెళుతున్నాడో చూడు' అంటూ చెప్పుకోవడం పరిపాటి అయిందా రోజుల్లో. శంకరాభరణ రాగంలోని స్వరాలతో -ప్రత్యేకంగా ఓ రాగాని కంటూ కట్టుబడకుండా-కేవలం మనోధర్మంతో పాశ్చాత్యాగీతాల ధోరణిలో ఎస్. రాజేశ్వరరావు స్వరపరిచిన ఈ గీతంలోని పల్లవిలో గల 'తీయ తీయగా' అనే మాటని ఫ్లాట్‌గా కూడా పాడొచ్చు. కానీ సహజంగా చక్కటి గమకాలు పలికే ఘంటసాల గళం - అక్కడ వేసిన గమకం అతి చిన్నదైనా-లోతుగా పరిశీలిస్తే -కేవలం శాస్త్రీయ సంగీత ధోరణిలో పాడడానికి అలవాటు పడినవారికి మాత్రమే అలా అలవోకగా పడే గమకం ఇది-అని అనిపిస్తుంది. ఇక సాహిత్య పరంగా చూసుకుంటే-'కలసి రాగదే'వంటి ప్రయోగం శ్రీ శ్రీ గనుకే చెల్లింది, అటువంటి వాటికిపుడు కాలం చెల్లింది- అంటూనిట్టూర్చడమే మిగులుతుంది.

ఆ: జో జో జో జో జో
చూచి చూచి కళ్ళు కాయలే కాచాయి
చూచి చూచి కళ్ళు కాయలే కాచాయి
చుక్కలా నీ తండ్రి ఊడి పడ్డాడు
చక్కని నా బాబు జో జో
చల్లని నా తండ్రి జో జో
అ: రెక్కలు కట్టుకొని రివ్వునా వాలాను
రెక్కలు కట్టుకొని రివ్వునా వాలాను
రేయింబగళ్ళు నిను తలచుకుకొని మురిశాను
మురిపాల మొలకవూ జో జో
ముద్దులూరించేవు జో జో ॥చూచి చూచి॥
ఆ: కాకితో ఒకసారి కబురంపినావని ॥2॥
కలలోన నిను చాల కలవరించాను
అ: కాశీకి పోయినా గంగలో మునిగినా
నిను మరువకున్నాను జో జో
నిలువలేకున్నాను జో జో ॥చూచి చూచి॥
ఆ: ఏ ఊళ్ళు తిరిగావు ఏమేమి చేశావు ॥2॥
ఎవరితో సరదాలు తీర్చుకొచ్చావు
అ: ఇంత చక్కని రంభ ఇంటిలో ఉండగా
ఇతరులతో పనియేమి జో జో
ఇది మంచి సమయము జో జో
ఇది మంచి సమయము జో జో
ఇది మాంఛి సమయము జో జో



ఈ పాటను కొసరాజు వ్రాయగా ఘంటసాల, జిక్కి ఆలపించారు. రేలంగి,సూర్యకాంతం-సినిమాలో వారిద్దరికీ సంతానంగా నటించిన పిల్లలు-అభినయించారు. సాహిత్యం, గానం, అభినయం సమతూకంలో పండిన గీతమిది. హాస్యం కోసం అంటూ కొన్ని పాత్రల్ని, వారి కోసం అర్థం పర్థం లేని కామెడీ ట్రాక్‌ల్ని సృష్టించే రోజులు కావవి. కథలోని పాత్రల ద్వారా అవసరమైన మేరకు ఆయా పాత్రల స్వభావాలు మనస్తత్వాలు కలబోసి అల్లుకునే సన్నివేశాల నుంచే హాస్యం ప్రతిఫలించేది. అందుకు వారిపై చిత్రీకరించే పాటలు సహకరించేవి. అందుకే ఆనాటి హాస్య గీతాల స్థాయి ఈనాటి కొన్ని యుగళగీతాల స్థాయిని మించి ఉందని అంటే ఆ మాటలో నొచ్చుకోవలసిన నిష్ఠురముందో తెలుసుకోవలసిన నిజముందో...ఎవరికి

వారే - వారి వారి సంస్కారాలను బట్టి గ్రహించుకోవలసి ఉంటుంది. కథ ప్రకారం భార్య (సూర్యకాంతం)ని చూస్తే నిగ్రహించుకోలేని భర్త (రేలంగి) - వరసగా పిల్లలు పుట్టుకొస్తుండడంతో ఏళ్ళ తరబడి తీర్థయాత్రలు చేసి ఇంటికి తిరిగి వచ్చిన రోజు రాత్రి పాడే సందర్భం అది. అన్ని సంవత్సరాల తరువాత వచ్చిన మొగుణ్ణి 'ఎవరితో సరదాలు తీర్చుకొచ్చావు? అని భార్య నిలదీస్తుంటే 'ఇంత చక్కని రంభ ఇంటిలో ఉండగా ఇతరులతో పనియేమి జో....జో..'అంటూ చమత్కారంగా సర్దేయడానికి కారణం 'కాశికి పోయినా గంగలో మునిగినా నిను మరువకున్నాను, నిలువలేకున్నాను' లాంటి మనస్తత్వమేనని తెరపై రేలంగికి సూర్యకాంతానికి అన్వయించుకుంటూ రాసిన కొసరాజు సమయస్ఫూర్తికి, రసమయస్ఫూర్తికి మురిసిపోకుండా ఉండడం కష్టం. అందుకు తగ్గట్టే ఘంటసాల తన గళంలో హాస్య రసపు జిలుగుల్ని చిలికిస్తూ పాడటం ఒక ఎత్తు అయితే-'చూసి చూసి' అంటూ వ్యవహారికంలో కాకుండా 'చూచి చూచి' అంటూ శిష్ట వ్యవహారికంలో జిక్కి పాడిన పద్ధతి మరో ఎత్తు. ఈ పాటను ఇప్పుడు చూసే సౌలభ్యం ఉంటే 'కలలోని నిను చాల కలవరించాను' అంటూ జిక్కి పాడుతుంటే సూర్యకాంతం 'కలలోన నినుచాల కలువరించాను' అంటూ లిప్ మూమెంట్ ఇవ్వడం గమనించవచ్చు. ట్యూన్ పరంగా చూసుకుంటే 'సరిగ పదస ' స్వరాలు పడే మోహనరాగానికి 'ని'అనే స్వరాన్ని చేరుస్తూ రాజేశ్వరరావు ఎన్ని రకాల పాటలు చేశారో లెక్కలేదు. ఆ ప్రయోగాలలో మరిచిపోలేని మరో మధుర గీతమిది.

ఈ రెండు పాటలకు సంబంధించి మరో విషయం ఉంది. ఆరోజుల్లో 78 ఆర్.పి.యమ్. రికార్డులుగా రిలీజ్ అయినప్పుడు 'జోరుగా హుషారుగా' పాటలో విజిల్ ద్వారా ఆ పల్లవి ట్యూన్, ఆ తరువాత కారు హారన్ ఉంటుంది. కానీ సినిమాలో గల పాటలో గాని, తరువాత క్యాసెట్స్‌గా వచ్చిన పాటలో గాని అవేవి ఉండవు. వీటిల్లో ఉండే ఇంటర్లూడ్స్ వేరేగా ఉంటాయి. అలాగే 'చూచి చూచి' పాట చివర్లో ఘంటసాల' ఇది మంచి సమయము జో...జో...' అని మూడు సార్లు అంటూ చివర్లో ఛమక్కు కోసం 'ఇది మాంచి సమయము జో...జో...'అని ఎక్స్‌ప్రెసివ్‌గా అంటారు. సినిమాలో మాత్రం ఒకసారి ఆనడంతోనే సీను ముగిసిపోతుంది.

**విరటుని రాణివాసమున**
**వెల్గెడి భారతశక్తి ద్రౌపదిన్**
**మొరటుదనాన కీచకుడు**
**మోహపిశాచ వశంవదాత్ముడై**
**యరసి చెలీ యటంచు**
**పలుకాడగ పోయెనో లేదో అంతలో**
**స్ఫురదరుణాక్షులన్ కినుక జూపుచు**
**మాలిని వాని కిట్లనెన్**



ఇదిలా ఉండగా-ఈ చిత్రంలోనే 'విరటుని రాణివాసమున' అనే పద్యం ఒకటుంది. దాన్ని శ్రీశ్రీ రాశారు. కార్లో వెళుతూ ప్రొడక్షన్ ఆఫీస్ సమీపిస్తుండగా సన్నివేశాన్ని శ్రీశ్రీకి చెప్పారు దర్శకుడు ప్రత్యగాత్మ. కారు దిగి ఆఫీస్ తాళాలు తీసి తలుపులు తెరిచే లోగా తన దగ్గరున్న సిగిరెట్ ప్యాకెట్‌ను చింపి వెనుక వైపు మొత్తం పద్యాన్ని రాసి చూపించారు శ్రీశ్రీ. ఆ సెంటిమెంట్‌తో తరువాత ప్రత్యగాత్మ దర్శకత్వంలో వచ్చిన 'కులగోత్రాలు', 'చిలకా-గోరింక' వంటి సాంఘిక చిత్రాల్లో శ్రీశ్రీ పద్యాలు రాయవలసి వచ్చింది.

**'జోరుగా హుషారుగా' పాటలోనూ ఆ తరువాత ఒక సన్నివేశంలోనూ అక్కినేని నాగేశ్వరరావుతో నటించిన రాజేశ్వరి (నటి శ్రీదేవి తల్లి) ఈమెయే.**



**మిగిలిన పాటల గురించి వచ్చే సంచికలో...**

కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

# సరిగపదమని

## జిక్కి స్పెషల్



26

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ● | 3 | 4 | | 5 | |
| ● | | ● | 6 | ● | | ● | | ● |
| 7 | ● | ● | ● | ● | | ● | ● | 8 |
| 9 | | | | ● | ● | 10 | | |
| | ● | ● | ● | 11 | ● | | ● | ● |
| ● | ● | 12 | | | ● | ● | 13 | |
| 14 | ● | | ● | 15 | | ● | | ● |
| 16 | | ● | ● | | ● | ● | | ● |
| | ● | 17 | | ● | 18 | | ● | 19 |

అడ్డం:

1. 'ఓ ఓ...... 'దేవదాసులో జిక్కి పాడిన ఏకైక గీతం (3)
3. 'కట్టండి .......... పట్టండి ధర్మఖడ్గమే' ఏ.ఎమ్.రాజాతో పాడిన గీతమిది (5)
6. '....పేరు విన్నా ....రూపు కన్నా' 'ప్రేమలేఖలు' లో పాట (1)
9. 'చెట్టులెక్కగలవా ఓ........ పుట్టలెక్కగలవా' చెంచులక్ష్మి చిత్రంలోని గీతం (4)
10. '........ మా ఇంటికి' దొంగరాముడులో పాట (3)
12. 'ఛాంగురే.......... రాజా ఛాంగు ఛాంగురే....... రాజా'(3)
13. '........రా కన్నయ్యా ఈపొద్దు ఇల్లు వదిలి పోవద్దురా అయ్యా'(2)
15. 'కొమ్ములు తిరిగిన మగ...... కొంగు తగిలితే పోలేరు' భట్టివిక్రమార్క చిత్రంలోని గీతం (2)
16.' ........ ........ వచ్చావు చందమామా' అర్ధాంగి చిత్రంలోని పాట (2)
17. 'పులకించని .... పులకించు'(2)
18. '...... ........ విన్నావా చిన్నికృష్ణుడు వచ్చాడు' ఇలవేలుపు చిత్రంలోని గీతం (2)
19. 'తేలి తేలి ..... మనసు తెలియకనె నావ వలే ఊగుచున్నదే' (1)

నిలువు:

2.' నెరజాణవులే ......వీణవులే' ఆదిత్య 369 చిత్రంలోని గీతం (2)
4. 'కులాసా రాదోయ్ .......... మజాకా కాదోయ్ వలపంటే' అన్నపూర్ణ చిత్రంలోని పాట (3)
5. '..... ..... ...... కంగారు నీకేలనే' శాంతి నివాసం చిత్రంలోని పాట (2)
7. 'కళ్ళు తెరచి ....... సత్యం ఒళ్ళు మరచి వినరా' రాజు-పేద చిత్రంలోని గీతం (3)
8. '........ ........గా ఆమని సాగె' సువర్ణసుందరి చిత్రంలోని గీతం (2)
10. '.......శేఖరా నీపై మోజు తీరలేదురా' (2)
11. '..........సాగారోరన్నో చిన్నన్న' రోజులు మారాయి చిత్రంలోని గీతం (4)
12. 'పడుచుదనం రైలు..... పోతున్నది వయసువాళ్ళకందులో చోటున్నదీ' పెంకిపెళ్ళాం చిత్రంలోని పాట (2)
13. 'వగలోయ్...... తలుకుబెలుకు ......' పాతాళభైరవి చిత్రంలోని పాట (3)
14. 'హాయిగా తీయగా ఆలపించు పాటలా .......సోయగాల ప్రియుల వలపు గొలుపు మాటలా' (జీవితమే సఫలము)(3)

పంపినవారి పేరు :..................................................

వయసు:.......... వృత్తి :..................................................

చిరునామా :..................................................

..................................................

..................................................ఫోన్:..................................................

**పజిల్, కూపన్ 15-09-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

### నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగమపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

This feature is sponsored by :

SOHAN MUSIC

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)




రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## రాజమండ్రి

'అప్పిచ్చువాడు వైద్యుడు' అన్నాడు సుమతీశతకకారుడు. అయితే సమావేశానికి తమ హాలుని అరువిచ్చి ఎస్.ఆర్.హాస్పిటల్స్ డా॥కృష్ణగారు 'అరువిచ్చువాడు కూడా వైద్యుడే' అని ఋజువు చేశారు' అంటూ ఆగస్టు 15 న జరిగిన కార్యక్రమం ప్రారంభించారు సభానిర్వాహకులు హనుమంతరావు. ఘంటసాల పాడిన వివిధగీతాలతో ఆయనకు నివాళులర్పిస్తూ 'హాసం' ఎడిటర్ రాజా వ్రాసిన వ్యాసాన్ని చదువుతూ ఆ యా పాటల మాధుర్యాన్ని చవిచూపారు జిత్‌మోహన్ మిత్ర!

ఆగస్టులో పుట్టిన పద్మనాభం, ఎ.పి.కోమల, రావు బాలసరస్వతి, జమునలకు 'హాసం క్లబ్' శుభాకాంక్షలు తెలిపింది. చక్రపాణి, రేలంగి, ఆదినారాయణరావులను, రాజమండ్రితో అనుబంధం పెనవేసుకున్న టంగుటూరి ప్రకాశం గారి అభినయదక్షతను, హాస్యప్రియత్వాన్ని వారి జయంతుల సందర్భంగా స్మరించుకుంది. ఆంధ్రకేసరి సమితి వ్యవస్థాపక కార్యదర్శి వై.ఎస్.నరసింహారావు తమ గురువు హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు జీవితవిశేషాలను, రచనాపాటవాన్ని సభాసదులకు తెలిపారు.



'నవరసాలు అందరికీ అన్నివేళలా అక్కరలేదు. హాస్యరసం మాత్రం పసిబాలుడినుండి బోసినోటి ముదుసలి వరకు అందరూ అన్నివేళలా కోరుకునేది.' అంటూ హాస్యప్రసంగం చేస్తున్న అవధాన సంచాలకులు, సాహితీవేత్త, రీడర్ ధూళిపాళ మహాదేవమణి



'శ్రీమతి హాస్యశ్రీ' స్కిట్ ప్రదర్శిస్తున్న పద్మ, సీత, లక్ష్మి విజయలక్ష్మి

రంపచోడవరం కాలేజి ప్రిన్సిపాల్, ఆంధ్రపద్యకవితా సదస్సు వ్యవస్థాపకులు కీస్రాప్రగడ సత్యనారాయణ అవధానసభలలోని కొన్ని హాస్యసంభాషణలను జనరంజకంగా వినిపించారు. స్థానిక సాయంకాల దినపత్రిక 'సూర్య' సంపాదకులు కృష్ణకుమార్ 'తమ పత్రికలో వారంవారం వెలువరిస్తున్న 'హాసం క్లబ్' సరససల్లాపాలు' శీర్షికకు పాఠకులనుండి మంచి స్పందన వస్తోందని తెలిపారు.

మాస్టర్ అశీష్ (బహుమతి పొందిన జోక్), మన్యం బాబ్జీ (చాంబర్ ఆఫ్ కామర్స్ ఉపాధ్యక్షులు), పళ్లంరాజు (స్టేట్‌బ్యాంక్), వ్యాపారవేత్త శ్రీనివాస్, వెంకటేశ్వరరావు లెక్చరర్ చక్కటిజోకులు చెప్పగా అప్పారావు, హనుమంతరావు 'అతిథిమర్యాద' స్కిట్, హనుమంతరావు, విజయలక్ష్మి 'డ్రెయిన్ ఆఫ్ ఇండియా' స్కిట్ ప్రదర్శించారు. విజయలక్ష్మి అభినయానికి ముగ్ధులైన ప్రేక్షకుడు శ్రీనివాస్ అప్పటికప్పుడు ఒక మెమెంటో బహూకరించారు.

పాటలలో చెప్పుకోదగినవి - పద్మ (బహుమతి పొందారు) పాడిన 'శివరామకృష్ణ గోవింద నహరహి' అనే ప్రార్థనాగీతం,'పాడవే బంగారు చిలకా- పలకవే హృదయాన పన్నీరు చిలకా' (ఈ పాటకు రమణయ్య ధ్వన్యనుకరణతో డోలక్, మువ్వలశబ్దాలు నోటితో వినిపించి వాద్యసహకార మిచ్చారు) బేబీ మాధురి పాడిన 'దేశము మీరై తేజము మీరై' మార్వాడీ అమ్మాయి ఉషాభార్గవి బనలేకా పాడిన 'స్వతంత్రభారత సుమపరిమళములు స్వేచ్ఛగ పీల్చే తెలుగోడా' దేశభక్తి గేయాలు, శ్వేతశ్రీ పాడిన 'గుండుమీద పిలక వుంటుందిలే', నాలుగేళ్ల రామకృష్ణ పాడిన 'ఎల్కేజీ కుర్రాడా-లాలిపప్ నీకు తేనా' ప్యారడీపాటలు, 'నన్నుతాకె నెవ్వరో ఎవ్వరో' (అవధాని) 'అందమే ఆనందం' (శివప్రసాద్), 'భలే మంచిరోజు' (శేఖర్)! 'రామరామ రఘురామ అని పాడుతున్న హనుమ' అని గంగాధర్ పాడగా రాజేష్ కీబోర్డుపై సహకారం అందించారు.

సెప్టెంబరు కార్యక్రమం 18 09 2004 సాయంత్రం అని వివరాలకు అప్పారావు గారిని (ఫోన్ 2438085/ 9885215155)లను సంప్రదించాలని ప్రకటించారు.

## పలాసా

నాల్గవ కార్యక్రమం కౌసల్యారంగనాథన్ ప్రార్థనాగీతంతో ప్రారంభమయి డా॥ శాస్త్రి 'ఊల' (ఈల కాదు) పాటతో ముందుకు సాగింది. దుర్గాప్రసాద్ పాత్రో దేశభక్తిగేయం, కిమ్మోజీ, రమణమూర్తి పాత సినీమాపాటలు పాడగా బూర్జి కోటేశ్వరరావు పేరడీసాంగ్ పాడారు.

ప్రముఖనాటకరంగ కళాకారులు విశ్వేశ్వరరావు, ఆదినారాయణ ముఖ్య అతిథులుగా పాల్గొన్న ఈ సభలో రమేష్, మురళి, నూకరాజు, ఆనందరావు, అంజనేయులు, కామేశ్వరరావు, రామారావు తదితరులు జోక్స్ చెప్పగా ఈశ్వరపాత్రో సినీకళాకారుల గొంతులు అనుకరించారు. బాబ్జీ సభను నిర్వహించగా కామేశ్వరావు, రామారావు, దుర్గాప్రసాద్ పాత్రో, బేబీ మేఘనలు బహుమతులు గెల్చుకున్నారు.

ఈ క్లబ్ మూడవ కార్యక్రమంలో శ్రీనివాసరావు పిల్లనగ్రోవితో చక్కనిపాట వినిపించడంతోబాటు మ్యాజిక్ చేసి నవ్వించారు. ఆపాత మధురాలైన పాతపాటలు పాడిన కౌసల్య ఉత్తమ సింగర్‌గా బహుమతి పొందారు. కొట్ని రమేష్ ఉత్తమజోక్‌కు బహుమతి గెలుచుకున్నారు. ఈ కార్యక్రమం ఈటీవి-2 ప్రసారం చేయడం జరిగింది.



సదస్యులతో తన అనుభవాలు పంచుకుంటున్న ప్రముఖ కళాకారుడు విశ్వేశ్వరరావు

## రాజమండ్రి హాసం క్లబ్‌లో ప్రదర్శించిన - 'డ్రెయిన్ ఆఫ్ ఇండియా' - స్కిట్

భర్త : (ఇంట్లోకి వస్తూ) అమ్మయ్య, మా మేనేజరు గారి తిట్లు తప్పించుకుని ఇంటికొచ్చి పడ్డాను. ఓ కప్పు టీ ఇస్తావుటోయ్!

భార్య : (పాట హమ్ చేస్తూ) డ్రెయిన్ ఆఫ్ ఇండియా! నా ఎదురుగా హాట్‌సీట్‌పై వేడి నిట్టూర్పులు విడుస్తున్న శ్రీ రావ్‌గారు కూర్చుని ఉన్నారు.

భ : వేడి నిట్టూర్పుల సంగతి వదిలేయ్! నాక్కావలసింది వేడి టీ!

భా : (అదే మూడ్‌లో) జస్ట్ ఫాలో మై కమాండ్స్!

భ : పెళ్లయినదగ్గర్నుంచీ చేస్తున్నదదేగా!

భా : ష్! రావ్‌గారూ - యిపుడు మీ కంప్యూటర్ స్క్రీను మీద మా మొదటిప్రశ్న - మీరు క్రితం ఆదివారం మార్నింగ్ వాక్ ఎక్కడిదాకా వెళ్లారు? మీకున్న ఆప్షన్లు నాలుగేనండోయ్ ఎ)పోస్టాఫీసు దాకా బి)బ్యాంక్ దాకా సి)రామాలయం దాకా డి)వీధిచివర దాకా

భ : (చికాకుపడుతూ) టీ!

భా : (సరిగ్గా వినిపించుకోకుండా) 'డీ' అంటున్నారు కదా, రావుగారూ, 'డి' అని మీరు ఖచ్చితంగా ఎలా చెప్పగలరు? ఫ్రీజ్ చేసేసిన తర్వాత పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు.

భ : నేనన్నది 'టీ' అని. అయినా మార్నింగ్‌వాక్‌కి వెళ్లినవాణ్ని నేనయితే అన్సరు నాకు తెలున్తుందా? నీ కంప్యూటర్‌కు తెలుస్తుందా?

భా : మీలాటి బద్ధకస్తులు సండే మూడ్‌లో వీధిచివరదాకానే వెళ్లి ఉంటారన్న సంగతి కంప్యూటరుకు తెలుస్తుంది. చూశారా? 'డి' నొక్కగానే ఫ్లాష్ వెలిగింది. మీరు కరక్ట్! (చప్పట్లు) మీ సంగతి సరిగ్గా గ్రహించిన కంప్యూటరుకు జయజయధ్వానాలు పలుకుతున్నారెవరో ..

భ : ఏడిశావ్‌లే, ఫోన్ మోగుతోంది, చూడు.

భా : ఇపుడు చిన్న బ్రేక్ - చూస్తూనే ఉండండి మా ప్రోగ్రాం, 'డ్రెయిన్ ఆఫ్ ఇండియా'. ఛానెల్ మారుస్తే మామీద ఒట్టే! (ఫోన్ తీన్తుంది) హలో హమ్మ టీవీ! (పాట పాడుతుంది)..అరే కట్ అయిపోయిందే! బ్యాడ్ లక్! మంచి ఛాన్స్ మిస్సయ్యా!

భ : ఎవరోయ్ ఫోను?

భా : హమ్మటీవీ వాళ్లండి. వాళ్లీమధ్య 'ఫోనులో పాట-పాటకో లక్ష' అనే ప్రోగ్రాం పెట్టారు. డ్రాలో మన టెలిఫోన్ నెంబరు వస్తే వాళ్లు ఫోన్ చేస్తారు. మనం ఫోనెత్తి 'హమ్మటీవీ!' అని చెప్పి వెంటనే పాట పాడాలి. అప్పుడు మనకో లక్ష ఇస్తారు. మన ఫోన్ నెంబరు పంపాను. పాపం వాళ్లు ఫోన్ చేశారు కానీ మధ్యలో కట్ అయిపోయింది.

భ : సర్లే గానీ నాకు కనీసం టిఫిన్నైనా పెట్టు.

భా : (వెళ్లబోతూంటే మళ్లీ ఫోను వచ్చింది. ఫోన్ తీసి) హమ్మటీవీ! (పాట పాడుతుంది) అయ్యో..మళ్లీ కట్ అయిందే! సర్లెండి మీకు టిఫిన్ తెస్తా గానీ టిఫిన్ ఏం చేశానో చెప్పండి. మీకున్న ఆప్షన్లు నాలుగు - ఎ)యిడ్లీ బి) ఉప్మా సి)పెసరట్టు డి)దిబ్బరొట్టె

భ : డి

భా : రావుగారూ, ష్యూరేనా? హెల్ప్‌లైన్ తీసుకోరా?

భ : ఏం అక్కర్లేదు 'డి' ఫ్రీజ్ చెయ్యండి

భా : కంప్యూటరు మహాశయా! ఈ రోజు టిఫిన్ 'డి' అనగా దిబ్బరొట్టె అని నమ్మకంగా చెప్తున్నారు - సో, 'డి' ఫ్రీజ్ చేయండి. (కాస్సేపు ఆగి) 'డి ఈజ్ ది రైట్ అన్సర్'. (చప్పట్లు) అవును రావుగారూ, దిబ్బరొట్టె అని ఎలా చెప్పగలిగారు?

భ : (కసిగా) వెరీ సింపుల్ - నాలుగురోజుల క్రితం పప్పు గ్రైండు చేశావ్. మొదటిరోజు ఇడ్లీ, రెండవరోజు గారె - నిన్న దోసె - మరి ఇవ్వాళ దిబ్బరొట్టె కాక మరేముంటుంది? ఎంత తెలివితక్కువ మొగుడైనా చెప్పగలడు.

భా : వండ్రఫుల్! బహుమతిగా మీరు ఎదురుచూస్తున్న దిబ్బరొట్టె,... చిన్న విరామం తర్వాత.. (అంటూ లోపలికి వెళుతుంది)

భ : (ఫోన్ మోగుతుంది. తీసి విని) సార్, సార్..సరే, సరే.. (తల పట్టుకుని కూచుంటాడు)

భా : (లోపలినుండి వచ్చి) ఎవరండి

భ : మా బాస్. ఆయన తిట్లు తప్పించుకొని వచ్చే హడావుడిలో ఫైలొకటి బీరువాలో పెట్టి తాళం వేసి వచ్చేశాను. దాని గురించి ఆయన ఫోను చేసేడట. 'ఫోను చేసిన ప్రతీసారి హమ్మటీవీ అంటూ ఆ పాటలేమిటయ్యా , ఏం వేళాకోళంగా ఉందా?' అంటూ తిట్టిపోశాడు. తక్షణం రమ్మన్నాడు. ఎలా ప్రసన్నం చేసుకోవాలో ఏమో..

భా : (తక్షణం కంప్యూటరు వద్దకు వెళ్లి) రావుగారూ, మీకిప్పుడున్న ఆప్షన్లు నాలుగు. ఎ)నోరుమూసుకుని తిట్లన్నీ తినడం బి) వలవలా యేడ్వడం సి)మా ఆవిడకి పిచ్చి అని చెప్పి సింపతీ సంపాదించడం డి)పాదాలపై పడడం - చెప్పండి దేన్ని ఫ్రీజ్ చేయమంటారు?

భ : (కోపంగా) నీ ప్రోగ్రాంను! లేకపోతే నిన్ను ఫ్రీజర్‌లో పెట్టి తలుపేసేస్తాను. (విసవిసా వెళ్లిపోతూంటాడు)

భా : ఏమండీ, దిబ్బరొట్టె, దిబ్బరొట్టె

భ : (వెనక్కి తిరిగి) హమ్మటీవీ వాళ్లకు ఫోన్లో పంపు!

**రచన - డి.వి.హనుమంతరావు**

## ఏలూరు

**15** 08 04 న జిల్లా కేంద్ర గ్రంథాలయం సౌజన్యంతో వారి ప్రాంగణంలో జరిగిన హాసం క్లబ్ సమావేశంలో పలువురు పాల్గొని పాటలతో, జోక్స్‌తో, మ్యాజిక్‌తో సభను రక్తి కట్టించారు. ఉత్సాహభరితంగా జరిగింది. ప్రారంభంలో ప్రముఖ సాహితీవేత్త, ఇండో-ఇంగ్లీషు హైస్కూలు నిర్వాహకులు డా॥ అల్లూరి నరసింహరాజు 'వందేమాతరం' గీతానికి, స్వాతంత్ర్యోద్యమానికి గల సంబంధాన్ని వివరించారు.

'కంచికామాక్షి', 'లక్ష్మీనారాయణ వైభవం', 'కుమారసంభవం' చిత్రాలకు సంగీతదర్శకుడు, డిప్యూటీ కలెక్టర్ (రిటైర్డ్) కోకా రామారావు 'బృందావనమది' (మిస్సమ్మ) పాటకు 'దునియా రంగరంగీలీ బాబా' పాటకు, నాగయ్య 'వందేమాతరం' చిత్రంలోని పాటకు గల రాగసంబంధాన్ని విశ్లేషించారు. సినీపబ్లిసిటీ ఆర్టిస్ట్ భాస్కరరావు అచ్చుతప్పుల వల్ల పుట్టే హాస్యాన్ని గుర్తు చేసి నవ్వించారు.

వీరితోబాటు డా॥ బి.యస్.ప్రసాద్, దమయంతి, ముక్తేశ్వరి, ఆంజనేయులు జోక్‌లు చెప్పి, సీతారాం దేశభక్తి గేయాన్ని ఆలపించి, అనువాదం' స్కిట్‌తో శర్మ ప్రేక్షకులను మెప్పించారు. వ్యాఖ్యాతగా వ్యవహరించిన 'హాసం' క్లబ్ స్టేట్ కన్వీనర్ ఎస్వీ రామారావు ఆగస్టులో జన్మించిన రేలంగి, జమున జీవితవిశేషాలను వివరించారు. వచ్చే సమావేశం సెప్టెంబరు 19 న జిల్లా కేంద్రగ్రంథాలయంలో జరుగుతుందని ప్రకటించారు.



కీబోర్డుపై 'సారే జహాసే అచ్ఛా' ఆలపిస్తున్న భరత్, అనూప్, వారిని తర్ఫీదు చేసిన స్నేహసుధ ఫైన్ ఆర్ట్స్ ఎకాడమీ ప్రిన్సిపాల్ పుష్పరాజ్, బాలాత్రిపుర సుందరి (వెనుక నున్నారు) 'జోడెడ్లబండి కట్టి' జానపదగీతం పాడారు.

## వైజాగ్

'స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా ఈరోజు నగరంలో 50 కి పైగా సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతున్నా ఈ సభకు 250కు మించి ప్రేక్షకులు హాజరయ్యారంటే, అందునా గాజువాక, సింహాచలం నుండే కాక శ్రీకాకుళం, రాయగడ (ఒరిస్సా)లనుండి కూడా విచ్చేసారంటే - ఉపన్యాసాలు, సన్మానాలు లేని ఇటువంటి హాస్య-సంగీత కార్యక్రమాలకు ఎంత ప్రాధాన్యత ఇస్తున్నారో తెలుస్తోంది.' అన్నారు ప్రియ అతిథిగా విచ్చేసిన 'కళ్లు' చిదంబరం. 'ప్రతీనెలా హాసంక్లబ్‌లో బెస్ట్‌జోక్ చెప్పినవారికి 116/- రూ॥ల నగదు బహుమతి నా జీవితాంతం ఇస్తానని గతంలో ప్రకటించాను. ఇప్పుడు చెప్తున్నాను.దానిని మా చిన్నకుమారుడి జీవితాంతం ఇచ్చే ఏర్పాటు చేస్తున్నాను' అని ప్రకటించి తన కమిట్‌మెంట్ చాటుకున్నారాయన. ఆనాటి కార్యక్రమం స్పాన్సర్ చేసిన ప్రముఖ సినీరచయిత, నటుడు కాశీవిశ్వనాథ్‌గారితో సహా సభికుల హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి. కాగా ఈ సారి 'కళ్లు చిదంబరం' బెస్ట్‌జోక్ అందుకున్న రాంభట్ల నృసింహాశర్మ వచ్చేనెల హాసం క్లబ్‌లో ఉత్తమ ఛలోక్తులకు బహుమతులను తాను స్పాన్సర్ చేస్తానన్నారు.



కళ్లు చిదంబరం బెస్ట్‌జోక్ అవార్డు ఓ.రామారావు నుండి అందుకుంటున్న రాంభట్ల నృసింహాశర్మ



ఉత్తమ ప్యారడీకి రంగాచార్యులు నుండి బహుమతి అందుకుంటున్న పంతుల చక్రంధర్



హాస్యకవితకు మోటూరి శ్రీరామకృష్ణ నుండి బహుమతి స్వీకరిస్తున్న గుండాన జోగారావు, మధ్యలో రచయిత అవసరాల రామకృష్ణారావు

జిల్లా సాంస్కృతిక మండలి సభ్యులు కొ.స.నా., అభినందన హోమియో క్లినిక్ డా॥మోటూరి శ్రీరామకృష్ణ ప్రియఅతిథులుగా విచ్చేసిన ఈ సభలో 40 మందికి పైగా ప్రేక్షకులు చెప్పిన హాస్య, సంగీత అంశాలను ప్రదర్శించి మహారాణిపేట విశాఖజిల్లా కేంద్ర గ్రంథాలయంలో జరిగిన ఆనాటి సభను రక్తి కట్టించారు. రాపేటి అప్పారావు 'సారా దండకం', రంగాచార్యులు ఇంగ్లీషు మంత్రాలు, గుండాన జోగారావు హాస్యకవిత, గుడిమెట్ల గోపాలకృష్ణ చిలిపికవిత, మస్తాన్‌రెడ్డి జోకులు హాస్యవిభాగంలో చెప్పుకోదగ్గవి.

సంగీతవిభాగానికి వస్తే - రఫీ జయంతి సందర్భంగా రామ్‌కుమార్ 'ఏహసాన్ హోగా తేరా' 'ఖోయా ఖోయా చాంద్', శిరీష హిందీ దేశభక్తిగీతం, పద్మజ భక్తిగీతం, జనన్ ఘంటసాల దేశభక్తిగీతం, రామారావు శ్రీశ్రీపద్యం, రమాదేవి పాత హిందీపాటలకు మంచి స్పందన లభించింది. టి.ఎల్.ప్రసాద్ 'తుంటరినై పోయాను', 'నెత్తిమీద కాకి వాలింది' 'కరిచిందిలే కుక్క కరిచిందిలే' మణిరాజ్ 'పెళ్లాడే తీరాలన్నారు నాన్నారు' భారతి 'గోంగూర పప్పుంది' ప్యారడీపాటలు సభ్యులను నవ్వించాయి. పాటలకు జనన్ కీబోర్డుపై సహకారం అందించారు.

హాసంక్లబ్ కార్యక్రమాల ప్రెస్ రిలేషన్స్‌కు సహకరిస్తున్న 'లీడర్' పత్రికకు, వేదికను సమకూర్చిన నాగార్జునమెస్ వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ 19-09-2004 నాటి కార్యక్రమం ప్రేమసమాజం హాలులో నిర్వహించ బడుతుందని కన్వీనర్లు తెలిపారు.

## నమస్కారం

నమస్కారం నమస్కారం నమస్కారం
నమస్కారంలోనే వుంది 'మస్కా' నరం
ఆ నరాన్ని మీటితే పనులు జరుగుట ఖాయం
సెలవు మంజూరీకై బాసుకు గొల్లుగొల్లు నమస్కారం
బిల్లు శాంక్షన్‌కై క్లర్క్‌కు ఘల్లుఘల్లు నమస్కారం
జోలికి రావద్దంటూ పేటరౌడీలకు సాష్టాంగ నమస్కారం
దోచుకోవద్దంటూ ఎమ్మెల్యేలకు పాద నమస్కారం
దొంగ మెడికల్ సర్టిఫికెట్‌కై
డాక్టరుగారికి ముసిముసి నమస్కారం
అద్దెవాయిదాకై ఇంటి యజమానికి ముద్దుముద్దు నమస్కారం
నడివీధిలో పరువుతీయద్దంటూ
కాబూలీకి మురిపాల నమస్కారం
కేసుల తిరకాసు లేకుండా ఎస్సయిగారికి
వొంగివొంగి నమస్కారం
తగవులుపెట్టి చిరునగవులను చిందించే
లేఖరులకు నమస్కారం
రేపటి పేపర్లో నా పేరు వేయబోయే విలేకరులకు నమస్కారం
మోసేయకుండా సహనం కనబరచిన శ్రోతలకు నమస్కారం

- గుండాన జోగారావు

## జగ్గంపేట

ఆగస్టు కార్యక్రమం ఎప్పటిలాగానే జోక్స్, పేరడీసాంగ్, మధురగీతాలు, సాహితీ చమత్కారాలతో జోరుగా సాగింది. ముఖ్యఅతిథిగా ప్రముఖ రచయిత్రి కె.వరలక్ష్మి విచ్చేశారు. ఉషాదేవి, లక్ష్మీదుర్గ, వెంకటేశ్వరరావు, రాఘవులు, ఎమ్‌వివి మూర్తి, విశ్వనాథ్, ప్రవీణ్ జోక్స్‌తో అలరించగా నూజిళ్ల సూర్యనారాయణ ('ఎక్కడో పుట్టి'కు ప్యారడీసాంగ్), రాఘవులు (ఆదిభిక్షువు వాడినేది కోరేది), సూర్యనారాయణ (శివరంజనీ నవరాగిణీ) పాటలతోనూ సభను మెప్పించారు. పిల్లలలో సభాపిరికితనాన్ని పోగొట్టడానికి, వారిలోని హాస్యచతురతను వెలికితీయడానికి హాసం క్లబ్ కృషి చేస్తోందని చెబుతూ కన్వీనర్లు తదుపరి కార్యక్రమం సెప్టెంబరు 5 న జరుగుతుందని తెలిపారు.



ఏలూరు 'హాసంక్లబ్'లో 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' సరోజినినాయుడుపై ఆంగ్లోపన్యాసం చేసిన నైమిష (6 సం॥లు)

**శ్రీకాకుళం 'హాసం క్లబ్' ప్రారంభం 12.09.04న**
వివరాలకు : శ్రీనివాసరావు, ఫోన్ : 240404

**రచన: సి. నారాయణరెడ్డి** **గానం: పి. సుశీల,ఘంటసాల**

సీత : అన్నయ్య కలలే పండెను, చెల్లాయి మనసే నిండెను
బంగారుకాంతులేవో నేడే తొంగి చూసెను ॥అన్నయ్య॥
తోడు నీడా నీవై లాలించే అన్నయ్యా
తల్లీ దండ్రీ నీవై పాలించే అన్నయ్యా
నీకన్న వేరే పెన్నిధి లేనె లేదు
నా పూర్వ పుణ్యాల రూపమే నీవు ॥అన్నయ్య॥
సూర్యం: రతనాల సుగుణాల రాశివి నీవే
అన్నయ్య నయనాల ఆశవు నీవే
నీవు మెట్టిన యిల్లు నిత్యము విలసిల్లు ॥నీవు॥
నీ నవ్వు సిరులొల్కు ముత్యాల జల్లు ॥అన్నయ్య॥
సీత: మా అన్నయ్య మనసే సిరిమల్లె పువ్వేను
చెల్లి కంటతడి వుంటే తల్లడిల్లేను
సూర్యం: నీ పూజలే నన్ను నడిపించు తల్లీ
శతకోటి విజయాలు సాధింతు చెల్లీ ॥అన్నయ్య॥

**రచన: సి. నారాయణరెడ్డి** **గానం: పి. సుశీల,ఘంటసాల & కోరస్**

సరోజ : ఈరోజుల్లో పడుచువారు గడుసువారు
వీలైతే హుషారు కాకుంటే కంగారు ॥ఈ రోజుల్లో॥
తాజా తాజా మోజులకోసం తహతహలాడుతువుంటారు
పొట్టి షర్టులతో టైటు పాంట్లతో లొట్టిపిట్టలవుతుంటారు
మెప్పులకోసం అప్పులుచేసి ॥2॥
తిప్పలపాలవుతుంటారు ॥ఈరోజుల్లో॥
రోడ్డుసైడున రోమియోలలా రోజంతా బీటేస్తారు
సొగసరి చిన్నది కంటపడిందా చూపులతో మింగేస్తారు
ఆ చిన్నదికాస్త చేయివిసిరితే ॥2॥
చెప్పకుండా చెక్కేస్తారు ॥ఈరోజుల్లో॥
పాఠాలకు ఎగనామంబెట్టి మ్యాటిని షోలకు తయ్యారు
పార్టీలంటూ పిక్నిక్‌లంటూ పుణ్యకాలమూ గడిపేరు
పరీక్ష రోజులు ముంచుకురాగా ॥2॥
తిరుపతి ముడుపులు కడతారు ॥ఈ రోజుల్లో...॥
సూర్యం: పడుచువారు గడుసువారు
సహనంలో కిసానులు సమరంలో జవానులు
ఆడపిల్లను గౌరవించితే ఆత్మగౌరవం పెరిగేను
సమరస భావం కలిగిననాడే
చదువుల విలువలు పెరిగేను
దేశానికి వెన్నెముకలు మీరు దివాళాకోరులు కావద్దు
భవితవ్యానికి బాటలు వేసే భారం మనదని మరవొద్దు
ఆ భారం మనదని మరవొద్దు మనదని మరవొద్దు

**రచన: దాశరథి** **గానం: పి. సుశీల**

సీత : మదిలో వీణలు మ్రోగే
ఆశలెన్నో చెలరేగె
కలనైన కనని ఆనందం
యిలలోన విరిసె ఈనాడె ॥మదిలో॥
సిగ్గుచాటున నా లేతవలపు మొగ్గతొడిగింది ॥సిగ్గు॥
పాలవెన్నెల స్నానాలు చేసి పూలు పూచింది ॥మదిలో॥
కెరటాల వెలుగు చెంగలువ నెలరాజు పొందుగోరేను
అందాల తారయై మెరిసి
చెలికాని చెంతచేరేను ॥మదిలో॥
రాధలోని అనురాగమంతా మాధవునిదేలే ॥రాధ॥
వేణులోలుని రాగాల కోసం వేచియున్నదిలే॥మదిలో॥

**రచన : సి. నారాయణరెడ్డి** **గానం: పి. సుశీల, ఘంటసాల**

జయ: ఓ... చామంతి ఏమిటే యీ వింత -ఈ
చినవానికి కలిగెనేల గిలిగింత - లేని పులకింత
సూర్యం: ఓ.... చిన్నారి చెల్లి పెళ్ళి జరిగింది - ఈ
చిలకమ్మకు నాకు వరస కుదిరింది వలపు పెరిగింది
జయ: ఇన్నాళ్ళూ యీ వలపే ఏమాయె- నీ
కన్నుల్లో యీ మెరుపే కరువాయె
సూర్యం: ఇన్నాళ్ళూ నీ హొయలూ చూశాను
నా ఎదలోనే పదిలంగా దాచాను వేచాను ॥ఓ...॥
దూరాల గగనాల నీ మేడ ..... ఓ
దొరసాని ననుకోరి దిగినావా
జయ: నీ మనసే పానువుగా తలచేను - నీ
ప్రాణంలో ప్రాణంగా నిలిచేను వలచేను ॥చిన్నారి॥

**రచన : కొసరాజు** **గానం: పి. సుశీల,ఘంటసాల**

జయ: అమ్మబాబో నమ్మరాదూ ఈ రాలుగాయి
అబ్బాయిల నమ్మరాదూ
ప్రేమించామంటారు పెద్దగ చెబుతుంటారు
పెళ్ళిమాట ఎత్తగానే చల్లగ దిగజారుతారు
సూర్యం: అమ్మబాబో నమ్మరాదూ ఈ రాలుగాయి
అబ్బాయిల నమ్మరాదూ
డబ్బులున్న కుర్రావాళ్ళ టక్కున పట్టేస్తారు
లవ్‌మ్యారేజీ అంటూ లగ్నం పెట్టేస్తారు ॥అమ్మ॥
జయ: కట్నాలు పెరుగునని కాజేజికెళతారు
హాజరు పట్టీవేసి గైరు హాజరౌతారు
మార్కులకోసం తండ్రుల తీర్థయాత్ర తిప్పుతారు
ఇంజనీర్లు డాక్టర్లయి యిక చూస్కోమంటారు॥అమ్మ॥
సూర్యం: వరండాలోన జేరి వాల్చూపులు విసురుతారు
సినిమాలు షికార్లంటు స్నేహం పెంచేస్తారు
తళకుబెళుకు కులుకులతో పైటచెంగురాపులతో
చిటికెలోన అబ్బాయిల చెంగున ముడివేస్తారు॥అమ్మ॥
జయ: ఆస్తివున్న పిల్లయితే అందం జోలికిపోరు
కుంటిదైన కురూపైన పెళ్ళికి యస్సంటారు
సూర్యం: పెళ్ళియైన మర్నాడే శ్రీవారిని చేతబట్టి
బయటికి అత్తమామల దయచేయండంటారు॥అమ్మ॥
సూర్యం: దిమ్మదిరిగి ఏమిటలా తెల్లమొగం వేస్తావు
జయ: వలపు దాచుకుని ఎందుకు మాటలు దులిపేస్తావు
ఇద్దరూ: మనసు మనసు తెలుసుకుందామూ
ఇకనైనా జలసాగా కలిసివుందాము ॥మనసు॥

**రచన: దాశరథి** **గానం: పి. సుశీల,బాలసుబ్రహ్మణ్యం**

చంద్రం: చిలిపి నవ్వుల నినుచూడగానే
వలపు పొంగేను నాలోన
సీత: ఎన్ని జన్మల పుణ్యాల ఫలమో నిన్ను నే చేరుకున్నాను
చంద్రం: చూపుల శృంగార మొలికించినావు
మాటల మధువెంతో చిలికించినావు
సీత: వాడని అందాల వీడని బంధాల
తోడుగ నడిచేములే ॥చిలిపి॥
సరోజ: నేను నీ దాననే - నీవు నావాడవే
ననువీడి పోలేవులే...
కన్నుల ఉయ్యాలలూగింతునోయి
చూడని స్వర్గాలు చూపింతునోయి
చంద్రం: తీయని సరసాల తీరని సరదాల
హాయిగ తేలేములే ॥ఎన్ని॥

**రచన: ఆరుద్ర** **గానం: పి. సుశీల**

జయ: స్వాగతం ఓహో చిలిపినవ్వుల శ్రీవారు
సోగ కన్నులు సైగచేస్తే ఆగలేని దొరగారు
కొంగు తగిలిందా పొంగిపోతారు
కోరి రమ్మంటే బిగిసిపోతారు
ఎందుకో ఎందుకో యీ బింకము
అలిగిన కొద్ది అందము అబ్బాయిగారి కోపము
పిలిచిన ప్రేయసికి యిదేనా కానుక మీ కానుక
బెట్టు చాలును దొరగారు ॥స్వాగతం॥
అందమంతా విందుచేస్తే అదిరిపడతారేం
పొందుగోరి చెంతచేరా బెదిరి పోతారేం
సరసమో విరహమో ఈ మౌనము
అందిన చిన్నది చులకన అందనిదెంతో తీయన
అవతల పెట్టండీ తమాషా పోజులు మహరాజులు
అధిక చక్కని దొరగారు ॥స్వాగతం॥

**రచన: కొసరాజు** **గానం: పిఠాపురం నాగేశ్వరరావు**

చిట్టి: ఏం పిల్లో తత్తర బిత్తర గున్నావు
ఎందుకో గాభర గీభర తిన్నావు
చిలిపి నవ్వులతో కవ్వించు మోము
చిన్నబోయింది ఈనాడదేమో ॥ఏం పిల్లో॥
చ: అందని కొమ్మలకు నిచ్చెన వేశావు
అయ్యో! గాలిలోన మేడలు కట్టావు
వలచిన పేదవాణ్ణి చులకన చేశావు
బలుపేగాని
వలపేగాని
టక్కరివాళ్ళ నమ్మి చిక్కులపాలైనావు ॥ఏం పిల్లో॥
చ: నీ ఒయ్యారపు వాలు చూపులతో
ముసలివాణ్ణి వూరిస్తున్నావు
పడుచువాణ్ణి చేసేస్తున్నావు
బంగరు బొమ్మా
పలుకవటమ్మా
మోజు దీర్చవే ముద్దులగుమ్మా ॥ఏం పిల్లో॥
చ: నీపై కన్నేసి వేషాలేశాను
మెత్తని నీ మనసు గాయం చేశాను
చేసిన తప్పులకు చెంపలేసుకుంటాను
నువు దయజూపితే
నను పెళ్ళాడితే
నిందలు వేసినాళ్ళ నోళ్ళు బందు చేస్తాను ॥ఏం పిల్లో॥

**రచన: శ్రీ శ్రీ** **గానం: పి. సుశీల & ఘంటసాల**

సూర్యం: కళ్ళలో పెళ్ళిపందిరి కనబడసాగె
పల్లకిలోన వూరేగే ముహూర్తం మదిలో కదలాడే
జయ: కళ్ళలో పెళ్ళిపందిరి కనబడసాగె
పల్లకీలోన వూరేగే ముహూర్తం మదిలో కదలాడే
సూర్యం: నుదుట కళ్యాణ తిలకముతో
పసుపుపారాణీ పదములతో
పెదవిపై మెదిలే నగవులతో
వధువు నను ఓరగ చూస్తూంటే
జీవితాన... పూలవాన ॥కళ్ళలో॥
జయ: సన్నాయి చల్లగా మ్రోగి
పన్నీటి జల్లులే రేగి
మనసైన వరుడు దరిజేరి
మెడలోన తాళికడుతుంటే
జీవితాన... పూలవాన ॥కళ్ళలో॥
సూర్యం: వలపు హృదయాలు పులకించి
జయ: మధుర స్వప్నాలు ఫలియించి
సూర్యం: లోకమే వెన్నెల వెలుగైతే
జయ: భావియే నందనవనమైతే
సూర్యం: జీవితాన
జయ: పూలవాన ॥కళ్ళలో॥

# కథా సంగ్రహం

మునిపల్లె గ్రామంలో ధనికరైతు జగన్నాథం. పాలేరు వీరయ్య , నీటి తగవులో యజమాని ప్రాణాలకు తన ప్రాణం బలిపెట్టాడు. వీరయ్య కుటుంబానికి జగన్నాథం యిచ్చిన 10 వేలు వీరయ్య చెల్లెలు మహంకాళి మాయం చేసింది.

వీరయ్యకు ఇద్దరు బిడ్డలు. సూర్యం,సీత. భార్య నిండుచూలాలు. ఆస్పత్రిలో ఆడబిడ్డను కని లోకం విడిచింది. పిల్లలు లేని దంపతులకు ఆ బిడ్డను మహంకాళి అమ్మి, తల్లితోబాటు బిడ్డ చనిపోయిందని సూర్యం, సీతలకు చెప్పింది. ఈ పసికందుల పెంపకభారం తను వహించినట్లు వహించి,గొడ్లచావిడి పనులు చూడమన్నది. వీరికి చెందవలసిన సొమ్ముతో తన కన్న బిడ్డ చిట్టిబాబుకు పెద్ద చదువులు చెప్పించాలని కలలుగన్నది. సూర్యం తనకు చావిడివద్దని చదువు కొంటానని అత్తమ్మతో చెబితే అత్తమ్మ బడితపూజ చేసింది. ఈ బాధలకు ఓర్వలేక సూర్యం సీతతోసహా పట్నం వెళ్ళిపోయి కాఫీహోటలులో చేరాడు. అన్నా -చెల్లెళ్ళు హోటలులో చిల్లర మల్లర పనులు చేస్తూనే చదువులు సాగించారు. సూర్యం తను చదువుకొంటూ చెల్లాయికి పాఠాలు చెప్పి కంటికి రెప్పయ్యాడు.

గ్రామంలో కక్షల కారణంగా జగన్నాథం అన్నగారు, లాయరు అయిన రాజారావు పట్నానికి మకాం మార్పించారు. రైసుమిల్లు పెట్టించారు. మిల్లు చక్రంవలె కాలచక్రం తిరిగింది.

పెద్దవాడైన సూర్యం నీతికి, చదువుకు సదుపమానంగా నిలబడి బి.ఏ.లో మొత్తం యూనివర్శిటీకి ఫస్టుగావచ్చి తన కాలేజీకి పేరు తెచ్చాడు. సీత పనిపాటలకు ఆదర్శగృహిణిగా రూపొందింది.

వీరి సొమ్ముతో చిట్టిబాబును చదువు అందలం ఎక్కించదలచిన మహంకాళికి పొద్దు ఎదురైంది. చిట్టిబాబు పి.యుసి.లో తెగతప్పుతూ పునాదులు గట్టిచేస్తున్నట్లు అమ్మతో చెప్పాడు. పైగా సరోజతోటి ప్రేమాయణం. ఏబిడ్డనైతే వదిలించుకొందామని మహంకాళి ఆనాడు అమ్మిందో, ఆ బిడ్డ సరోజగా ఎదిగి మహంకాళికే ముప్పు తెచ్చిపెట్టేటట్టుంది. కొంచెం జల్సాగా జీవించాలనే ఉద్దేశ్యం సరోజది. చిట్టిబాబు తను లక్షాధికారినని చెప్పుకుంటూ ఆమె సరదాలు తీర్చుతున్నాడు.

జగన్నాథం తన తండ్రి స్థాపించిన కాలేజీకి కీర్తితెచ్చిన సూర్యంను అభినందించ వచ్చాడు. సీతనూ చూశాడు. సూర్యం, సీతలు తన ప్రాణానికై ప్రాణాలొడ్డిన పాలేరు వీరయ్య బిడ్డలని తెలిసింది. తన సహాయంవారికి అందలేదని తెలిసి విచారించాడు. పరిహారంగా వారిని తన భవంతికి చేర్చి 'ఆత్మీయులు'అన్నాడు. వేరొక పట్టణంలో జడ్జీగా వుంటున్న అన్నగారు రాజారావు కుమార్తె జయ, బాబాయ్ భవంతిలోనే వుండి కాలేజి చదువు సాగిస్తున్నది. ఒకనాడు కాఫీహోటలులో కసరుకొన్న సర్వరు సూర్యం, స్వశక్తిపై యూనివర్శిటీ ఫస్టుగావచ్చిన వ్యక్తి అని తెలుసుకోగానే జయకు సూర్యంపై మంచి భావం ఏర్పడింది. ఆ భావం ప్రేమ భాష పలికింది. అయితే తండ్రి రాజారావు ఆస్తులు, అంతస్తులు పాటించే పెద్దమనిషి, జగన్నాథం తరహా మటుకు అదికాదు. పాలేరుకూతురైనా సీతకు గల గృహిణి లక్షణాలకు ముగ్ధుడ య్యాడు.

చిట్టిబాబు లక్షాధికారికాడని సరోజకు తెలిసివచ్చింది. అంతా కల్పించి ఆడంబరాలు చేస్తున్నాడని, చంద్రం చెప్పబట్టే చిట్టిబాబు అసలు స్తోమతను సరోజ తెలుసుకోగలిగింది. ఒకనాడు తనను అమ్మిన మహంకాళితో

బలాబలాలు తేల్చుకోవలసి వచ్చిందికూడా. అయితే అప్పటికి సరోజ, మహంకాళిలకు పరస్పర సంబంధం తెలియదు. అటువంటి మహంకాళి బిడ్డ చిట్టిబాబుకు సరోజ దూరమైంది. తన ఆనంద స్వేచ్ఛా జీవితాలు తీర్చగల వ్యక్తి నిజమైన ధనికుడు చంద్రం. చంద్రం సరోజలో ఆశలు కల్పించాడు. పెళ్ళి చేసుకుంటానని వాగ్దానాలు చేశాడు. అయినా సరోజ తను హద్దులు దాటక, చంద్రంను హద్దుల్లో వుంచి పెళ్ళికి ఎదురు చూస్తున్నది.

తన కొడుకు చంద్రంను తీర్చిదిద్దగలిగింది ఒక్క సీతేనని ఎంచిన జగన్నాథం లగ్నం నిశ్చయించాడు. చంద్రం -సీత వివాహం ఆనందంగా జరగగా సరోజ భంగపడి స్త్రీ తెలుసుకోవలసిన పాఠం నేర్చుకున్నది. అయినా ఆమెను ఒకప్పుడు ప్రేమించి భంగపడిన సదానందం ఒక ముఠాతో ఆమెకు నీడగా, పీడగా వెంటాడి పుకార్లు పుట్టిస్తూనే వున్నాడు.

సూర్యం పోలీసు అధికారి అయ్యాడు. జయ హృదయంలో ప్రేమ ఉప్పొంగింది. రాజారావు పసికట్టి బుసకొట్టాడు.

సీత అస్వస్థురాలైంది. నర్సుగా చేరిన సరోజ సేవచేసింది. చంద్రం తన భవంతిలో నర్సుగా ఉన్న సరోజను చూసి, ఆవేశం ఆపుకోలేకపోయాడు. ఒంటరిగా చూసి నిజంగా సరోజనే ప్రేమించానని, తండ్రి ప్రోద్బలంవల్ల సీతను వివాహమాడక తప్పలేదని చెప్పాడు. సరోజ వినదలచక పోయినా కర్ణాకర్ణిగా విన్న సీత సరోజపై ఎత్తి పొడుపు మాటలు విసిరింది. పెద్ద డాక్టరు,నర్సు సరోజను ఉద్యోగంనుంచి తప్పించారు.

తనవల్ల దుస్థితికి పాల్పడ్డ సరోజకు ఏమైనా సరే న్యాయం చెయ్యాలని చంద్రం తలపోశాడు. ఆమెను వివాహం చేసుకోవడం ఒక్కటే పరిష్కార మార్గంగా తోచింది. ఆ సంగతి తెలిసిన తండ్రి జగన్నాథం భగ్గుమన్నాడు. తండ్రీ బిడ్డల మధ్య తగువు నివారించదలిచింది సీత. సంగతులన్నీ తెలిసిన సీత, చంద్రం-సరోజల వివాహానికి సమ్మతించి భర్తను సుఖపెట్టదలచింది.

అప్పటికే పోలీసు అధికారిగా వున్న సూర్యంకు జయ, సీత సంసారంలో సరోజ వల్ల క్షోభ వచ్చినట్లు చెప్పింది. సరోజను హెచ్చరించి సీత సంసారం కుదుట పరచ దలచాడు సూర్యం. సరోజపై కఠిన భావంతో వెళ్ళిన సూర్యంకు సరోజ సాక్షాత్తు తన చెల్లెలే అన్న పరమరహస్యం వెల్లడయింది.

ఎందరుకాదన్నా, ఎవరేమనుకున్నా సరోజను కాపాడదలచాడు. సరోజ వల్ల రోజురోజుకు చెడ్డపేరు వస్తోందని పెంచిన తల్లిదండ్రులు ఆమెను ఇల్లు వదిలి పొమ్మన్నారు. సరోజను సూర్యం ఆదుకున్నాడు. తన ఇంట్లో పెట్టుకున్నాడు. తన చెల్లెలు సీత అపార్థం చేసుకున్నా పెదవి విప్పలేదు. ఒకరోజు సరోజపై హత్యాప్రయత్నం జరిగింది.

చంద్రమే ఆ పని చేసుంటాడని భ్రమపడి సూర్యం అ నేరం తనపై వేసుకుని అరెస్టయ్యాడు. సరోజను మొదట్నించీ ప్రేమిస్తున్న చిట్టిబాబు వల్ల - సరోజపై హత్యాప్రయత్నం చేసింది మహంకాళి అన్న నిజం బైటపడింది. మహంకాళి అరెస్టయ్యింది. సూర్యం విడుదలయ్యాడు. సరోజ కూడా అతని చెల్లెలేనని అందరూ తెలుసుకున్నారు. అలాగే చంద్రం కూడా తన తప్పు తెలుసుకొని సీతను క్షమించమన్నాడు. నీతనిండు హృదయంతో సరోజను తనచెల్లెలుగా స్వీకరించింది.సరోజ కూడా తన తప్పు తెలుసుకొని చిట్టిబాబు ప్రేమను అర్థం చేసుకుని అతనితో పెళ్ళికి ఒప్పుకుంది.

ఇంతమందికీ ఆదర్శంగా నిలిచి తన చెల్లెళ్ళ జీవితాలను చక్కదిద్దిన సూర్యంపై రాజారావుకు సదభిప్రాయం ఏర్పడింది. తన కూతురు జయనిచ్చి పెళ్ళి చెయ్యడానికి సమ్మతించాడు. ఓశుభముహూర్తాన చిట్టిబాబు సరోజలకు, సూర్యం జయలకు పెళ్ళిజరిగింది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : యద్దనపూడి సులోచనారాణి |
| సినిమా అనుకరణ | :దుక్కిపాటి మధుసూదనరావు |
| మాటలు | : పినిశెట్టి శ్రీరామమూర్తి |
| పాటలు | : కొసరాజు, శ్రీశ్రీ, దాశరథి డా॥ సి.నారాయణరెడ్డి, ఆరుద్ర |
| ప్లేబ్యాక్ | : సుశీల, ఘంటసాల, బాలసుబ్రహ్మణ్యం, పిఠాపురం నాగేశ్వరరావు |
| శబ్దగ్రహణ దర్శకుడు | : ఎ. క్రిష్ణన్, బి.ఎ. |
| సాంగ్ రికార్డింగ్& రీరికార్డింగ్ | : పి.వి. కోటేశ్వరరావు,(భరణి) |
| రికార్డింగ్ | : గోఖలే |
| కళాదర్శకుడు | : జి.వి. సుబ్బారావు |
| నృత్య దర్శకులు | : తంగప్ప,పసుమర్తి కృష్ణమూర్తి |
| కూర్పు | : యమ్.యస్.మణి |
| మేకప్ | : చౌదరి |
| స్టిల్సు | : యమ్.సత్యం (జైహింద్ స్టూడియోస్) |
| పెయింటింగ్స్ | : ఆందోని |
| సెట్టింగ్స్ | : రామచంద్రరావు |
| స్టూడియో | : శ్రీసారథి స్టూడియోస్ (హైద్రాబాద్) |
| ప్రాసెసింగ్ | : ఆర్. రాజన్న |
| పబ్లిసిటీ | : స్టూడియో శర్మ, టి.వి.యస్, ఈశ్వర్ |
| ప్రెస్ పబ్లిసిటి | : యన్. వి.కె. ఆర్. |
| సహకార నిర్మాత | : టి.వి.యస్. శాస్త్రి |
| సహకార దర్శకుడు | : ఆర్. శ్రీనివాసరావు |
| సంగీతం | : ఎస్. రాజేశ్వరరావు |
| ఛాయాగ్రహణం | : పి.ఎస్.సెల్వరాజ్ |
| దర్శకత్వం | : వి. మధుసూధనరావు |
| నిర్మాత | : దుక్కిపాటి మధుసూధనరావు |

## పాత్రలు -పాత్రధారులు

| | |
|---|---|
| సూర్యం | : పద్మశ్రీ ఏ. నాగేశ్వరరావు |
| జగన్నాథం | : గుమ్మడి |
| రాజారావు | : నాగభూషణం |
| చిట్టిబాబు | : పద్మనాభం |
| చంద్రం | : చంద్రమోహన్ |
| జయ | : వాణిశ్రీ |
| సరోజ | : విజయనిర్మల |
| సీత | : చంద్రకళ |
| మహంకాళి | : సూర్యకాంతం |
| నాంచారమ్మ | : రాధాకుమారి |
| పార్వతి | : కె.టి. రుక్మిణి |
| చిన్నసీత | : బేబీ ప్రభ |
| చిదంబరం | : భానుప్రకాష్ |
| డి.యస్. పి. | : మురళీకృష్ణ |
| శ్రీనివాసయ్య | : వెంకటేశ్వరరావు |
| చిన్నసూర్యం | : మాస్టర్ ఆదినారాయణ |
| గెస్టు ఆర్టిస్టు | : ప్రభాకర్ రెడ్డి,ధూళిపాళ. |


డి.మధుసూదనరావు


వి.మధుసూదనరావు


ఎస్.రాజేశ్వరరావు


కొసరాజు


శ్రీశ్రీ


దాశరథి


ఆరుద్ర


సి.నారాయణరెడ్డి


ఘంటసాల


పిఠాపురం


యస్.పి.బాలసుబ్రహ్మణ్యం


పి.సుశీల

22 ఆగస్టు 2004న హైదరాబాద్ రవీంద్రభారతిలో

# సంగీత దర్శకుడు ఎం.ఎస్.విశ్వనాథన్‌కు ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం జరిపిన పురస్కార కార్యక్రమంలో...



అక్కినేని నాగేశ్వరరావు, సినారె, ఎం.ఎస్.విశ్వనాథన్‌ను సన్మానిస్తున్న ఇళయరాజా, శ్రీమతి ఎం.ఎస్.విశ్వనాథన్



ఎం.ఎస్.విశ్వనాథన్‌కు విసు గ్రూప్ ఆఫ్ కంపెనీస్ తరపున రూ.2 లక్షల చెక్కును అందజేస్తున్న డా॥ వై.సోనియారెడ్డి



ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఇళయరాజా, ప్రసంగిస్తున్న బాలమురళీకృష్ణ, ఎం.ఎస్.విశ్వనాథన్



గానం చేస్తున్న శైలజ



ఎం.ఎస్.విశ్వనాథన్ దంపతులతో
సినారె, ఎస్.జానకి, రావుబాలసరస్వతి, రామానాయుడు, ఇళయరాజా



ఎం.ఎస్.విశ్వనాథన్, ఇళయరాజా

